సరస్వతీ గ్రంథమాల: ౪౧

రాఘవరావు సంపాదితము

# ఛిన్నహస్తము

# శిల్పసంపుటము

## 2

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., బి. ఎల్.,



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

182

212

నిజామురాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రాబాదు నెం. 544/566 రు గృహమందు నామపల్లి గౌరీశంకరవర్మ అండుకో, ఆంధ్ర బుక్కుడిపోవారిని మా ప్రతినిధులుగా ఏర్పఱచినాము. కావున నిజామురాష్ట్ర వాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

కృష్ణామండలమునందుండు మా చందాదారుల సౌకర్యార్థమై బెజవాడలో ఆర్. బి. పాల్ అండు కో వారిని మా ప్రతినిధులుగా యేర్పఱచినాము. కావలసిన పుస్తకములు వారికిని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుఁడు.

# పీఠిక

ప్రస్తుత భాషాప్రపంచమున నగ్రగణ్యత వహించిన ఆంగ్లము ప్రసిద్ధి కెక్కుఁగని సమయముఁ, ఫ్రెంచిభాష యనేక సాహిత్యప్రభువుల సమర్థితాకరణముతో మహోన్నతదశను గాంచెను. తత్ఫలముగ పూర్వపు మన సంస్కృత వాఙ్మయమువలెను, నేటి ఆంగ్ల వాఙ్మయమందువలెను ఫ్రెంచిభాషయందు సారస్వత శైవలిని శాఖోపశాఖలతో పొంగి అనేక వికసాత్మ మధురరచనలను పుష్పింపజేసినది. అట్టి ప్రసిద్ధభాషకు జెందిన యొక రసవంతమగు నవలయే యీ గ్రంథమునకు మాతృక. కథావిషయములుకూడ ఫ్రెంచిసీమకు చెందినవే. ఫ్రెంచిరచనలయందు సహజములగు పవిత్రశిల్పములు, వింత పోకడలు ఆంధ్రసారస్వతలోకమునకు పరిచయ మొనర్పవలెనను నా తలంపు దీనివలన సఫలమైన కృతకృత్యుఁడను.

అశ్రాంతము నాయెడల నవ్యాజవాత్సల్యముఁ జూపుచు, నా ప్రయత్నములందుఁ దోడ్పడుచు, పెక్కు తెఱఁగుల నన్ను బ్రోత్సహించు సుహృద్వరులగు దీని ప్రకాశకు లెంతయు వందనీయులు.

కలకత్తా
23-8-29.

సుజనవిధేయుఁడు
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

### ** కృతిసమర్పణము **

చిఱుతప్రాయమునఁ గడలేనియిడుములకుఁ బాల్పడియుఁ జిత్తశాంతిని గోల్పడక, సహనకవచము ధరించి, ధైర్యాసిఁ జేఁబూని జీవితసంగ్రామమున మొక్కవోని పరాక్రమమునఁ బోరి విజయోపేతులై, మేడన్ (Madan), బటోక్రిష్టపాల్ (Butto Kristo Pal), టాటా (Tata), బసివిరెడ్డి (Basivi Reddi), లెస్లీ (Leslie) ప్రభృతులకైవడి ఉన్నతోద్దేశసిద్ధి నడసి, వాణిజ్యమునకు వన్నెఁదెచ్చి, సర్వసంపదసంపన్నులై, సకలసద్గుణసంశోభితులై, పూతచారిత్రులై, అర్థిజనకల్పకంబై, పెక్కేండ్లు కర్మవీరులై సుఖుగడగడపి దివంగతులైన శ్రీశ్రీ అద్దేపల్లి చన్నయ్యనాయఁడుగారి పవిత్రస్మృతి కీకృతిప్రసవము సమర్పితము.

***

౧

మాసము గడచిపోయెను. నెల దినాలలోను కంకణ మపహరించిన కాంత జాడగాని, ఇయల్టాదొరసాని జాడగాని మేక్సిమునకు తెల్లము కాలేదు. సుందరి తెలుఁగెఱిఁగిరండని ఆతఁ డిరువురు యువకులనంప, నా రమణియుండు నెలవున నేరుసుతేరని వారు వాక్రుచ్చిరి. యువకుఁడు స్వయముగ నాతావలమున కరిగి, ఆ వాల్గంటిని గుఱించి వాకపు చేసెను. ఒకులేరును నెఱుఁగకుండ సంగడీనిదోకొని ఆ నెలంత ఎందేని పలాయిత యాయెనని ఇరుగుపొరుగువారు వచించిరి. మేక్సిము తోడనే పోలీసుల నత్తావునకు రావించి, మేడయంతయు కలయ వెదకించెను గాని సందియముఁ గొలుపు వస్తువు లేమియు నందుఁ గానరాలేదు. ఎచటిద్రవ్యము లందందు బడియుండెను. మేడ బాడుగ మూఁడునెలలదనుక ముందే ముట్టినందున నింటి యొడయఁడు నిశ్చింతుఁడై యుండెను. అపరిచితయైన నా సుందరి మాఱుపేరు పెట్టికొని, తనపాలినుండి కంకణము నపహరింప నింతపని సలిపి కృతకృత్యయై అంతర్హిత యాయెననియు, చోరాంగన తన ఛిన్నహస్తమును, చేతి కంకణమును నిజహస్తగత మొనరించుకొని పలాయితయైనందున నిఁక నామెను పట్టఁజాలుట కల్లయనియు యువకుఁ డూహించెను.

నిజపరాజయమునకు హతాశుఁడయ్యు, ఇఁక వెరవేమియు లేనందున యువకుఁడు మనసు కుదుటఁబఱచుకొనెను. కాని, ఆతని చిత్తమంతయు నియల్టాదేవియెడ హత్తియుండెను. రుగ్ణయైన ఆ రమణి చికిత్సకుని యత్నమున నారోగ్యవతి యాయెను. కాని వైద్యుని అనుమతి లేనిదే ఆమెను జూచుట నిషేధమగుడు, తదనుమతికోసరమై యాతఁడు ప్రతీక్షింపసాగెను. ఆ సీమంతినీ శమంతకమును దలఁచిన

కొలఁది యువకుని హృదయ మనురాగస్పర్శచే సంజీవితము కాఁ దొడఁగెను!

ఈ మాసములోపున వర్జర్సు గృహవిషయములు కూడ చాల వఱకు మాఱిపోయెను. విగనరీ ఎలిసుల వియ్యమునకు వలయునెయ్యము జనింపనెంచిన వృద్ధుఁడు శిథిలకాముఁడు కాలేదు. పరిణయమున కించుక గడువుమాత్ర మాతని తనయ వేఁడియుండెను. మఱియుఁగున నామానిసిఁ జూడ నుంకించి రాబర్టు కమ్మవ్రాయుటయు, వారి కల యిక కంకిలివెట్టి మేక్సిమోను మరలించుటయుఁ గూడ నెఱిఁగి, ఇఁక నచిరకాలములో విగనరీయే తన జామాత కాఁగలఁడని వృద్ధుఁ డుప్పొంగఁదొడఁగెను!

చోరుని కొఱకై ఇఁక యత్నింప పనిలేదని వర్జర్సు బోరిమఫ్లు నిశ్చయించుకొనిరి. నగలపేటిక నిఁకఁబడయు నాస వదలుకొని, ఎలిసు భావికల్యాణమును మాత్రమే యపేక్షించుచు, వేఱేమియు నూహింపక దొర మిన్నకుండెను.

వర్జర్సు నిలయమున మఱొకమార్పు చూపట్టెను. జర్జెటుస్థానమున నిపుడింకొక బాలుఁడు పనిచేయుచుండెను. ఏలనో జర్జెటు శిరమున గాటమైన గాయము తగిలెను.—ఒకచేయి ఇంచుమించుగ విఱిగిపోయెను. ఈవార్తఁ దెలుపుచు, వాని పితామహి వర్జర్సునకు జాబువ్రాయ, మేనల్లుని దోకొని వృద్ధుఁడు బాలుఁ డున్నయెడ కరిగి ఆతని దుస్థితికి మిగులఁ బరితపించి, వానిఁజూచిరాఁ దఱచుగ మేక్సిము నచటికిఁ బంపుచుండెను. దెబ్బ మెదడునకు బలముగ దగిలి నందున బాలుఁడు స్మృతిశక్తిఁ గోలుపోయి, తన కాగాయ మేల తగిలెనో చెప్పఁజాలకుండెను.

ఇయల్టాదేవిని గుఱించిన యోచన తక్క తక్కుఁగల తలపుల నన్నిఁటి తన మనసునుండి తొలగింప నెంతయత్నించినను, చౌర్యో

దంతమవిరామముగ నాతనికి జ్ఞప్తి రాఁదొడఁగెను. ఒకనాఁటి నిశీథిని అతఁడావలినుండి యరుదెంచుచుఁ గోఠీయధిపతి యాలయముఁ జొచ్చెను. సమ్ముఖద్వారమునుండి లోపలఁ బ్రవేశించి కోఠీప్రాంగణముఁ జొరకమున్న, చౌర్యము జరిగిననాఁటి రాతిరి సంగతి అతనికి జ్ఞప్తికివచ్చెను. ఆనిశినెయ్యరిఁగూడ, అతఁడత్తావునుండి కోఠీలోనికిఁ జనుచుండ నిరువురు పురుషు లందు నిలిచి, ముంగలతలుపు తెరువఁబడినంతనే అవ్వలకు దాటిపోయిరికదా!—"ఆ యిరువురిలో నొకరు పురుష వేషము ధరించిన చోరాంగనయై యుండవలెను. ఎట్టి ప్రవీణయో గాని నేఁటిదనుక ఆమెజాడ తెలియలేదు. బాగుగ యోచించి చూడ రెండవయాతఁడు సుందరి దండ నామె మేడనుండు వికారాకారుఁడై యుండునని తోఁచుచున్నది. కాని చోరమానిని సుందరి యని తోఁచుటలేదు.—ఏలనన నామె ఛిన్నహస్త కాదు. పరిశీలించి చూడ నామెచేతులు రెండును సరిగనేయున్నవి. ఒకవేళ నాయిర్వురు చౌర్యమొనరించిన జాణ కనుచరులై యుందురు. ఆజాణ జాడ కానఁజాలుట తివిరి ఇసుమునఁ దైలముఁ దీయుటయని తోఁచుచుండెను!!! వికారాంగుఁడు ప్రథమమున చౌర్యోద్యోగమునకై కోఠీపతి సౌధమునకుఁగూడఁ గొనివచ్చిన చేడియయే తన చెడుచెయిదమున చేయి గోలుపోయియుండును. రెండవమాఱు—చౌర్యము సఫలమైన నిశీథిని వింతమానిసి మరల వచ్చియుండునుగాని, హస్తహీనయైన మానిని వచ్చియుండదు. పదంపడి మాయోపాయమున కంకణమును హస్తగతమొనరించుకొన నిశ్చయించి వింతమానిసి సుందరిసాయము నపేక్షించి, ఆమెను నీహారనృత్యప్రాంగణమున కనిపియుండును. కాని, ఆనాఁటిరజని నేనత్తావునకుఁ జనుదునని ఆతని కెట్లు తెల్లమాయెను? తక్కుంగల అన్నివిషయముల వలె నిదికూడ రహస్యమయమై యున్నది!—ఆ రహస్య మెట్టిదైనను, వింతమానిసిప్రేరితులైన దుండ

గులే ఆనాఁటియామిని గాఢతమనమున నన్నుఁ దఱుముకొని వచ్చి రని మనసునకు గట్టిగఁ దట్టుచుండెను. వికారపురుషుఁడు చోరాం గనకుఁ గుడిబుజమై వర్తించుచుండవచ్చును! బలపూర్వకముగ దుండ గుల మూలమున నావిభావరికంకణమును నాకడనుండి అపహరింప వారు నిశ్చయించియుందురు. కాని ఆయుపాయమునఁ గృతకృత్యులు కానేరక వారు వేఱువెరవు నూహించిరి.—రెండవతూరి వారొడ్డిన వాగురమునఁ దవుల్కొనిపోతిని!!!" అని మేక్సిము వితర్కింపఁ బొడఁగెను.

తోరణద్వారము దాటుతఱి ద్వారపాలకుని గదిదట్టుగ దృష్టి నిక్షేపించెను. గదితలుపు పించుక తెరువఁబడియుండెను. దాని నడుమ నిప్పులపొంతఁ జలికాగుచు వెనుదిరిగి కూరుచుని మూవురు పూరు షులు ప్రసంగించుకొనుచుండిరి. ఒక్కరుఁడు ద్వారపాలుఁడు!— రెండవయాతఁడు క్రొత్తగఁ బనిలోఁ జేరిన కుఱ్ఱఁడు!—మూఁడవ వాఁడు పరిచితుఁడైన పనివాఁడు. నిశిసమయమున నిభృతమున వా రట్లు ప్రసంగించున దేమో విన కౌతుకపడి యువకుఁడు దాపున పొంచెను.

శాలకుఁడు—కార్యదర్శి రాబర్టు నిర్దోషియని పలుమాఱు నొక్కి వక్కాణింపఁగలను.

ద్వారపాలుఁడు మిన్నకుండెను.

మూఁడవవాఁడు—అట్లైన నాతఁడు పలాయన మొనరించె నేల!"

"తనయ నాతని కొసఁగి పెండిలి సేయుటకు వృద్ధుఁ డియ్యకొన లేదు గాన నాతఁడు వెడలిపోయెను. ఇనుపపెట్టె నాతఁడు ముట్టలేదని నా కుడిచేయి పందెముగ నొడ్డి చెప్పఁగలను!''

ఈ నుడువులను విని మేక్సి మాశ్చర్యాన్వితుఁడాయెను. "చోర్యో

దంతము నణంచియుంచ నెంత యత్నించినను, నది యెల్లరకుఁ దెల్ల మాయెను! కౌశీపతి సమపద్ధతుల కై వడి కుమారి ప్రణయకాహిని వీరలు విశ్లేషణ మొనరించుచుండిరి!" అని యబ్రపడి, కినుక నణఁచుకొని వార లిఁకేమి చెప్పుకొందురో విన నాతఁ డుత్కర్ణుఁడై అందు నిలిచెను.

ద్వారపాలుఁడు—దొంగ కార్యదర్శియే యని నిశ్చయించుకొనిన వీర లాతని వెతకి పట్ట పోలీసులను నియోగింపకుండు టొక యాశ్చర్యము కాదా?

బాలుఁడు—ముదుసలి అంత తొందర పడువాఁడు కాఁడు. క్రౌర్యమునకు బూనినయెడల, తన తనూభవ వంత కంత మఁడదని ఆతఁడు గ్రహించెను. రాబర్టుయెడ కుమారి అనురక్తయై యుండెనని ఎల్లఁ రెఱుఁగుదురు. అట్టి సుపాత్రు నెన్నుకొనుటం దామె బుద్ధికుశలత తేటపడియెను! లేని గాంభీర్యముఁ జూపు విగనరికంటె నా యువకుఁడు వేయి మడుంగు లెక్కుడుగఁ బ్రియదర్శనుఁడై—

వాని నుడువుపై కడ్డువచ్చి గంభీరస్వరమున మూఁడవయాతఁ డిట్లనెను! "ప్రియదర్శనుఁడైన ఆ యువకుఁడు నిర్దోషియే యగుచో, అయిపుగాని జాడగాని లేక అతఁ డేల అట్టె అంతర్ధానమైపోయెను?"

బాలకుఁడు—కొందఱు కొందరి కాతని కబురు తెలిసియే యుండెను. కాని, సుమారు నెలదినములనుండి ఎవరికిని ఆతని జాడ తెలియరాలేదు. అందులకు నేనొక కారణ మూహించుచుంటిని. ఎవరైన నాతని నెందైన బంధించియుందురు—లేక ఆతని ఉసురులఁ దీసియైన నుందురు.

ద్వారపాలుఁడు—ఒకవేళ అతఁడు అమెరికా కరిగియుండును. అంతియకాని దొంగ అతఁడని నేనుకూడ తలఁపను. ఆ చెడుపని చేసిన దెవరో విందురా?—ఇచట నింతవఱకు పనిచేయు బుడుత

నిదే ఆపని!

"ఎవరు!—జర్జెటా?—అట్లని నేను నమ్మను. పలుమాఱు నన్ను విసిగించువాఁడగుటచే అతఁడన నాకించుక అయిష్టమే యయ్యె, ఇనుప పెట్టెపై ఆతఁడు చేయి పెట్టెనని నమ్మఁజాలను. ఆఱుగంటలు కొట్టి నంతనే పావ మాతఁ డావలికి పోవువాఁడు కదా."

ద్వారపాలుఁడు—అవు నామాట నిజమే. బుడుతఁడు కడు దుండగుఁడు—మూఁడు నెలలకు మున్ను నే నాతని మేజాపైఁ బరుండియుంటఁ జూచితిని. రాతిరియంతయు అతఁడు కచేరీగదిలో నిదురించెను. పని పోవునను భీతిచే నే నావిషయము నెవరికిని తెలుప కుంటిని."

బాలకుఁడు—ఆతఁ డట్లు పరుండియుంట తనకోసరమై యుండదు—ఎవరి ముదల ననుసరించియో ఆతఁ డట్లు కచేరియందు ఆగియుండును. ఇటీవల సగముచచ్చిన అవస్థయం దాతఁడు తెరువునఁ బడియుంట ఎఱుంగుదువా? తమదారినుండి బాలకుని దప్పింప నను కట్టి ఎవరో ఈపని చేసియుందురు!

ద్వారపాలుఁడు—ఇందలి రహస్య మేమో తెలియుటలేదు.

మూఁడవవాఁడు—జర్జెటువిషయమై నే నేమియుఁ జెప్పఁ జాలను. అయితే కుఱ్ఱా! నీ కెన్నేని కబురులు తెలియుచుండును. కుమారి ఎలిను పరిణయము నిశ్చయ మాయెనా?

"రాబోవు ఫిబ్రవరి మాసములో పరిణయమగునని తోఁచు చున్నది. కాని, కుమారియందు పెండ్లికుమారి వాలక మేమియుఁ గానిపించుటలేదు. పెండ్లిఁ గావించుకొనఁజాలనని ఆమె నోరు తెఱచి చెప్పలేకపోవుచుండెను. కాని, రాత్రులం దామె వెక్కి వెక్కి ఏడ్చుచుండునని పరిచారిక నాతో పలుమాఱు చెప్పియుండెను.

ద్వారపాలుఁడు—అచిరములో నామె కూఁటట కలుగక

పోదు. విగనరీకే ఆపె దక్కును! ఇచటికి వచ్చినపు డాతనిచేత కాసైన లేదు. ఇపు డాతఁ డొక్కమాఱుగ కోటీశ్వరుఁడైపోయెను!

బాలకుఁడు—కోటీశ్వరుఁ డైననేమి! అతఁడు వట్టి లోభి! మన యజమానియే యనుకొంటిమి, ఇతఁ డాతని తల దాటిపోయెను!

నేన్తకాని గుఱించిన యనుచిత విమర్శనమునకు కడు కసలి, గది జొచ్చి ఒక్కొక్కని కొక్కొక గ్రుద్దు ప్రసాదింప మేక్సి మూహిం చెను. కాని, ఇంచుక యోచించి ఆత్మసంవరణ మొనరించుకొని మెల్లగా నాతఁ డందుండి వెడలిపోయెను. పరిచారకుల పల్కులు కొన్ని తన చిత్తమును మిక్కుటముగ విచలిత మొనరింప నాతఁ డిట్లని వితర్కింపఁదొడఁగెను. “రాబర్టు దోషియను సందియము పరిచార కులం దిసుమంతైన చూపట్టుట లేదు. నిర్హేతుకముగ—అన్యాయ ముగ నాతనిపై దోష మారోపింపఁబడెనని ఎల్ల రూహించుచుండిరి. ఒకవేళ వారు తలఁచినదే సత్యమై యుండవచ్చును! అది సత్యమే యైన, నేనే పొరపడియుందును. తన కేలుబట్టఁ జూచిన రాబర్టునిక్క ముగ నపరాధియని కుమారికిఁ జెప్పుట నా మొదటి దోషము!—దుండగుఁడగు బుడుతని కాశ్రయ మొసఁగనిచ్చుట నా రెండవ దోసము!—కాని, పరిచారకు లూహించినది యదార్థము కాదేమో! క్రొత్తగఁ బనిలోఁ జేరిన బాలకునికి కుమారిపైఁ గల భక్తి మెండు. రాబర్టుపైఁగూడ నాతని కెక్కుడుప్రేమ! అందుచే నాతఁ డిట్లూహించి యుండును. జర్జలు దుండగుఁడే కావచ్చును. కాని చోరకృత్యమునం దాతని కెట్టి సంబంధము లేదని నా దృఢవిశ్వాసము. ఇయ్యెట్టా దేవినిఁ గలిసికొని, వాని గోనము లెట్టివో యడిగిచూతునుగాక!”

మఱునాఁడు మేక్సిముకొఠీలోనికి మరలనరిగి విగనరీ గదిఁజొచ్చెను. గదియం దన్యోద్యోగులుకూడ పనిచేయుచుండిరి. మిత్రునిఁజూచి విగనరీ మిక్కిలి సంతస పడియెను. కాని తోడియుద్యోగుల మ్రోలఁ

దన యానందముఁ బ్రకాశింపక నెచ్చెలిని దోడ్కొని అతఁడు మఱొక యాగారమునఁ బ్రవేశించెను. ఆగదియం దంతకుమున్న కాగితములు గుట్టగఁ బడియుండెడివి. ఇపుడది పరిశుభ్ర మొనరింపఁబడెను.

"నీ విఁక నచిరకాలములో నెలిసునకు పతి వయ్యెదవుకాఁబోలు!"

"నీ కావిషయ మెట్లు తెలిసెను?"

"ఇంతవఱ కేమేమి జరిగెనో యెఱుఁగను—కాని నీ మొగమున వివాహచిహ్నములు చూచి నే నట్లూహించితిని!"

"సోదరా! నే నిఁక సుఖవంతుఁడను కాఁజాలుదును."

"ఏమేమి జరిగెనో నా కంతయు విప్పి చెప్పుము."

"నిన్న నాకు మంచి తరుణము లభించెను. ఒక ర్తుకయుండ నే నాపె దాపునకుఁ జని, నా మనసునందలి కోరికఁ దెలుప నుంకించితిని. కాని, ఆ నెలంత ఏమి పలుకుటకు నా కవకాశ మీయక ఇట్లనెను! "మీరు నన్ను ప్రేమించుచుంట నే నెఱుఁగుదును. మీ సద్గుణములను నేను గ్రహింపఁజాలితిని. హతభాగ్యుఁడైన నెయ్యుని పక్ష మవలంబించి, మీరు మీ మహత్వమును ప్రకాశ మొనరించితిరి. దానంజేసి మీయెడ నేను భక్తిమెయివర్తించుచుంటిని. మీకును నాకును పెండిలి కావలెనని నా జనకుఁ డపేక్షించుచుండెను. అతని మ్రోల మీరు నా కేలు నొసఁగ కోరుకొనవచ్చును."

"మంచిది. నీ వామె యనుమతి పడసితివిగాని, అది యంత మనఃపూర్వకమైనది కాదు. అట్లని ఆపె వచింప నీ వేమి యుత్తర మొసఁగితివి?—ఆమె యనినట్లు నిశ్చయముగ నీ వాచరించి యుందువు !"

"ఇఁక నందు సందియ మేమున్నది?"

"కాని, నీ వట్లొనరించితివని నేఁ దలఁపను—నీవు బుద్ధిమంతుఁడవు—బుద్ధిమంతునివలెనే నీ వాచరించియుందువని నా గట్టి నమ్మ

కము !’’

“నీ మఱదలు కడు సుందరి. ఆపెయెడ నేను కరమనురక్తుఁడనై యుంటిని. కాని ఆ విషయమున నీ రెండు ఏండ్లనుండి నేను వెల్లడి కావింపలేదు. పెల్లుబ్బు నా యనురాగమును నా యంతరంగమందే యడంచికొనియుంటిని!’’

“నీవు కాక ఆమె ప్రేమకు పాత్రుఁడైనవాఁ డింకొకఁ డుండెనను విషయము నీ వెఱుంగుదువా?”

విగనరీ కన్నులును, మొగమును ఎఱ్ఱబాఱిపోయెను. మేక్సి మెన్నడును తలంపునణంచి మాటలాడువాఁడుకాఁడు. నెయ్యరి నుద్దేశించి ఆతఁ డిట్లనెను. “ నిన్ను నిరుత్సాహుఁగావింప నేను వాంఛింపను.- కాని, ఈవిషయమున నే యోజించినదేమో నీకుఁ దెలుపు టుచితము కదా! ‘నీయెడ భక్తిఁగలిగి, భవిష్యమున నిన్ను పెండ్లికావించుకొనుట కియ్యకొందు’ నని కుమారి తెలిపెఁగదా!—ఆపె నుడువుల భావమేమి? కాలక్రమమున తాను నిన్ను ప్రేమింపఁజాలునని యూహించియే ఆమె యట్లనెను. హృదయపూర్వకముగ నామె మఱొక్కరుని ప్రేమించెనని నీవెఱుంగు టుచితము. విషాదకూపమున నాతఁడు పడకయున్నయెడల, నిక్కముగ నామె వాని కీవఱలోనే యర్ధాంగియై యుండెడిది. ”

“ అట్లని నే నెఱుఁగుదును.”

“ నీమనసున నెట్టి ఈసునులేదని నే నెఱుఁగుదును. కాని, ఇంచుక తడసిన మేలుకదా—రాబర్టుపై నిర్హేతుకముగ నేర మారోపింపఁబడెనని తలంపవా?”

విగనరీయాననము వివర్ణమైపోయెను. మృదుస్వరమున నాతఁ డిట్లనెను. “నిర్దోషియేయైనయెడల, ఆతఁ డింతకుమున్నే తిరిగి వచ్చియుండును.”

"ఒకవేళ నాతనికి మరణ మాసన్నమైయుండెనేమో!"

"మరణమా! ఇట్టితలఁపు నీమనసున నేలతట్టెను?"

"నిన్నరేయి కోర్టుప్రాంగణమున ప్రవేశించుచుండ, తమగది యందు పరిచారకు లాడికొనునుడువులను వింటిని. ద్వారపాలుఁడును, క్రొత్తగఁ బనిలోచేరిన బాలకుఁడును కార్యదర్శిహతుఁడై యుండు నని యనుకొనుచుండిరి!"

"అతఁడు హతుఁడైయుండఁడు.—ఫ్రాన్సు రాష్ట్రమువీడి ఎందేని చనియుండును."

"అట్లని నిశ్చయముగ నెఱుఁగుదువా?—దొంగతనము జరిగిన మఱువారమున నాతఁడు పేరిసువీడునందుండెను. బండినుండి అతఁడు చనుచుండుట నాకన్నులతోనేఁ జూచితిని. పదంపడి అతఁడకాత్తుగ నంతర్హితుఁడాయెను. ఆతని యాచరణము నాకుఁ గడు నబ్బురముగఁ దోఁచుచుండెను."

"ఇం దబ్బురమేమియు లేదు.—రాబర్టు మొదట తనయూరున కరిగెను. అందు రెండుమూఁడుదినము లున్నపిదప అతఁడు పేరిసు నగరమునకు మరలివచ్చెను. ఇందులకు బొరిమప్‌దొర ఋజువొసఁగఁ గలఁడు."

"నే నాదొం నంతగా నమ్మఁజాలను.—నీవాతని బాగుగ నెఱుఁగుదువా?"

"ఎఱుఁగను. ముదుసలియగు వర్జిస్సునకును, ఆతనికిని చాలసఖ్యము కలదు. రాబర్టువిషయమై వారిద్వరు విశేషయోచన సల్పుచుందురు.—సోదరా! చర్యయంతయు చూచుచుంటివికదా!—ఇందు నీయభిప్రాయమేమి?"

"నాకంతయు దురూహ్యమైయున్నది.—నిక్కంపుదొంగ ఎవరో ఇంకను తెల్లముకాలేదు. నాచేతినుండు కంకణ మెట్లపహరింపఁబడెనో

ఎఱుఁగుదువా?—జరిగినదంతయు ఘోరరహస్యజాలమున నావృతమై యున్నది. జర్జెటువిషయమై మన మేమియు సందియపడలేదుకదా! అతని కీచౌర్యసంఘటనముతో సంబంధముండెనని పరిచారకులంద ఱూహించుచుండిరి."

"ఏమి! అటులనా?—వానినేకదా నీ వానాఁ డెంతో ప్రశంసించితివి!!"

"పరిచారకుల పల్కుల నేనంతగ పాటించుటలేదు.—కాని, ఈ కలహమందుండువారిలో నెవరో దొంగ చెయ్దమున నుండిరని మొదటి నుండి నే ననుమానించుచుంటిని. జర్జెటన్నివేళల నీగేహమున విచ్చల విడిగాఁ దిరుగుచుండును. ద్వారపాలుని పనియందలి లోటుల నాతఁడు బాగుగ నెఱుఁగును. ఈబిలమున నెందేని అడఁగియుండి, తరుణమును గనుపెట్టి దొంగలకు బుడుతఁడు తలుపు తెఱచియుండును."

"కాని, అతఁడు దాఁగియుండుటకు తావేది? ఈచిన్నగదితక్క అడఁగియుండుట కాతనికి చోటులేదు. దొంగతికము జరిగినపుడీగది యంతయు కాగితపుగుట్టచే నిండియున్నందున నెవరుగాని ఇందు నిలుచుటకు తావులేదు.—ఈవిషయమిట్లుండ, పెండ్లిమాటేమందువు?"

"శుభవార్త విని నీవు మిగుల సంతసపడుదువని నేను తలంచితిని. కాని, అందులకుబదులుగ నీవు రాబర్టువిషయ మెత్తుచుంటివి!!! చాలినంతకాలము నే నాపక్షమును సమర్థించితిని. ఇఁక నాతఁడు మరలిరాడని నిశ్చయించి, నే నీకల్యాణము నపేక్షించుచుంటిని. ఇట్లపేక్షించు టనుచితమా?

"సోదరా! నాకేమియు తెలియదు—మన్నింపుము. నీవు నాకంటె వేయిమడుఁగు లధికుఁడవు.—నే నిఁక కార్యదర్శివిషయము నీకడఁ దలపెట్టను."

కౌశీపతి గృహమువీడి మేక్సిము ఇయుల్లాచికిత్సకుని చూడఁబో

యెను. ఇంచుక తడసినంతనే వైద్యుని దర్శనమాయెను. ఆతని యాననమున చింతారేఖలు చూపట్ట, నుద్విగ్నుఁడై, యువకుఁడు "దేవిపీడ మరల నధికమాయెనాయేమి?" అని వానిఁ బ్రశ్నించెను.

వైద్యుఁడు—ఆమెకు క్రమక్రమముగ గుణము కానుపించుచునేయున్నది.—మృత్యువునోటినుండి ఆమె దాఁటెను!

"ఇట్లని విని మిగులసంతసపడుచుంటిని. కాని, మీయాననము చూచినంతనే నాకు భీతి—

"గుణము కానుపించుచున్నను, ఆమెనుగుఱించిన భీతియింకను నా చిత్తమునుండి తొలఁగిపోలేదు."

"మెలకువతో మెలఁగ మీరామెలఁతను హెచ్చరింపుఁడు. మీమాట నామానిని పాటింపదా?

"నేఁడే ఇలువీడి, బండిమీఁద షికారునకై చన ఆమె సిద్ధపడెను. వలదని పలుమాఱులు నేను వారింప నామె చన విరమించెను. ఎల్లప్పుడామె ఏదియో చింతించుచుండును! ఆమె కావించుయోచన యేమో నాకావంతైన బోధపడుటలేదు. మీమాతులతనూభవయెడ కార్యదర్శి అనురక్తుఁడై యున్నట్లును, ఆయెలనాఁగకూడ వానిపై ననురాగదృష్టులు పఱపినట్లును, దానంజేసియే కార్యదర్శి తన యుద్యోగమునుండి తొలగింపఁబడినట్లును, మీనోల నామె వినియుండును"

"నేనీయుదంతము నాకాంతకుఁ దెలుపలేదు.—ఇయట్లా దేవియే మొదట నీప్రసంగమునుదెచ్చెను. ప్రసంగమును మాఱుప నేను ప్రయత్నించితిని."

"కాని, ఆయువదయెడ నీప్రణయచారిత్రము గాటముగ నాటుకొనిపోయెను! నిర్హేతుకముగ రాబర్టు నిపీడితుఁడగుచుండెనని ఆమె యోచించుచుండెను. ఆయువకుని జనకుఁడు దేవికి నెయ్యుఁడై యుండువాఁడు, అందుచే నామె ఆతనిపక్షము నవలంబించుచుండెను. పరస్ప

రానురాగబద్ధులై, హతాశులైన ఎలిసు రాబర్టు లిరువురకు సుఖమొన గూర్ప నామె నిశ్చయించెను.''

" కుమారి తన పూర్వ ప్రణయకాహిని విస్మృతించి, మఱొకని కేలుఁబట్టసమకట్టెను. ఒక కుట్టని నుడువులను విని, ఇయుల్లాదేవి విచలితచిత్తయగుచుండెను. ఈ సంగతులన్నియు నామెకుఁ దెలిపిన వాఁడు జర్జెటని మీరెఱిఁగియేయుందురు."

" ఇఁక నాతఁడేమియుఁ దెలుపఁజాలఁడు. పాపము బుఱతనికి మతిచలించిపోయినది. జ్ఞాపకశక్తి పూర్తిగ పోయెను !"

" ఏమి !—ఎన్నఁడును ఆతఁడిట్టి స్థితిలోనే యుండునా ?"

" ఉండుననియే అడలుచుంటిని.—బాలునికొఱకై మిక్కిలి చింతిలుచుంటిని.—నాప్రార్థన మొకటి మన్నింతురా ?"

" అదేమి ?

" దేవితో ప్రసంగించునెడల, ఉత్తేజనకరమగు నేధోరణియందుఁ దిగఁబోకుఁడు. ఈ ప్రణయచరిత్రము నామె చర్చింప దొరకొన వచ్చును. కాని, అట్టి ప్రసంగమును మీరణఁచివేయుఁడు".

" మంచిది. మీనుడువుల తెఱఁగునుబట్టి నాకనతి కాలములో నాతిలోఁగఱిదర్శనము కలుగునని తోఁచుచుండెను !"

" అనుదినము మీరామెకుశలమరయుచున్నందుల కామె మిగుల సంతసించెను. మిమ్ము చూడ నాసరోజాక్షియాకాంక్షించుచుండెను. వలదని మిమ్ము వారింపఁదలఁచితిని కాని ఉత్తేజనకరమగు ప్రసంగము నకుఁ దావీయనని మాట యిచ్చియుంటిరిగాన మిన్నకుంటిని".

" మేము ప్రసంగించుతఱి మీరుకూడ దాపుననుందురా ?"

" ఉండను.—ఇన్నినాళ్లనుండి అన్యరోగులదెసఁజూడనైన లేదు. నేఁడొక పర్యాయము వారినిఁ జూచిరానిశ్చయించితిని.—ఇదిట్లుండ, ఏకాంతమున మీతో మాటలాఁడ నాకాంతవాంఛించుచుండెను !''

మేక్సిమునుదోకొని చికిత్సకుఁ డియల్టాదేవియున్నయెడ కరిగెను. యువకుఁడు గదిసారకమున్న 'నేజెప్పినది మఱువకుడుసుఁడీ' అని భిషగ్వరుఁడు హెచ్చరించెను. విచిత్రాలంకార సంశోభితంబై, నానావిధ ప్రసవమాలావిరాజితమైన ఒక యాగారమున యువకుఁడు ప్రవేశించెను. కడుంగడు సుందరమైన యొక తల్పముపై నియల్టాదేవి యొరగి పన్నుండెను. పీడనుండిలేచినది కావున నాపదఁతి మొగమించుక వివర్ణమైయుండెను. కోమలస్వరమున నాకోమలాంగి "దయచేయుడు. మీయాగమునమే నిరీక్షించుచుంటిని" అనెను.

"మిమ్ముజూచినంతనే నాకు కలిగిన ఆనందమింతింతని తెలుపఁజాలను."

"వైద్యుఁడు నిషేధింపకనేయున్నయెడల, ఇంతకుమున్నే మిమ్ము రావించియుండుదానను—ఎన్నిమాఱులో అంతరంగమున చికిత్సకుని దూషించితిని."

"మీప్రాణములు నిలిపి మిమ్ముఁ గాఁపాడినందులకై నేనాతని యెడ సదా కృతజ్ఞుఁడనైయుందును."

"నిక్కముగ నేను మరణాపన్ననైపోతిని. కాని, కాలమురానిదే ఎట్టినెగులైనసట్టిచేటు కలిగింపలేదు.—దైవానుగ్రహమున నే నిపుడు సంపూర్ణారోగ్యవతినైయుంటిని."

"అట్లని చికిత్సకుఁడుకూడ చెప్పియుండెను."

"ఇంకనుకొంతకాల మెవరినిగాని జూడవలదని అతఁడు వారించియుండెను. కాని, నేనాతనిపలుకులను పాటింపలేదు. పాటించిన యెడల, నేఁడు నాకు మీదర్శన మబ్బకనేయుండును."

మేక్సిమానీసుడాయెను. ఇఁకేమి ప్రసంగింపవలెనని అతఁడూహించుచుండ, దేవియిట్లనెను. "మంచానఁబడినది మొదలు నా బ్రతుకును గుఱించి నేనెన్నియోగతులఁ దలంచితిని! ఈ విధమున జీవనమతి

వాహిత మొనరించుట కడుకష్టము ! ! ఇంక గ్రొత్తతెరువుం బట్టు టుచితమని యోచించితిని !!!"

" ఇందుండి వెడలిపోవ నపుకట్టుచుంటిరా ?

" లేదు.—అట్టియనుమానమునకు, హృదయమునచోటీయకుండు. ఒకవేళనొండుతావునకుచనినను, సత్వరమే తిరిగివత్తును. విచ్చలవిడి బ్రదుకున నాకేమియు సుఖము కానుపించుటలేదు. సాధారణ గార్హ స్థ్యజీవనమే తృప్తికరమును సుఖకరమును అని తలంచుచుంటిని !!! ఒక ఇంటిదాననగుటకై ఏకాంతమున తపించుచుంటిని !!!

మందస్మితవదనుండలుండై, యువకుండు, " సంసారసుఖమేమో మీ రెఱుంగరు కాంబోలు " ననియెను.

" ఎఱుంగని దాననగుటచేతనే ఎఱుంగనిమకవడుచుంటిని. నేం జరించుతెగవారు కేవలమామోదమును మాత్రమభిలషించుచుందు రు—ఉచ్ఛృంఖలచారిత్రులై మెలంగుచుందురు. ఇంక నేనట్టి జీవ నము నపేక్షింపను. నాకిపుడు తామం తోడుపడితిరేని, వారితోం గల నాసంబంధశృంఖలమును భిన్న మొనరించుకొనంగలను !"

జవ్వనిపలుకులు యువకునాశ్చర్యాన్వితుంగా వించివైచెను. అతండు పాలుపోకుండెను. ఏదేని నిర్జనస్థానమునం దనతో నాబిసరుహాక్షి హాయిగం గాలముం బుచ్చవాంఛించుచుండెనని అతండు గ్రహించెను.

యువకుని ఆననమున అబ్బురపు చిన్నెలను విలోకించి, లేనవ్వు వదనవనజమునందోంప యువతి ఇట్లనెను. " నావాక్కులను మీరు హృదయంగమమొనరించుకొనంజాలనట్లు తోంచుచుండెను. మోహిని మీరిపుడు చూచుచున్న దీనదాలో విచ్చలవిడిగం దిరుగు మచ్చెకంటి కాదు—గృహస్థమహిళమాడ్కి వసింప నువ్విళ్ళూరువధూటి ! నేనిం తగ మీతో నేల పరిసంగించుచుంటినో గ్రహించియే యుందురు— మీవంటి సద్వంశోద్భవులసంబంధము నపేక్షించియే ఇట్లు వచించు

చుంటిని !"

ప్రఫుల్లవదనుఁడై యువకుఁడామె సౌందర్యసుధను కన్నులారఁ గ్రోలఁదొడఁగెను.

"మీమాతులనందనిపై నాకనురాగముమెండు—ఆమె చెలిమి వాంఛించుచుంటిని."

"మీకంటె నామె పిన్న."

"అవును. నాకిరువదితొమ్మిదేడులున్నవి—కుమారికంటెఁ బదేడులు పెద్దదానను. నాచెల్లెలిగ నామెను ప్రేమింతును. ఇత్తఱి ఆమెతో నొక పర్యాయము ప్రసంగింపవాంఛించుచుంటిని."

"అందుకామె మిక్కిలి సంతసపడును—అచిరకాలములో నామె పరిణీత కాఁగలదు."

"కార్యదర్శిని జామాతఁగావించుకొన నీమాతుల నిశ్చయించెను కాఁబోలు."

చికిత్సకునొద్ద నిట్టిప్రసంగమునకుఁ దావీయనని మాట యిచ్చినను, అడిగినప్రశ్నమున కుత్తరమీయకుండు టనుచితమని యోచించి యువకుఁడిట్లనెను. "వరుఁడు కార్యదర్శి కాడు—నానెయ్యుఁడు విగనరీ. మామగారి సొత్తునందొక యంశమున కాతఁడధిపతి యగును."

"కుమారి రాబర్టును ప్రేమించెనని మీరు వచించియుంటిరిగదా?"

"పందొమ్మిదేడుల పడుచు మొదట భ్రమఁబడవచ్చుగదా?"

యువకునిహృదయమందలి యంశముల నేరుపునఁ బరించులాగున దేవి యాతనిఁ జేఁజిచూచి ఇట్లనెను. "సుందరా! మీయింటిసంగతులన్నియు నాకుఁ దెల్లమైపోయినవి. జర్జెటు నాకన్ని విషయములు విప్పిచెప్పెను!"

"అతఁడు పిన్నవయసువాఁడు. ఏమిచెప్పఁబోయి అతఁడేమి చెప్పెనో! రాబర్టుయెడ వానికి భక్తివిశ్వాసములుమెండు—కుమారి

కాతఁడే వరుఁడగునని బాలుఁడు నిశ్చయించుకొనియుండును.— రాబర్టు ఆత్మాత్తుగ నెందో యరిగెను!"

"మీమాతులయేకదా అతనినట్లు సాగనంపిరి. దురంతమైన చౌర్యాపరాధమాతనిపై మోపఁబడెనుకదా! మాయుకాళముచే నినుపమందసముఁ దెఱచి, బొరిమఫ్ దొరనగలపేటిక నెవరో దొంగిలించుకొంట జర్జెటు చూచియుండెను. అపహరణవృత్తాంతము విగసరీ మీమాతులకెఱిగింపఁ గార్యదర్శి ఇంట లేనందున ఆతనితల మీఁదనే అపవాదభారము పడెను—చూచితిరా! నాకంతయు కరతలామలకమాయెను!"

"ఛిన్నహస్తవిషయము మాత్ర మీపె యెఱుఁగదు—ఎఱిఁగియున్నయెడల దానియుదంతమును కూడ నేకరువుపెట్టియుండు"నని యువకుఁడు యోజించెను.

"రాబర్టు అపరాధి కాడని నాదృఢవిశ్వాసము. పనివీడి చనిన కతిపయదినములకు ఏకాంతమున నాతనికిని, వాని ప్రణయినికిని జరిగిన ప్రసంగమేమో తెలుపుదురా?—నాకడ మీరేమియుదాపరిక మొనరింపరని నాయాశ."

"ఆమెను చూచుటకై నిరూపితస్థలమున కాతఁడు పోలేదు!"

దేవి ముఖము మఱింత వివర్ణమైపోయెను.—ఉత్తేజితస్వరమున నా యువిద "మీరు వచించునది నిక్కమేనా!" యనెను.

"నిక్కముని ప్రతినచేసి పలుకగలను."

"పదంపడి ఆతని యుదంత మేమియు తెలియరాలేదా!"

"లేదు. చెప్పెడిదేల? ప్రాణసమానయగు ప్రణయినికైన నాతఁడు పత్రము వ్రాయలేదు."

"వాని వార్త ఏమియు నెఱుఁగక, అతఁ డపరాధియని కుమారి తలఁచెను.—దానంజేసియేకదా ఆమె వాని యాన పరిత్యజించెను!

రాబర్టు చెప్పుదాని వినక, అతఁడు నేరస్తుఁడని ఆనెలంత నిశ్చయించెను. కాని స్వాధీనుఁడు కానందున వచ్చుట కాతనికపుడు సాధ్యము కాలేదని ఆపె యోచింపలేదు."

"అతఁడు స్వాధీనుఁడో కాడో నే నెఱుఁగను కాని, రాబర్టు పేరిను పట్టణమందే యుండెనని నొక్కి చెప్పఁగలను. రమ్యమైన శకటమెక్కి చనుచుండ నేనాతనిఁ గన్నులారఁ గాంచితిని. క్రమక్రమముగ నాతఁ డిందుండి వెడలిపోవ యత్నించుచుండును."

"అట్లని నే నమ్మఁజాలను. ఎవరో అతని బంధించియుంచిరని నా దృఢవిశ్వాసము. అందుచేతనే అతఁడు స్వయముగవచ్చి నిజనిర్దోషత్వమును నిరూపించుకొనఁజాలకపోవుచుండెను. వాని నెవరైన హత్యఁ గావించిరని నేఁ దలఁపను. వాని రాకయం దెవరిలగ్గునిహితమై యున్నదో వారే వాని కదలమెదలనీక ఒకచోఁ గైదిఁ గావించి యుందురు!"

"అట్లే కావచ్చును.—కాని, అతఁడు సజీవుఁడై యున్నయెడల వాని వెతకిపట్టుకొనఁజాలుదును. కుమారితో నొకమాటే లప్రసంగింప వాంఛించుచుంటినో గ్రహించితిరా?"

"ఇపుడైన బాగుగ గ్రహింపనేరనైతిని."

"నే నీపెండ్లి కంకిలివెట్టెదను. ఈకల్యాణము కతన కుమారి యావజ్జీవము సుఖరహితమై, మరుభూమిమాడ్కి నుండును. ఆబాలకు సుఖముఁ గూర్చుదునంచు నేను ప్రతినవూనితిని. నేఁడుకాకున్న మఱి కొంతకాలమునకైన రాబర్టు నిరపరాధియను విషయము ఋజువు కాకమానదు.—అట్టి ప్రమాణము చూపుభారము మీపైనున్నది!"

"ఏమి!—నాపైనా? అతఁడు నిరపరాధి. కాక, అపహారణమునఁ జేయి చేసుకొనెనని విశ్వసించియుంటిని.—ఇపుడీ యసంభవకార్య భారము నాపైఁబడుటేమి! చాల యాశ్చర్యముగ నున్నది!!"

"ఇది కేవల మనుచితమైనసమ్మిక!— ఈకాని సమ్మిక మీయందు మాఱక మానదు'' అని దేవి దృఢస్వరమున పల్కెను.

"రాబర్టుయెడ నా కెట్టివిద్వేషములేదు.—కాని, ఇత్తఱి పెండ్లి యంకిలికి నే నీయకొనను. ఏలనన వరుఁడగువాఁడు నాకంతరంగ మిత్రుఁడు!"

"అట్లని నేనెఱుఁగుదును. కాని ఈ పాణిగ్రహణము కాకుండ జేయుటే మీముఖ్యకర్తవ్యము! ఈ పరిణయముకతన మీనెచ్చెలి సుఖింపఁజాలదు. పెండ్లియైనపిదప రాబర్టు నిరపరాధియని ఋజువై అతఁడు మరలి యరుదెంచునో కుమారిచేతన మెట్లుండునో యోజింపుఁడు. రాబర్టు నామె మనఃపూర్వకముగఁ బ్రేమించెను. అతఁడొక ఘోరాపరాధ మొనరించెనని దురూహాపడి, వానిఁబడయు నాస నాసీమంతిని ఫీడివైచియుండును, కాని శైశవంపుసంగడీని స్మృతి ఆపె హృదయమందు మాపుగాదు. నేనాఁడుదానను!—రమణీహృదయమందలి రహస్యమును నేను బాగుగ గ్రహింపఁ జాలుదును! నిజహృదయముతో దారుణమైన ప్రవిదారుణ మొనరించి, ఆత్మవిదళన మొనరించుకొని యడరు నా యనద, శాంతిపడయఁజాలు నాసనన్యని పాణిపట్ట సమకట్టుచుండెను! కానిఁ తాఁబడు బమ్మెర నామె పిదప గుఱుతింపఁగలదు! అపుడు వెనుకంజవేయుట కెట్టి వెరవు నుండదు! ఈ యుద్వాహబంధనమును వేసూఱు ధిక్కరించుచు నిజహృదయసముద్భూత తుషానలమున నామానిని మ్రగ్గిపోవును!"

ఇట్లు నుడువుచుండ నాకాంత కన్నులు తేజఃపూరితములై పోయెను!—ఆపె దృక్కులు భావగర్భితములై యుండెను! వానిఁగాంచి, విస్మితుఁడై యువకుఁడిట్లు యోచింపసాగెను. "ఎందును నెన్నఁడుఁగాని చూడనివానిని ఈ రమణి రక్షింప నిట్లు కృతనిశ్చయురాలగుచుండెనేల ? బాలకుఁడగు జఠ్జెటున కీ దొంగఱికమున సంబంధ

ముండియుండునేమో! యజమానురాలి మ్రోల నతఁడు, నిజమంతయుఁ దెలిపి యుండవచ్చును! అందుచే నిరపరాధునిఁ గాఁపాడ నామె సంసిద్ధయగుచుండనోపు! చెడుచెయువున బాలకుని పాలేమో ఆమె చెప్పఁ దలఁచుటలేదు. కాని, వానియొప్పమివలన రానున్న ముప్పు నా యొప్పులకుప్ప తప్పింపఁదలచుచుండెను!''

"నాకీవిషయమునఁ దోడుపడెదరా?''

"నిక్కువముగ మీకు నే నోపిన తోడ్పాటు సలుపుదును. నేనేమి యొనరింపవలెనో తెలుపుఁడు. ఆలసింపక మీయాన శిరసావహించెదను."

"మొదట రాబర్టు నెట్టులైనఁ గన్గొనవలయును."

"వెతకు టెన్నేమో నాకు తోఁచుటలేదు"

"నేఁ దెలుపుచుంటిని—జర్జెటును మీ రెఱుఁగుదురుగదా! బాలకుఁడు కడుచతురుఁడు!—బుద్ధిమంతుఁడు! రాబర్టు నాతఁడు మిక్కిలి ప్రేమించును. దురదృష్టవశాత్తు వానిచేయి విఱుగకున్నయెడల, ఇంతకుమున్నే బుడుతఁడాతని వెతకి కనుఁగొనఁజాలియుండును!—అట్లొనరింప నేరకున్నను అతనికి వాటిల్లిన కీడేమో తెలుపనైనఁ గలిఁగియుండును! కీడులో మేలాతఁ డిపుడు బ్రదికి బయటఁబడెను! కాని, వాని కింకను జ్ఞాపకశక్తి మరలలేదు. అనతికాలములో నవశ్యముగ వాని కెప్పటిస్మృతి కలుఁగవచ్చును. అందులకై ఇపుడు మీ తోడ్పాటుఁ గోరుచుంటిని."

విస్మయదృష్టులను యువకుఁ డాపొలఁతిపై సారింపసాగెను.

"మీరు వైద్య మెఱిఁగినవారు కారని నేనెఱుఁగుదును. చికిత్స శాస్త్రానుసారముగ మీరాబుడుతని కేమియుఁ జేయనక్కఱలేదు. అట్లు కావింపవలయుదానిని మాభిషక్కు చేసియేయుండెను! శారీరక సంబంధమున వానికిఁకఁ జేయవలయున దేమియులేదు. ఇపుడవశిష్ట

మైన కర్తవ్యమును మీరు కావింపవలెను. మీయెడ నాతఁడు మిగుల ననురక్తుఁడై యుండెఁగదా!

"అవును—ఒకనాఁటిరాతిరి కొందఱు దొంగలు నన్ను తెఱుపఁ జొచ్చిరి. బాలకుని బుద్ధికౌశలమే ఆనాఁడు నన్ను వారిబారినుండి కాఁపాడినది."

"మంచిది. మీరొకమాఱు వానిని చూడుఁడు."

"ముమ్మాఱు నేనాతని తావున కరిగితిని. కాని, వానిపితామహి ఎట్టులైన నన్నాతనిఁ జూడ నిచ్చినదికాదు!"

"ఇయల్లాదేవి యనురోధమున వానిఁ జూడవచ్చితినని మీరు తెలిపినచో నావృద్ధాంగన ఎట్టియడ్డు పెట్టదు! ఒకవేళ నాపెకు సంది యము కలుగుచో, నీయుంగరముఁ జూపుఁడు. ఆమె కడుంగడు గరు వముగల యాఁడుది!—అందుచే ఎన్నఁడిచటికి రాదు; కాని నేనేమి చెప్పినను అక్షరాల దాని నామెపాలన మొనరించును. ఈ యూర్మిక మును చూచినచో నాపె ఎదురేమియు చెప్పదు."

"బాలకునికేమి చెప్పుదును?"

"అది మీయిష్టము. వానిస్మృతిశక్తి పునరుద్దీపితమగుటకు వల యు జతనము సలుపుఁడు. రాబర్టుఎలిసుల ప్రణయచరిత్రము స్మర ణకుఁ దేఁబ్రయత్నింపుఁడు. మొదటిసారి కార్యము సానుకూలము కానిచో, మఱలపోయి యత్నింపుఁడు. ఎట్టులైన మీరుకృతకృత్యులు కాకపోరని నాగట్టినమ్మిక."

"మంచిది. మీరు వచించినట్లాచరించెదను."

"ఈ విషయమును మీరును నేనునుదక్క నొరులేరు నెఱుఁగ రాకుసుడీ! మీరు నాయంతరంగమిత్రులు. జర్జెటునుజూడ నాలసింప కుందురని వేఁడుచుంటిని."

సెలవుఁగైకొను సమయమాయెను; కాని, యువకుఁడాచెలువ

చెంత మఱికొంతసేపుండి, అపహారణ రహస్యోదంతమటుండ, తన యెడద కాహ్లాదముఁగూర్చు నెయ్యంపుటుక్తు లేమైన వినిపోవలెనని వాంఛించెను! ఊరక 'మీరు నాయంతరంగమిత్రుఁ' లనినంత వాని యంతరంగము తృప్తిపొందలేదు. ఏమియుఁ బలుకక యువకుఁ డాజవ్వనిపై నీప్సితాభరములగు విలోకనములఁ బ్రసరింపసాగెను.

వానిభావము గ్రహించి, స్మితముఖియై, ఆకుటిలాలక "సుందరాంగా! తాము నాయెడ ననురాగమూని యుండిరని నేనెఱుఁగకున్న యెడల, చనువిచ్చి, మనసిచ్చి, మీతో యౌవనవతినగు నేనిట్లేకాంతమున బ్రసంగింపఁబూని యుందునా?" అనెను.

అనన్యసామాన్య సౌష్ఠవ సంపన్నయైన నాసుందరి నయనద్వితయమునుండి ప్రణయభావగర్భితగభీరదృక్కులు వెడలెను! పరమప్రమోదవ్యంజకదరహాస చంద్రికలచే నాసీమంతినీ శమంతకము వదనసరోజము వికసితమై, తేజాన్వితమైపోయెను! ప్రఫుల్లహృదయుఁడై యువకుఁ డాపల్లవాధరి తనువల్లరి నిజబాహుమృణాలములఁ బెనవైవ గమకింప, నింతలో పరిచారిక యొకరుతుక ఆగారమునఁ బ్రవేశించెను. శిథిలమనోరథుఁడైన ఆయుందకానిఁగాంచి, చిరునగవునగుచు నాచిగురుబోడి యిట్లనెను. "ఇఁక సెలవు!—అనతికాలములో మరల తమ సందర్శనము సేకూరునని తలంచెద.—ఈమాటు మీమాతులాలయమందే మనము కలసికొనవచ్చును."

## ౨

దేవి రమ్యాగారమునుండి అవ్వలికిఁజని యువకుఁడీఁక నాత్మసంవరణ మొనరించుకొనఁజాలక పోయెను. ప్రేమముగ్ధ ప్రణయునిపగిది భావవిహ్వాలుఁడగు కవికైవడి, అతఁడుతనలోఁ దానేదియో వచించుకొనఁ దొడఁగెను! ఇంతదనుక తన చెంతచేరియున్న కాంత మనోమోహినీ సౌందర్యప్రభ లాతని మోహావిష్టుఁగావించివైచెను. ఆసీమంతినీ చూడామణి సూక్ష్మదృష్టి వానిచేతనమును విస్మయపరీత మొనరించివైచెను! యోచించినకొలఁది ఆరమణియెడ వానిమోహము వృద్ధిఁగాఁ దొడఁగెను! అత్తఱి ఆతలోదరి అతలాంబురాశిని లంఘింపుమని నుడివినను తడయకాతఁడట్లు లొనరించియుండును!!

ఇయల్లా దేవి వేఁడినట్లు మేక్సిము పిరియాక్ దొరసాని గృహాభిముఖముగఁ జనెను. మిత్ర కల్యాణార్థియైయుండఁ గియత్కాలమునకు మున్నాతని చిత్తమున దృఢీభూతమైయున్న సంకల్పము, నిర్ఝరిణీ స్రోతమందలి తృణఖండము కరణిఎందో కొట్టుకొని పోయెను. దేవీ యనురోధమునఁ దాఁబూనిన కార్యము నెయ్యునెడ విశ్వాసఘాతుకమై చూపట్టినను, ఇంచుకేని అనుతాప మాతని హృదయసీమను తోఁపలేదు. నవీనానురాగారుణద్యుతియందు మైత్రికర్తవ్యమును, సౌహృద్యగౌరవమును చూచుచుఁ జూచుచుండ విగళిత తుషారకణము కైవడి అంతర్హితమై పోయెను!!!

ఇదిట్లుండఁ, చౌర్యసంఘటన మంతయు నపూర్వరహస్య కుజ్ఝటికమునం దాచ్ఛన్నమైయుండెను! —దీనిఁ గన్గొనయత్నించిన మానవమాత్రునకు అడుగడుగునకు భ్రాంతి కలుగవచ్చును. "కుమారి ప్రణయాస్పదుఁడు నిక్కువముగ నిరపరాధియే యైనయెడల, ముగ్ధహృద

యరైన నాకిశోరి, మర్మవేదనమున నస్థిరయై, మఱొకని కంఠమున ప్రేమమాల్యమును ధరింపఁజేసి, ఒక్కుమ్మడి సంతాప సాగరమున లంఘించుఁగదా! నిరీహుఁడైన ఒకని నిర్దోషత్వమును నేను ఋజువు సేయఁగలిగినయెడల, మాతుల నాయెడనేల కినుకజెందును? ఇఁక మిత్రుఁడు విగసరీ విషయము తలంతునా?—కుమారికేలును తాఁబట్టఁ జాలునను మరాశ కలయుండైన ఆతనికిఁ గలుఁగలేదు. రాబర్టు విషాదమందుఁబడి, అవ్వలి కరుగకపోయినయెడల నిప్పటి కల్యాణోద్దేశము విగసరీచేతనమున జొరకనే యుండెడిది. దానంజేసి నాపూనిక కతఁడైన నేల కుపితుఁడగును!" అని వితర్కించుకొని కొంతొక వడికి మేక్సిము డెందమును పదిలపఱచుకొనెను. పదంపడి తెరువున నొకబండి కుదుర్చుకొని గంతవ్యస్థానాభిముఖముగ నాతఁ డరిగెను. అచ్చోఁ జేరినపిదప జర్జెటు గృహసమ్ముఖమున నాతఁడు బండినుండి దిగెను. బాలకుని పితామహి చావడిమూలఁ గూరుచుని ఏదియో కుట్టుచుంట వాతాయన కాచకవాటమునుండి ఆతనికిఁ గన్పట్టెను. తడయక—సంశయింపక యువకుఁడు గృహమధ్యమందుఁ బ్రవేశించెను.

పితామహి ఆతనిఁ జూడఁగనే లేచి నిలువంబడెను. ఆపె యుత్తేజముఁ జూడ బలవంతముగఁ దన్ను గేహమునుండి తఱుము నాయమ సంసిద్ధయైనట్లు మేక్సిమునకుఁ దోఁచెను. అవ్వయుద్దేశము గ్రహించి యువకుఁ డిట్లనెను. "అనుమతిలేక మీయాలయమునఁ బ్రవేశించి నందులకు మన్నింపుఁడు.—బాలకునిఁ జూడ నేనెన్నిమాఱు లిచ్చటికి వచ్చినను, నెవరులేక, నాకు దర్శన మొసఁగితిరి కారు. నేఁ డొక ముఖ్యకారణమున నిచటికి వచ్చితిని. దానిని విన మీ రియ్యకొనకపోరని నా యభిప్రాయము." యువకుఁడు సంభ్రమవ్యంజకస్వరమున మాటలాడుచుండెను. తన కవజ్ఞసూపనాతఁడు రాలేదని వృద్ధనారి గ్రహిం

చెను; ఆత్మమనోభావము నడంచికొని, దీనతావ్యంజకకంఠమున నామె యిట్లనెను : "మీరు పొరపడితిరి. మా యాలయ మప్రశాంత మెల్లరకుఁ బ్రవేశనీయమై యుండును. మీ బోట్లలకు స్వాగత మొసఁగుటే మాకర్జము. బాలకుఁడు మంచమునఁ బడినదాది, ఎవరు గాని కొంతకాల మాతనితో ప్రసంగించుటగాని, చూచుటగాని పనికి రాదని వైద్యుఁడు శాసించియున్నందున, మీ రీవఱలో వానిఁ జూడఁ జాలకపోతిరి; వ్యాధి మిక్కిలి కఠినమైనది. బాలుఁ డిపుడుకూడ మాట లాడఁ జాలడు."

"ఇయల్లాదేవితోఁగూడ మాటలాడఁజాలడా?"

దేవి పేరు విని, వృద్ధాంగన చకితయాయెను. తోడనే యాత్మ సంవరణ మొనరించుకొని ఆమె యిట్లనెను "ఆమె ఎన్నఁ డిచ్చటికి వచ్చునదికాదు. బాలకునిపై ఆమెకు మక్కువ ఎంతమిక్కుటమైనను, వానిఁ జూడ నాపెయే నేఁ డిచటికివచ్చినను, అందులకు నీయకుందు దానఁగాను!"

"ఆమె ఇచటికి రాలేదుకాని నన్నంపెను."

"మీకును దేవికిని పరిచయమున్నట్లు నే నెఱుఁగను."

"ఒకగంటకుమున్నే మేము కలిసికొంటిమి. బాలుని జూచిరమ్మని ఆమె నన్నెంతయో వేఁడి యిచటి కనిపెను. వానిని వెంటఁగొని అవ్వల విహరింపుఁడనికూడ ఆమె చెప్పెను."

"అతఁ డజ్ఞానుఁడై యుండెను.—వాఁ డట్లుండెనని ఆమె ఎఱుఁగదు. ఇలువీడి అవ్వలికిఁ జనరాదని వైద్యులు నొక్కిచెప్పిరి."

"మీ రిట్టియడ్డువెట్టుదురని దేవి ముందుఁగనే గ్రహించియుండెను. అందుచే మీకుఁ జూప నీ యూర్మిక నామె నా కొసంగెను!"

ఉంగరమును చూడఁగనే వృద్ధనారిమొగము వెల్లనైపోయెను. విస్మయవిముగ్ధనేత్రియై, యువకుని దెసఁజూచి మృదుస్వరమున నామె

యిట్లనెను :—"మీయెడ దేవికి మిక్కిలి విశ్వాసమున్నట్లు తోఁచు చున్నది. అందుచేతనే ఆమె యూర్మిక నొసఁగెను. ఆమె యభి ప్రాయమేమి? నాతో నేమిచెప్ప ఆమె మిమ్మంపెను?"

"నెలదినాలకుమున్ను ఇల్లువెడలి చనిన రాబర్టను యువకునిజాడ తెలియఁగ దేవి యాతురపడుచుండెను."

"అతఁడా!—మా బాల్యమున ఆతని కెక్కుడు ప్రేమ. నాకడను దేవికడను గూడ బుడుతఁ డాతని మిక్కిలి పొగడుచుండువాఁడు."

"అందుచేతనే ఆయువకుని గనుఁగొను జతనమున బాలకుని తోడ్పాటు కావలెనని ఆతొయ్యలి యోజించెను."

"నాయయ్య స్మరణశక్తిని గోలుపోయెను; ఇట్లని దేవి మఱచి యుండును."

"వానికి స్మరణశక్తి మరలఁ గలుఁగునని నాయాస. తలఁపనితలఁ పుగ నేదేని క్రొత్తసంగతి జరిగినయెడల, దానిఁజూచినంతన తన స్మరణశక్తి నాతఁడు పడయఁజాలును. నాకూడ వాని నంపితిరేని వాని నెప్పటివానిఁ జేయ యత్నింతును. కొన్ని తావులఁ జూచి, కొందఱు కొందఱు లోకులఁజూచిన, వాని మనోవ్యాధి నిశ్శేషముగ మాపు కాఁగలదు."

చాలసేపు చింతించి, వృద్ధనారి, "దేవి యభిప్రాయమేమో ఎఱుఁ గుదురా?" అని ప్రశ్నించెను.

"ఎఱుఁగను."

"దేవికి ఉంగరము నెవరిచ్చిరో ఎఱుఁగుదురా?"

"దానిని గుఱించి నే నేమియు నెఱుఁగను. తానుపంప నే నరు దెంచినందులకు చిహ్నముగ దాని నా కామె యొసఁగెను."

"మీ నుడువులు సత్యేతరములు కాఁజాలవు. మీరుదారహృద యులు.—నన్ను వంచించువారుకారు. కాని, మీ ప్రోల నా వేడి

కోలు రొకటికలను—అనుసంధానఫల మేమైనను, బాలకుని కెట్టి కీడుమూడనీయనని వాగ్దాన మొనరింపుఁడు.''

"మంచిది, ఈదొంగతీకముతో జర్జెటున కెట్టిసంబంధమున్నదో నేనును, దేవియుఁ దక్క నొరు లెఱుఁగరు."

"నా సర్వస్వమును మీచేతుల నప్పన మొనరించుటకు సంకోచించుట లేదు.—కుట్టి నిపుడే పిలుచుచుంటిని."

ఇట్లనుచుండ నొక్కపరుగున బాలకుఁ డచటికివచ్చి, మిగుల నుత్సాహమున మేక్సిమున కభివాదన మొనరించెను.

సాదరమున బాలుని చెంతకుఁ బిలిచి, యువకుఁడు "కుట్టా! కుశలముగ నుంటివా? నేఁ డిచటికి వత్తునని నీ వనుకొనలేదు కాఁబోలు" ననెను.

"అనుకొనలేదు.—కాని, మీ రెందుకువచ్చితిరో నేగ్రహించితిని. నిన్న నేను పనిలోనికి రానందులకు మీ మేనమామగారి పనుపున నా చెవులు నులుముటకై వచ్చితిరి."

"నీ చెవుల కేమియు భయములేదు. మాసమునుండి పనిలోనికి నీవు రాకపోవుట నీ దోసముకాదని ఆతఁ డెఱుఁగును."

"మాసమునుండియా!—అవును. పెద్దగాలివానవచ్చిననాటనుండి పడియుంటిని. క్రొత్తయేటి యుత్సవములు ముగిసిపోయెను కాఁబోలు!"

"పోయినపోఁగాక! నీకు రావలయు బహుమానము నీకు ముట్టును. వలయు వస్తువునేలుకొనెదవనే నిన్నావలికిఁ గొనిపోవుటకై వచ్చితిని."

"నాపై మీ కెంతేనిదయ. మీ విషయమెన్ని సారులో మా అవ్వకు చెప్పితిని. నాకు మిఠాయి యిష్టము—దానిని కొనిపెట్టుఁడు. అమ్మయ్యా! ఒకమూటావలికిపోయిన, తెలిపిని పడుదును. ఒక దుండగపు కుట్టివాఁడు నన్నుకొట్టెదనని దినంతులుకొట్టుచున్నాడు—కనిపించినమొదల వాని దుమ్ములను చితుకకొట్టివేయుదును!"

కృత్రిమకోపమును తెలుపుచు, యువకుఁ డిట్లనెను—"ఏమి ! పోరాడెదవా !!—పోరాటముమాటయెత్తితివా, నీ చెవులు రెండును నులిమివేయుదును. చచ్చి బ్రతికిమరల దుండగమునకుఁ దలపడెదవా ? పోరాటమందేకాఁబోలు నీ చేయివిఱిగెను!"

" అయ్యో ! ఏమి జరిగెనో నాకించుకంతైన జ్ఞాపకములేదు."

పితామహి—బిడ్డ అజ్ఞానుడై పడియుండెను.—ఎందోపడియుండు నని వైద్యుడు చెప్పెను. కాని ఇన్నాళ్ళు వానినోటినుండి మాటయే రాలేదు.

"కొంచెము సేపుగాలిలో తిరిగిన, ఆరోగ్యముకలుఁగును. మీ రనుమతి యొసంగినయెడల, ఒకమాఱు బాలు నవ్వలికితీసికొనిపోదును."

" ఇంచుక పెందలకడ మరలిరండు."

" చీఁకటపడకుండ నేవత్తుము."

పితామహి ఇంకేమియుపలుకలేదు. అవ్వలికివచ్చి ఉల్లాసముట్టిపడ బాలుఁడిట్లనెను. "అబ్బా ! ఇన్నాళ్ళనుండి కాళ్ళుగుడెక్కియున్నవి. ఒక్కొకపుడు తోడి బాలురతో నాడవలెనని ఉండెడిది: కాని వీలు చిక్కినదికాదు. నాయీ యాటపాటలును మా అవ్వ యెఱుఁగదు. చెప్పకుడుసుఁడీ!—విగసరీగారుకూడ—"

" అతఁడేమియుననువాఁడుకాదు.—శాంతుడు."

" కాని అతఁడు నవ్వుచుండ నే నెన్నఁడుఁ జూచియుండలేదు. మీకడఁగాని, రాబర్టుగారి కడఁగాని ఉన్నయెడల నాకావంతైన వెఱపు లేదు."

"నీవు చాలదినములనుండి రాబర్టును చూచుచుండుటలేదుకదా!"

" చూడకేమి ?—ఈ నడుమనే—అయ్యో ! మఱపునకు వచ్చుచుండెను ?—"

బాలకుఁడు స్మరణశక్తిని నిక్కువముగ గోలుపోయెనని యోజించి

తదేకదృష్టితో యువకుఁడాతని జూడదొడగెను.

"—అవును...ఇంచుక తాళుఁడు—అదె ఆమేడ!—పాంత మందే సురాగృహమున్నదికదా!—క్రొత్తయేటి యుత్సవములకింక నాలస్యములేదు."

"నవవర్షోత్సవములు ముగిసినవి!—ఇంతలోనే నేఁ జెప్పినదానిని మఱచిపోతివా? నీకు బహుమానమిత్తునంటిని కాదా? నీ మన సింకను ఎప్పటి స్థితిలోనికి రాలేదు."

"అవును. మనసులో ఆందోళనముగానున్నది,—గ్రహించికూడ చెప్పలేకపోవుచుంటిని."

"ఒకమాఱు ప్రయత్నించి చూడుము."

"ఒక్కొకపుడు నాచిత్తమంతయు తత్తరపడిపోవుచుండును. ఏదో చెప్పెదననుకొన, నింతలో మఱపువచ్చి మతిచలించిపోవుచుండును! ఎన్నెన్నో తలపులు మనసునతట్టును!—ఒక్కొకపుడు నాటకములోనికి పోయినట్లును రంగము వెనుక రంగము కన్నుల పండువొనరించుచున్నట్లు, నెఱిఁగినవారెందరేని మూకమూకలుగ నరుదెంచునట్లు, నతొత్తుగ మరలనంతయు, జిమ్మచీఁకటియైనట్లుఁ దోఁచుచుండును! ఏదియో కలఁగనుచుంటినని అనుకొందునుఁగాని, మరలనేమికలయో మఱచిపోవుచుందును."

బాలకుఁడు తెల్విబాఱుగఁగోలుపోలేదనియు, నెఱిగినవారిని,ఎఱిఁగిన తావులను జూచినట్లైన వానికి మరల స్మృతిశక్తి కలుగవచ్చుననియు యోజించి వాని గొంతదవ్వుగొనిపోయి, "కుట్టా! ఆ నాఁడు నీవాఁర నృత్యప్రాంగణమునుండి నీ వెచటి కరిగితివి?" అని మేక్సిమడిగెను.

"నృత్యప్రాంగణమా?—నే నచటి కెపుడును పోలేదే!"

"అనుదినము సాయంసమయమున నచటికిచని వీరివారల కబురులఁ దెలిసికొనుచుందునని నీవేకదా అచట నాకొకనాఁడు చెప్పితివి!"

"అట్టిన నబద్ధము చెప్పియుందును, కాని ఇంచుక యోచించి చూడ నొకసారి నేనచటికిఁ బోయినట్లు జ్ఞప్తికి వచ్చుచున్నది!"

"బాగుగ జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము. ఒకనాఁటి రాతిరి కొండొక యాడుదాని వెంటనంటి నృత్యప్రాంగణమునుండి నేనువచ్చుచుండ, చాలదవ్వు నీవుకూడ చీకటియందు నావెన్కఁబడివచ్చితివిగదా! ఆ తావును గుఱుతింపఁగలవా?"

"కలను—ఇదిగో! ఇందుండియే దానిపేరు తెలియుచున్నది—ఆ బల్లమీఁది దానిని చదువుఁడు!"

"ఈ తావునందే నేనుబండియెక్కితిని.—బండి కుదిర్చినవాఁడవు నీవే! ఆ మువ్వురుదుండగులు వెడ మొగములువైచి పలాయితులైరికదా!"

"అవును వారు మువ్వురు!—ఒక్కనిముసము మీరు దారిని నిలువఁబడియున్న యెడల ఆదుండుగులు మిమ్ముతప్పకఁ బట్టియుందువారు!!!"

"పట్టియుందువారని ఎట్లు గ్రహించితివి?"

"అదిచెప్పఁజాలను. కాని వారిచేతులనుండి మిమ్ము తప్పింపవలెనని నేను నిశ్చయించినట్లు జ్ఞప్తికివచ్చుచున్నది! నేనింకను పెద్దవాఁడను కాకపోయినను, మీదావుజేరి ఆపలుగులు మిమ్మంటదొరఁకొనక మున్నొక్కరొక్కరునిపట్టిమట్టుపెట్టివేయువాఁడను!"

"నాతోడనున్న తొయ్యలి—ఆపెద్ద కన్నుల అందకత్తె సార్జెంటు దొరసాని—సుందరి ఎవరో నీకిపుడు జ్ఞప్తికివచ్చెనా?"

"లేదు—అయ్యో! ఎంత కఠిన నామము!!"

"చాలమాఱు లీదారినుండి నీవు కచేరికి వచ్చుచుందువు కాదా!"

"ఇది దగ్గఱత్రోవ. కాని, నే నీ తెరువునఁ జనక పెక్కుసారులు నాలుఁగు దారులు తిరిగి తోడిబాలురతో నాడుచుఁ బాడుచుఁ గచేరి

చేరువాఁడను!''

«అట్లైన నాదారులలో నెందో నీవుపడిపోయి యుందువు.»

« అవును—అట్లేకావచ్చును!»

«అట్లైన నిన్నాదిక్కుగఁగొనిపోమను. తావుచూడగనే గుర్తింప జాలుదువా?»

« ఏమోచెప్పఁజాలను. ట్రాముదోడ్డులో పడియుంటినట. అచటికి పోయినట్లు నాకు జ్ఞాపకములేదు—ఎవరో నన్నందుపడవైచి యుందురు.»

ఇట్లు ప్రసంగించుచుండ, వారిర్వురు సార్జెంటు దొరసానను సుందరి మేడముంగల కరుదెంచిరి. ఇంచుక తడసి, మేడనుదేఱిచూచి మేక్సి మిట్లనెను! చూడుము. «ఎంతయందమైన సౌధమో! తలుపులుమూసి యున్నవి. అద్దెమేడైయుండును! ఈ వైపునుండి పరిశీలించి, ఇదవ రిదో గుఱుతుపట్టగలవా?»

బాలకుఁడు మాటలాడలేదు. తదేకదృష్టితో నతఁడు భవనమును చూఁడనొడఁగెను. చూచిచూచి, విచ్ఛిన్నచింతాసూత్రముల నొం డొంటి కలుప యత్నించులాగుగ నతఁడు ఫాలతలమును దుడిచికొని యిట్లనెను! «ఇది అద్దెమేడ ఎట్లగును?—తలుపులు మూసియున్నను లోపలలోకులు లేకపోలేదు!''

« ఎవరున్నారు?»

« సల్యాసుదొరసాని —ఎట్టి గుఱ్ఱమెక్కునాదుది!!»

«గుఱ్ఱమే రమణిది!»

ముహూర్తకాలమేదియో యోచించి, పిదప తలవంచి బాలుఁడు «ఇఁకనేమియుఁ జెప్పలేకపోవుచుంటి!» యనెను.

యువకుని హతాశహృదయమున మరల నాన యుదయించెను.

« నీవు సల్యాస్‌దొరసాని నెఱిఁగియుందువు.—ఆపెను చూడ నీ

వెన్నఁడైనఁబోయియుంటివా ?"

"ఆమెతో నాకంతగా పరిచయములేదు.—కాని, రెండు మూఁడు సారు లామెను చూచియుంటిని—ఎట్టి మొండి మొఱకుయాఁడుది !"

"ఆమెను జూడ నెందులకుఁబోయియుంటివి ?''

క్షణకాలముచింతించి, బాలుఁడు "ఇఁక నన్నేమడిగినను బ్రయోజనములేదు. అంతయు మఱచితిని.''

కుఱ్ఱనిఁక బ్రశ్నించుట వృథయని యువకుఁ డూహించెను—మేఘమండలమున విద్యుల్లతవలె వికసించి యదృశ్యమగులీల, నొక్కొకమాఱు వాని స్మరణశక్తి ఉదయించుచు మరలనంతలో నంతర్హితమగుచుండెను !—పరిచిత ప్రదేశములనుండి డింభకునిగొనిపోవుచు యువకుఁడు "ఇయల్లా దేవిని నీ వెఱుఁగుదువా ?'' అని వానిఁ బ్రశ్నించెను.

"ఎఱిఁగియేయుందును—ఆయమ మాపితామహికిఁ బరమహితైషిణికాదా ?''

"నీవామెయుండు మేడ కరిగియుందువు కాదా!"

"అనేక సారులరిగియుంటిని. ఆమె మేడ ఎంతో అందమైనది—అందెన్నెన్నియో ముద్దులు మూటఁగట్టు ప్రతిమలున్నవి. అన్ని బొమ్మలు మంత్రిగాని యింటియందైననుండవు. ఇఁక నామె పరిచారకులు—ఆహా ! ఏమి వారి వేషభాషలు !! చూడవారు రాజసచివులని భ్రమపుట్టకమానదు. ఎంతయైశ్వర్యమున్నను, ఆదేవియందణుమాత్రమైన గరువము కానుపించదు.''

బాలుని పలుకులు విని యువకుఁడించుకనగి, మరల నెప్పటట్లు ప్రశ్నింపదొరఁకొనెను—"సరే, దేవిని నీవు కలిసికొనునపుడెల్ల, మీ యిరువురకు ఏమి మాటలు జరుగుచుండును ?''

"ఒక్కమాటేమి ?—పితామహి ఎట్లున్నది? నాకుఁబని ఎట్లు

తోఁచుచున్నది, రాబర్టు ఎలిసు యెట్లున్నది, ఏమిచేయుచున్నది ఆమె యడుగుచుండును. గడచిన మాఱు నే నామెను జూడఁబోయినపు డామె పాపము మంచముపట్టెను! రాబర్టు విషయమే అపు డామె నన్నడిగెను."

"ఏమి!—రాబర్టు విషయమడిగెనా?"

"అవును. అతని సంగతి నాకేమియు తెలియలేదనియు, వానిఁ జూచి మూఁడు నాలుఁగు దినములైనదనియు నేనుత్తర మొసఁగితిని."

"రాబర్టును నీవు చూఁడగోరుదువా?"

"నిక్కముగ."

"అట్లైన కొంత్రీ కరుగుదము రమ్ము. విగనరీ మనకొక వేళ అతని సంగతి చెప్పవచ్చును"

ఇరువురు కొంతదూరము సాగిపోయిరి. యువకుఁడు కుఱ్ఱని మొగము తేఱి చూడసాగెను.—అది గంభీరమై యుండెను. అడంగియున్న స్మృతిశక్తి క్రమక్రమముగ జాగరితమగు చున్నట్లాతనికిఁ దోఁచెను. కొంత్రీప్రదేశమును చేరినంతనే బాలకుఁడకాత్తుగ నిట్లనెను. "చూడు డడిగో! నావలెనుండు మఱొక బాలుఁడు నా పుట్టములు కట్టుకొని తిరుగుచున్నాఁడు. అచ్చముగ వాఁడు నావలె లేడా?"

మేక్సిము జవాబొసఁగక, వానికరముఁ బట్టుకొని, కొంత్రీప్రాంగణ మునఁ బ్రవేశించెను. జర్జెటునుగాంచి విగనరీ అబ్బురమున "కుఱ్ఱా! ఇట్లు వచ్చితివేమి?—పూర్ణస్వస్థుఁడవైతివా?—అదిగో! ఇంకను చేతికి కట్టున్నదే!" అనెను.

"ఇంకను చేతినొప్పిపోలేదు—దానికేమి లెండు. నా పని ఏమైన నున్నదా?"

నీ స్థానే యజమాని మఱొక కుఱ్ఱనుంచెను—ఎఱుఁగవా?"

"ఓ! తలవాకిటను మేము చూచినదతఁడే కాఁబోలు—వానిఁ

జూడఁగనే నాకంతయు బోధపడియెను. ఆకుఱ్ఱని చేర్చినంతలో నేపని యంతయు నెగ్గిపోవుచున్నది కాఁబోలును!'' మాటలాడుచుండ జర్జెటు చూపు కచేరీగది యందలి ఇనుపపెట్టెపైఁబడెను. అది తెఱచి యే యుండెను.—"అదేమి! ఇపు డందలి శబ్దము వేఱుగఁ గానుపించుచున్న దే! ఈ వఱలో కుమారి నామాక్షరము లుండెడివి. ఇపుడు"—

"నీ కెట్లు తెలిసెను?"

"పేరు చదివితినిగాన తెలిసినది."

"ఎపుడు చదివితివి?"

"అది నేఁ జెప్పఁజాలను.—ఇనుపపేటిక తలుపుపై మఱొక పేరు అక్షరములుండెడివి!"

మేక్సిము విగనరీలు అర్థపూర్ణదృక్కుల నొకరిపై నొకరు పరపు కొనిరి.

జర్జెటు—మందసపు మర మునుపటివలెనే యున్నదా?

విగనరీ—మందసపు మరా!—ఏమనుచుంటివి?

"ఎఱుఁగరా!—నొంగనువట్టు మర!!—అదిగో! ఆ యంత్రము మునుపటటులేయున్నది!!!"

బాలుని నుడువులు వినినంతనే విగనరీకైవడి మేక్సిముకూడ విచలితచిత్తుఁడై మెల్లన నతని సమీపమందలి చిన్నగదిలోనికిఁ దోడు కొనిపోయెను. ఆగారమునఁ బ్రవేశించి బాలకుఁడు "గదియంతయు నిపుడు కడుశుభ్రముగనున్నది!—ఈవఱలో నింతవరును చొచ్చుటకు వీలులేనట్లు మిక్కిలిదట్టముగఁ గాకితపు దున్కలచే నిండియుండెడిది!!" అనెను.

మేక్సిము—కాని, కుఱ్ఱవాఁడవగు నీ వందుఁ జొరఁజాలియుందువు కాదా?

"సరిగఁ జెప్పఁజాలను. నాస్మరణశక్తియంతయు మరలఁ బోవు.

చున్నది."

మేక్సిము విగనరీకిఁ జేసన్నఁగావించి, ఆగారమున కావలిదిక్కుగ నాతనిఁ గొనిపోయెను. కవాటసన్నికటమునఁ గల కొండొకకుర్చీపై జర్జెటు కూర్చునియుండెను!

విగనరీ మేక్సిములు మెల్లనిస్వరమున నిట్లు ప్రసంగించుకొనిరి.

మేక్సిము—ఈకథయంతయు నీకెట్లు తోఁచుచున్నది. దొంగ పనియందు జర్జెటునకు పాలున్నట్లు స్పష్టపడుచున్నది.—ఇనుపపెట్టె మర నెట్లు తెరువవలెనో, ఎట్టులు దాని నమరుపవలెనో, ఈగదియం దలి కాగితపుగుట్టనడుమ దాఁగి వాఁడు బాగుగఁ గనుపెట్టియుండును! సంకేతపదముకూడ వాఁ డెఱిఁగియున్నట్లు ఇపుడు స్పష్టపడినదికదా!

"నీవనినది నిక్కము—దుండగుఁడగు నాకుఱ్ఱఁడే గుట్టంతయు బయల్వెట్టి దొంగలకుఁ జేయూఁత యొసఁగెను!"

"కాని రాబర్టు నిర్దోషియని వానిమాటలవలన బోధపడలేదు!"

"బాలకుని సాయమున నతఁడీపనిచేసెనని నీవనుమానించుచుం టివి—అట్లు జరిగియుండదు. కాని, రాబ యెడ బాలునకు భక్తి మెండు."

"రాబర్టిపు డెందుండెనో జర్జెటెఱుఁగునా?

"ఎఱిఁగియేయుండు ననుకొనెదను—కాని, తక్కుంగలవిషయము లట్లాసంగతిఁ గూడ వాఁడు మఱచెను."

"అట్లైన జర్జెటుస్మరణశక్తి నిక్కముగఁ గోలుపోయెనని నమ్ము చుంటివా?—అది వట్టినటనమాత్రము కాదా?"

"నటనమైనయెడల, వట్టిమొఱకువలె రహస్యముల వాఁడు వెలి బుచ్చువాఁడు కాఁడు. ఇంచుక యోచింప, దోషియని వానిని పట్టి యిచ్చుట తగనిపనియని తోఁచుచున్నది. సరళభావమునఁ దాఁ గాం చిన దాతఁడు చెప్పివైచెనుగదా! నిబిష్టచిత్తుఁడై, ఆతఁ డెట్లు సాకి

తపుటోపీ చేయుచుండెనో! నటించువాని మొగ మట్టులుండునా?— అరే కుట్టా! ఏమి యాలోచించుచున్నావు?"

"ఏమీలేదు. విగనరీగారు పనిలోనికి రమ్మందురేమో అని చూచుచున్నాను!"

"నేడు నీకాతఁడేపని నీయఁడు—తెలిసినదా?"

"అట్లైన నొకేచోటునఁ గూరుచునియుంట కష్టము—నాలుఁగు తావులఁ దిరిగిన గొంతయుబును పోవును. ఒక్కొక్కమాఱు విశ్రామ మందిరమున కరిగి, బేంకున సొమ్ము జమకట్టవచ్చువారిని జూచుచుఁ గూరుచుందును—బాగుగ తోఁచును."

"నీవు వారి నూరక వెక్కిరించుచుందువుగదా?"

"లేదు. ద్వారపాలుఁడు మేలికము మీయొద్ద నాపై నూరక నిట్టి నింద మోపుచు నేమో చెప్పియుండును!"

"అది నీ వెట్లు గ్రహించితివి?"

"వాఁడు నన్ను చూచి సహింపలేడు—తలఁచుకొంటి నేనిని వాని నిందుండి తఱిమివై చెడివాఁడను."

"నీవా?"

"అవును నేనే!—ఒకమాఱు యజమానితో వానిసంగతి చెప్పివైచినయెడల, వాని రోగము బాగుగ కుదిరిపోయెడిదే! నియమానుసారముగ వాఁడు పహరా వేయుచుంటలేదు.—సంధ్యానంతరమున ఇష్టమువచ్చినవారు తమంతతాము నిరంతరాయముగ కొఠీలో ప్రవేశింపఁగలరు!!!"

"అట్లని నీ వెట్లెఱుఁగుదువు?"

"నేనే ఒకనాఁటిసాయంకాలమున బేంకులో ప్రవేశించితిని."

"వట్టి వెఱ్ఱివానివలె నున్నావు!—ఆఱుగంటలు కాఁగనే ఇంటి మొగము వెట్టి నీవు పరుగిడువాఁడవుకదా!"

"నిజము వచించితిరి. నాతో నాటలాడుటకు త్రోవలో కొందఱు బాలురు వేచియుందురు. అందుచే వేగముగఁ బోవుచుందును. కాని, నేనొకనాఁడు కచేరీగదియందు ప్రవేశించినట్లు నాకు బాగుగ జ్ఞాపకమున్నది! అపుడు కొఠీముందుఁగాని లోపలఁగాని ఎవరుఁగాఁపులేరు. నాకెంతో భయము వేసినది!"

"భయమెందులకు?"

"భయమెందులకో ఎంతని చెప్పుదును?—రాత్రి!!—కచేరీగది యంతయు దట్టమైన తమసముచే నలముకొనియున్నది! రాజవీథి కావలప్రక్కనున్న గేసుదీపమునుండి వెలుతురు కొంచెముకొంచెముగ కొఠీలోనికిఁ గానుపించెనంతియే!—ఆఘోరాంధకారమున పెద్దయినుపపెట్టె ప్రకాండకాలదైత్యునివలె కాన్పించెను!! లోపల నాలుఁగు మూలలఁ గిచకిచమని ఎలుకలు చరలాడఁజొచ్చెను!!! ఆ భయంకర దృశ్యమును చూచునప్పటికి అమ్మయ్యో! ఒంటిలోని రక్తమంతయు నీరైపోయినది!!"

"నీకు నిద్దురపట్టఁగనే కచేరీగది మాయఁజడినదికాఁబోలు?"

"అవు నట్లేకావచ్చును."

"తలుపుతీయుఁడని నీవు బొబ్బలుపెట్టలేదా?"

"నాకు జ్ఞాపకములేదు"

"ఎవరిని గచేరీగదిలో చూడలేదా?"

"లేదు"

"అట్లైన నీవలి కెట్లు బయలుపడివచ్చితివి?"

"నాకు జ్ఞాపకములేదు."

బాలునివాక్యములు విని, మేక్సిము ఉత్తేజితుఁడైపోయెను—ఆపాదమస్తకము ఆతని యొడలంతయు వడఁకిపోఁదొడఁగెను! ఈమాఱు చౌర్యమందలి రహస్యమునంతయుఁ దాను కనుఁగొనఁ జాలుదునని

అతఁడు యోజించెను. కాని, బాలకుని "జ్ఞాపకము లేద"ను పదము అతని యుద్యమమునంతయు వ్యర్థమొనరించుచుండెను! డింభకుని నుడువులు విని విగనరీ భ్రామకుడయ్యెను! మేక్సిము కఠోరస్వరమున "నీవు కర్నలు బొరిమఫ్‌ను చూచియుంటివా" అని బాలు నడిగెను.

"కర్నలు బొరిమఫ్‌నా!—అధమపక్షమాతని మువ్మాటికిఁ దక్కువయూటులు చూచియుండలేదు! యజమాని కడనుండి అతఁడు నగలపెట్టెను దీసికొనిపోవుటకై వచ్చినపుడు నేను దావునఁ నేయుంటిని. రష్యావాసుఁడగు వానిపై నాకెంతేని రోఁత! రష్యావారవమూపితా మహింకికూడ మిక్కిలి అయిష్టము!"

"నాయనా! వారు మీకుచేసిన ఎగ్గేమి?"

"ఓ!—అసంగతులెన్నో యున్నవి. కాని, వానినన్నిఁటిని మఱచి పోతిని. ఆపాడుదొర గళస్వరము విని నంతనే నాకొడలు మండి పోవును.—ఏదో జంతువు మొఱిగినట్లుండును వానిస్వరము! అతఁడు వచ్చి, తలుపుతట్టగనే కిటికీనుండి వానిని వెక్కిరించువాఁడను! నా చేష్టలుచూచి అతఁడు మఱింత మండిపడువాఁడు.—ఒకటి రెండుసారులు విగనరీగారుకూడ చూచియుండిరి!"

విగనరీ—అవును కర్నలునిన్నుఁ దనిపిడికిలిఁ దీసికొని, నీకుత్తుక నుత్తరించిన బాగుగనుండెడిది! కొశీలో పైకము జమనేయుటకై వచ్చు పెద్దమనుష్యులను వెక్కిరించుటకును, తలుపు వెనుకదాఁగి వారి మాటలు వినుకొనుటకును, నెలజీతమిచ్చి వర్జర్సుగారు నిన్నుపోషించుచుంటలేదు!!"

విగనరీ కిన్కకు బాలుఁడడలినయెడల, దనయత్నమంతయు నిరర్థకమగునని యోచించి మేక్సిమిట్లనెను. "ఇంచుక నీవు వేడుకను గాలము గడపిన, దోసమేమి!—కుర్రా! నీవలెనాకు కర్నలననంత యొడలు మండదు. అయితే ఆదొరకు నగలపెట్టె దొరకినదా!"

"లేదు! అది ఇనుపపెట్టెలో నుండలేదు!!" అని జర్జెబు అసంకోచముగ పల్కెను.

"అట్లైన, తప్పక దానినెవరో కొనిపోయిరి!"

"తప్పక నట్లే!"

"ఎవరు కొనిపోయిరి?"

"ఒకించుక తాళుఁడు. జ్ఞాపకము దెచ్చుకొందును. ప్రాయశః— కాదు! కాదు!! మరల నాందోళన మంకురించెను.—పేరు జ్ఞప్తికి వచ్చెను, కాని, మఱచిపోతిని."

మేక్సిము—ఆమె పేరు సల్యాన్ దొరసానియా యేమి?

ఆనందమున కరతాళమువైచి జర్జెటు "అవును! అవును!!— ఆమెయే! ఆమెయే!!—మఱి యామెయు దుసలిచెనటి! బొరిసఫ్‌ను చూచినట్లు లాతనిఁజూడఁగనే నాయొడలు మండును!!!"

"ఏమహిళ సైంధవము నామెస్వారి చేయుచుండునో ఆమెకూడ నామెవెంట నుండెను కాఁబోలు!"

ఇంచుక యోచించి, "నే నారమణిని చూడలేదు—సల్యాన్ మాత్ర మొంటరిగ వచ్చెను!" అని బాలుఁడనెను.

"మంచిది. ఆమెమాట చెప్పుము. ఆమెనిక్కముగ బొరిసఫ్ దొర శత్రువై యుండును. కాకున్న వానిపెట్టె నేల దొంగిలించును?"

"బొరిసఫ్ దస్యుఁడు!!!"

"అతఁడు సల్యాన్ దొరసాని కనిష్ట మెట్లొనరించెను?"

హతాశభావమున లలాటమునఁ జేయి వైచికొని జర్జెటు "నేఁ జెప్పలేను.. అంతయును మఱచిపోతి!" ననెను.

మేక్సి మంతరంగమున మిగుల నుత్తేజితుఁ డాయెను—బాలకుని సరళత సంబంధమున నాతనికి సందియము కలిగెను!—నెయ్యాని ముఖలక్షణముల నుపలక్షించి విగనరీ ఆతని మఱుఁగునకుఁ గొంపోయి

ఇట్లనెను. "అనుసంధాన మొనరించి నీవు చేయునదేమి?—దుండగుఁ డగు నీ బుడుతఁడు చోరుల నెఱిఁగినట్లు స్పష్టమేయయ్యె, వారి దుష్కృత్యము వీడు సాయము సలిపినట్లు రూఢియగుచున్నను, నీ పాడు తంతునందు మనకు వచ్చిపోయెడి దేమి? నగలపెట్టె యాశను బోరి మపుదోర పూర్ణముగ వదలుకొనెను. ఇఁక దానివిషయమై మనము తల క్రిందులు పడు టెందులకు? జరుగఁదలచిన దేమో జరగిపోయెను!— ఇఁక వృథాప్రయాసపడక నిశ్చింతుఁడవై యుండుము!"

"మంచిది మే మరుగుచుంటిమి—రారా! కుఱ్ఱా!" అని మేక్సిము జర్జెటును దోకొని అందుండి లేచెను. విగనరీ నుడువు లాతని వీనులకు రుచింపలేదని వేఱుగఁ దెలుపనక్కఱలేదు. అన్ని విషయములు బాగుగ విప్పి బాలకుఁడు చెప్పఁజాలక పోవుచున్నందున, నత్య నిర్ణయేచ్ఛ మేక్సిము చిత్తమున మఱింత ప్రబలము కాఁదొడఁగెను! ఇంతదనుకననుసంధానమున నాతఁడు పడసిన విషయము లన్నియు రాబర్టుపక్షమున ననుకూలములై యుండెను!

వీథిగుమ్మముదరిఁ జేరునరికి ఉపాధ్యాయుని సహితమై కుమారి వారికిఁ గాన్పించెను. మేక్సిముజర్జెటులను జూచినంతనే ఎలిసుముఖము ప్రఫుల్లమైపోయెను. ఆమానిని మధురముగ్ధవదనము మునుపటట్లే సుందరమై యున్నను, ఇంచుక పాండురమై చూపట్టుచుండెను!

కుమారి—కుఱ్ఱా! ఇపుడు కుశలముగ నుంటివిగదా?

బాలుఁ డేమఱుపాటున గుట్టుమాటలన్నియు నే కరువుపెట్టునను భయమున మేక్సి మాతని మాటాడనీయక "అతఁడు కుశలముగనే యున్నాఁడు. స్వయముగ నే నాతని నిలయమున కరిగి, పితామహి యనుమతిని విహారార్థమై వాని నీవలికిఁ గొనివచ్చితి''ననెను.

"మంచిపని చేసితివి. నాయనగారు వారింపకపోయినయెడల, నేను కూడ పోయి ఒకమాఱు బాలునిఁ జూచి వచ్చెదుదానను!"

"మీ రిపు డెచటి కరుగుచుంటిరి?"

"అది రహస్యవిషయము—కాని నీకడ దాపరిక మేల? నా ప్రతిమ నొకటి చిత్రింపఁజేయుచుంటిని. ప్రతిమను జనకునికిఁ జూపి, ఆతని నబ్బురమున ముంచివైతును! చిత్రకారుని బస కరుగుచుంటిని. జర్జెటు నింటియొద్ద నప్పగించుటకై నీ వరుగుచో నాతో రమ్ము—మన యిర్వురి త్రోవ యొక్కటే!"

"ఉపాధ్యాయిని అభ్యంతరము లేనియెడల, నేను మీతో నట్లే వత్తును."

ఉపాధ్యాయిని—మాట మాటకు మీరు వ్యంగము ప్రయోగింతురు. పరిహాసమున నెంతవఱకు జయోపేతు లగుదురో నేనును చూతుఁగాక! మీ విద్రూపమునకు దండనముగ మీరు మ మ్మనుసరించి రావలయును! ఊరక వచ్చుటయుగాదు. మన ఎలిసుతోఁ బ్రసంగింప నున్మాదినియైన రమణి—ఇయల్లా దేవిని గుఱించి కూడ మాకు మీ రెఱిఁగినది చెప్పి తీరవలెను!"

"ఏమి! ఇయల్లా దేవియా!"

ఉపాధ్యాయిని—అవును! గంటకు ముందే ఆమె మీమాతుల నిలయమున కరుదెంచెను. కుమారితో ప్రసంగింప నాపె ఎంతో యాతురపడెను. అశ్వముపై విచ్చలవిడిగ స్వారిచేయుచు నిచ్చ వచ్చినట్లు తిరుగు నొక విదేశిని తన కన్నియకుఁ దగు సంగిణి కాదని, వృద్ధుఁడు వారి సమాగమమున కియ్యకొనలేదు. కాని, కుమారినిఁ జూడ మరల నరుదెంతునని చెప్పి ఆ మానిని వెడలిపోయెను. బాలపై నాపె కింత యనురాగ మేల యుదయించెనో గ్రహింపఁజాలకున్నాము! మీకును ఆ లలనకును పరిచయ మున్నదఁట—దీని కారణ మేమో మీకుఁ దెలిసియుండును."

"మామకడ ఆమె నా పేరెత్తి యుండెను కాఁబోలు!"

"ఆమె మిమ్ము గుఱించి చాలఁగా బ్రసంగించెను. జర్జెటువంక నామె యఱుఁ దెంచి, మూఁడునాలుఁగు నుడువుల యనంతరము కుమారిని దర్శించు నౌత్సుక్యమును బ్రకాశ మొనరించెను. వారిర్వురి సహావేశము మీకుఁగూడ సమ్మతమైనదని యామె వాక్రుచ్చెను. ఆ రమణి కించుక ఉన్మాద మున్నదని మీ మాతుల యోచించెను."

మేక్సిము ఇయల్టాదేవి స్వభావము నెఱుఁగును. కాని, చికిత్సకుని కఠోరనిషేధము నుపలక్షింపక, ఆతఁడు కన్నులనుండి దాఁటి చనఁగనే రోగశయ్యను త్యజించి, విచ్చలవిడిగ నామె తిరుగునని అతఁడు స్వప్నమందైనఁ దలంచియుండలేదు. ప్రోలనున్న యువతుల నుద్దేశించి, అతఁ డిట్లనెను. "ఆమెను గుఱించి నేఁ జెప్పిన దంతగాలేదు. రాబర్టు యభిధేయమునంటిన కలంకమును భంజన మొనరింప నామె యుత్సుకమై యున్నది. అతఁడు నిర్దోషియని యామె నిరూపింప యత్నించుచుండెను."

కుసుమకోమలములై, పాండురవర్ణములై యున్న కుమారి గండభాగములు యువకుని పల్కులు వినినంతనే కౌతూహల విరాజితములాయెను! కాని ఆమె ఏమియుఁ బలుకలేదు. నేఁడు మేక్సిము రాబర్టు పక్షావలంబియై ప్రసంగించుటఁ గాంచి, ఉపాధ్యాయిని విస్మయపడెను.

ఉపాధ్యాయిని భావముఁ గ్రహించి యువకుఁడిట్లనెను. "నేను రాబర్టుపక్షమును సమర్థించుటలేదు; ఇయల్టాదేవియే అట్లొనరింప కంకణము కట్టుకొనెను. సత్యాసత్యముల నిర్ణయమొనరింప మాత్రము నే యత్నించుచుంటిని! జర్జెటుకడ నామె అన్నివిషయములు వినియుండెను. చౌర్యసంఘటనమునందీబాలునకు సంబంధమున్నట్లు నాకు స్పష్టముగ బోధపడియెను— దురదృష్టవశాత్తు పడినకతన నాతనికి స్మృతిభ్రంశము ఘటింపకున్న యెడల, నిజమైన చోరుని పేరింతకు

మున్నే ఎఱుఁగఁజాలువాఁడను. రాబర్టు నిరపరాధి యని దేవిదృఢ విశ్వాసము. కైదియై యాతఁడు పేరిసు నగరమందే యుండెను. లాతివారలచేతులఁబడి ఈమాసముదినము లాతఁ డోరులకన్నులఁ బడజాలకుండెను!"

ఉపాధ్యాయిని—ఈయుదంతమును నేను సమ్మఁజాలను.

"జర్జెటునకు స్మృతిశక్తి కలుగుచో, నిందలిరహస్యము లన్నియుఁ బ్రకాశమగునని నాస్థిరవిశ్వాసము. అవి ప్రకాశములగుటకై నేను శక్తివంచనలేక ప్రయత్నింతును.

"మీరు వృథాశ్రమపడుచుంటిరి—మీపూనిక మీమాతులకు సమ్మతమై యుండదనుకొనెదను."

"చూతుఁగాక" అని యువకుడందుండి బాలునితో నవ్వులికి నిష్క్రమించెను.

మేక్సిము—కుఱ్ఱా! ఈవిహారణము నీకానందదాయకమై యున్నదిగదా?

"పరమానందముగనున్నది. మాయిల్లు పవలుకూడ చీఁకటిమయమైయుండును. మధ్యాహ్నము మూఁడుగంటలప్పుడే మా అవ్వ దీపము వెలిగించును!"

"రేపు నేను మరల మీయింటికివత్తును. నీవు రేపు దేవినిఁజూడఁ బోయెదవనుకొనెదను."

"ఏదేవి?"

"ఆసుందరభవనమునను౦డు నియల్టాదేవి!"

"ఓ! ఆమెయా!!—నాదెజా?"

"ఏమి!—నాదెజా!—అది దేవి ప్రకృతనామధేయమా?"

"మా అవ్వ ఈపేరున నామెనుపిలచును—మీరామెనడిగి చూడవచ్చును!"

పిరియాకు, ఇయల్ట్రాలకట్టి ఘనిష్టతయుండుటెఱిఁగి మేక్సిము విస్మితుఁడాయెను. అతఁడు దేవి 'పిలుపుపేరు' నెఱుఁగఁడు. వారిర్వురు కొంతదవ్వరుగఁగనే అటాత్తుగ జర్జెటిట్లనెను. "ఇదె! ఈపథమందే నేనెన్నియో ఆటలాడితిని. చూడుడదే! ఆపెద్దమేడ ప్రక్కనుండియే ఒకపథము పోవుచుండుటలేదా? కేవలము గోలీలనాఁడుటకే ఆతెరువు కావింపఁబడినట్లు తోఁచును. చేయిపిఱిగిపడిననాఁ డామార్గమున రెండుగంటలు వరుసగ నాడితిని.

"ప్రదేశమును నీవు బాగుగ గుర్తింపఁగలుగుచుంటివా?"

"గుర్తింపగలుగుచుంటిని! కన్నులకు కట్టినట్టు లానాఁటిసంగతులన్నియు గోచరించుచున్నవి!—ఆలస్యమైనందున ఆనాఁడు నేను కచేరి కరుగలేదు. నాకుసుస్థీచేసినదని యజమాని యనుకొనునని తలంచితిని."

"నీవు దినమంతయు నొంటరివై యుంటివనుకొనెదను."

"ఒంటరిగ లేను. తోడిబాలురతోఁ గోటఁ జూచుటకై పోతిని—కోటనుండి తోడనే మరలివచ్చుట బాగుగ జ్ఞాపకమున్నది. కాని, ఏలవచ్చితినో జ్ఞప్తికి వచ్చుటలేదు."

"జ్ఞప్తికిఁదెచ్చుకొనఁ బ్రయత్నింపుము."

"ఇంచుక తాళుఁడు—ఈసౌధము నించుక పరిశీలింపనిండు!"

"సౌధము కడుంగడు రమ్యముగనున్నది! ఎట్టి యున్నతద్వారములు! ప్రాంగణ మెంతవిశాలమైనది!! భవనమునకు వెనుక నిజముగ నొక యుద్యానమున్నది!"

"ఉద్యానమా!—ఉద్యానమా!!—ప్రాచీరముగల ఉద్యానము కాదా?"

"అవును. చూడఁగోరుదువేని నిన్ను మేడవెనుకకుఁ గొనిపోదును. ఆరామనికటమున నొక యిల్లైనలేదు. ఈమేడయెవరిదో నీ వెఱుఁగుదువా?"

"ఎఱుఁగను. కాని నేనొకమాఱీమేడలోనికి పోయినట్లు జ్ఞాపకము వచ్చుచున్నది!"

మేక్సిమాతని నుడువులు విని మిక్కిలి విస్మయపడి, "కుఱ్ఱా! ఈ మేడలోనికేల యరిగితివి? ఏదేనియుత్తరముఁ గొనిపోతివనుకొనెద" ననెను.

"కాదు! కాదు!! పత్రమేమియుఁ గొనిపోలేదు—పత్రమెందులకు పనికిమాలినది!—నేనానాఁడు కచేరికైన పోలేదు."

యువకుఁడు బాలుని రాజపథప్రాంతమునకుఁ గొంపోయి "ఇందుండియే నీవు చనియుందు" వనెను.

రాజపథము మూలకుఁదిరిగినంతనే, బాలకుని ముఖముజ్జ్వలమైపోయెను!—ఆతనినయనద్వయము తేజఃపూరితమాయెను!!

బాలకుఁడు—ఈమాఱు జ్ఞప్తికి వచ్చెను!—ఈ ప్రదేశమును గుర్తించితిని!!—మీకంతయుఁ జూపుచుంటిని!—చూడుడదిగో! ప్రాచీరము!! నేనాభిత్తికనుండియే పడిపోతిని! క్రిందఁబడఁగనే అల్లదె! ఆరాతిబండ తలకు గాటముగఁ దగిలెను!!"

"నీవు ప్రాచీరముపై కేల యెక్కితివి?"

"ప్రాచీరమున కావలివైపున నేమియున్నదో చూచుటకు."

"ఏమి చూచితివి?"

"ఏమియులేదు—అంతయు చీఁకటిమయమైయుండెను!"

"నీవంతయెత్తు గోడమీఁది కెట్లెక్కఁగలిగితివి?"

"త్రాడు!—అవునవును!—ముడిఁగల త్రాడుమూలమున పైకెఁగఁబ్రాఁకితిని! త్రాటిముడికొక కొక్కెముండెను!!"

"నీకు త్రాడెచ్చట దొరకెను?"

"జ్ఞప్తికి వచ్చుటలేదు—కాని త్రాటియూఁతనే పైకెఁగఁబ్రాకినట్లు జ్ఞాపకమున్నది! దిగునపుడు త్రాడు తెగిపోయి యుండును!"

"ప్రాచీరముమీఁదికేల యెక్కితివి?—నీమనసున నిక్కముగ నేదేని యుద్దేశముండియుండును"

"ఉన్నది. కాని, అదేమో నేఁపుడు చెప్పలేకపోవుచుంటిని!"

"నేను విసిగించుచుంటి'నని జడియకుము!—ఇంచుక యోజింపుము. నీపై పాలకుము చలాయించుటకు నేను విగనరీనిగాను! రాబర్టు వలెనేఁగూడ నీహితైషినే!!

అద్భుతప్రదీపము ననుసరించి నేలమాలెయం దావిర్భూతమైన దైతునిఁ జూచినంతనే అలాఉద్దీను విస్మయమున కించుక మేరయే యుండెను; కాని, బాలకుఁ డగు జర్జిటు "ఓ! రాబర్టా!! అవు నాతఁడే! ప్రాచీరముపై కెక్కి నే నాతని జూడ దొరకొంటి" నని పలుకగనే మేక్సిమునకుఁ గలిగిన విస్మయమునకు మేరలేక పోయెను!!

రాబర్టు కర్నలుభోరిమఫ్‌యింటఁ బ్రవేశించుటయు, అందుబందియై యుంటయుఁ బదంపడి బాలుఁడు మేక్సిమున కెఱిగించెను.

యువకుఁడు విస్మయచేతస్కుఁడై చూచుచుండ బాలుఁడు మరల నిట్లు చెప్పఁదొడఁగెను: "రాబర్టుసౌధముకడకు నెక్కివచ్చిన బండి మరల నవ్వలికి రాఁగనే, అందు నాకతఁడు కాన్పింపలేదు. అతని విపాదకూపమునఁ బడవేయుటకే అందలి దొర వానినందు నిలువు చేసియుండెనని గ్రహించి, వాని నెట్టులైన నుద్ధరింప నిశ్చయించి, తోడిబాలకు నొకని యింటికరిగి, వానికడనుండి త్రాడొకటి కొనివచ్చితిని. అపుడు రాత్రి పదునొకండు గంటలగును! పథమున నెట్టి యలికిడిలేదు! త్రాటిని గోడమీఁది కెగురవైచితిని; తోడనే త్రాటికొక్కెము భిత్తికశిఖరమునకుఁ దవుల్కొనెను! త్రాడుఁబట్టు కొని పైకెగఁబ్రాకి చూచుసరికి నెదుట—"

"రాబర్టు కాన్పించెను కాఁబోలు!"

"అవును! చేతనొక క్రొవ్వువత్తెనిడికొని, అతఁడొక పెద్దకిటికీదా పున నిలువంబడి యుండెను! చూచియుచూడఁగనే నేనాతని గుర్తుపట్టి తిని. అతఁడుకూడ నన్ను గుఱుతించి యుండును! నన్ను లక్ష్యించి ఆతఁడు చేసన్న యొనరించెను!"

"తదుపరి?"

"తదుపరి నేను క్రిందఁబడిపోతిని. ఇఁక నాకేమియు జ్ఞప్తికివచ్చుట లేదు! మనసున నెన్నోతలఁపులు తాఱుమాఱగుచుండెను! నేనిఁక మాయవ్వకడకుఁ బోదును."

మేక్సిము జర్జెటును దోకొని వెడలిపోయెను—ఇన్నినాళ్లనుండి ఎవ్వనికోసరమై ఆతఁడు వెదకుచుండెనో, నేఁడాతని జాడ తెలియ వచ్చెను!

## 3

జర్జెటునుకూడ దీసికొని మేక్సిము పేరిసు పురరమ్యరాజపథమున విహారణ మొనరించుతఱి, కర్నలుబొరిసఫ్ నిజాగారమున కుసుమకోమలపర్యంకమున నొఱఁగి పన్నుండి ప్రధానపరిచారకునితో ప్రసంగించుచుండెను.

"ఖైదీ యిప్పుడేమి చేయుచుండెను?"

"నిదురించుచుండెను."

"అది కపటనిద్ర."

"ఉదయమున నీతో నేమైన నన్నాడా?"

"కొలఁదిదినములనుండి అతఁడేమియు ననుచుండుటలేదు. ఏమైన అడిగినను జవాబొసఁగడు."

"అతఁడారోగ్యముగ నుండెనుగదా?"

"ఆరోగ్యముగనే యుండెను. మీయింట బందియై యున్నను అతని ముఖవైఖరియందు మార్పేమియుఁ గన్పట్టుటలేదు. లోషాము కైవడి వాని మనస్సు కఠినమైనది. ఎట్టులైన నది లొంగునదికాదు!"

"పెంకెమానిసి. నిజావస్థగాంచి ఊరకుండుటే మంచిదని అతఁడు యోచించెను. నిష్కంటకమైన పథమునే యాతఁడు పట్టెను"

"మీరతని సైబీరియా మరుభూమికి పంపినయెడల, వాని దుర్దశ ఒక్కమారుగ శేషించును; ఇందుండిన, వాని కమంగళమేకదా!"

"తులువా! నీకించుకంతైన బుద్ధిలేదు."

"ప్రభూ! నేనొక మాటందును—దోసము సైరింపుఁడు. తోఁడు చోరాంగనలపేరు చెప్పినంతనే తన బాధ తొలఁగిపోవుచుండ, అతఁడు నోరుమూసికొని యుండెనేల? పేరు తెలుపకున్న తనకు ముక్తిలేదని వాఁడెఱుఁగడాయేమి?"

"ఎఱుఁగును. కాని యెవరిపేరుల నాతఁడడంచియుండెనో వారసాధారణులు; విశ్వాసఘాతకునకు కఠోరశాస్తిచేయక వారు మిన్నకుండఁజాలరు. ఇట్లని యాతఁడెఱుఁగును. సైబీరియాకుఁ గొనిపోయి, వాని ముక్కుసెవులు కోసివైచినను అతఁడు వెఱచువాఁడుకాఁడు. అందరుగుట కాతఁడడలనేరఁడు."

"మీరు చెప్పుచున్నది చేయరని అతఁడు యోచించుచుండవచ్చును."

"సెంటుపీటర్సు బర్గునందు లోకులపై ననాయాసముగ జరుగుపీడనము పేరిసు నగరమున జరుగనేరదని యిచటివారు యోచించుచుండవచ్చును. వారిభ్రమ తొలఁగొట్టెదను చూడుము. నీవు బండిసిద్ధము చేసి యుంచుము. దానిఁ జూడగనే వానినోరు విడవచ్చును."

"ఒకవేళ నతనికేమియుఁ దెలియదేమో!"

"నీమనసునకుఁగూడ నిట్టి సందియము తట్టెనా?"

"ఏలినవారితో—అభిప్రాయభేదము—నాకు కలుగలేదు. కాని తాముఅభయ మొసఁగుచో, నామనసునందలిమాట విప్పిచెప్పుదును."

"అదేమో చెప్పుము"

"రమ్యావిలాసినులతో వానికి గాఢసఖ్య మున్నయెడల, నీవఱలో నొడ్డిన వాగురములం దాతఁడవలీలగఁబడువాఁడుకాడు! అతఁడు మిగుల సరళస్వభావుఁడని నాయుద్దేశము. అతఁడు వర్జస్సుగారి కన్నియను ప్రేమించెను. ఆమెను పెండిలియాడవలెనను యభిప్రాయముకూడ వానికిఁగలదు. ఈవిషయ మేలినవారు మఱచియుందురు. అన్యకాంతాసంసర్గములేనివానికి చౌర్యమున నట్టియామె ప్రేరణ మొందుల కుండును?"

"కాశీపతి ఆతనియాసను మాపుఁజేసి నిజనిలయమునుండి నిర్వాసితుఁ గావించినపుడు ఎలిసు మీఁదితలఁపుదక్క ఉపపత్నియగు విలాసిని దురాలోచనకు వీనులొగ్గి ఆనాఁడే పత్రముల సహితముగ నగలపేటిక నాతఁడపహరించెను. విదేశమందు తనకు సాయము సలుపుదునని ఆయాఁడుది వాని కాశపెట్టియుండును. అందుచే దొంగతనము కావించినపుడు త్రోవవెచ్చమునకై యేఁబదివేల నాణెముల మాత్ర మాతఁడు కైకొనెను!"

"ఉత్తరముతోఁగూడ పైకమునెవరు వానికడకు పంపియేయుండకపోయినయెడల నిట్టి యనుమానము కలుగకనే పోయెడిది."

"పత్రమందెవరి స్వాక్షరములును లేవు!—అతఁడు తనకుఁదానట్టి జాబొకటి వ్రాయఁజాలును! వానితండ్రి ఎవనికేని ఋణమొసఁగుటను వది వట్టి కల్పనమాత్రమే!"

"కాశీయందు తాము తమపత్రముల పెట్టెనుంచుట నేయుపాయమునవో రమ్యావిలాసిని యొకర్తుక యెఱుఁగఁజాలుట మిగుల విస్మయ

కర విషయమే!"

"ప్రాయశః యీసంగతి రాబర్టే ఆమెకుఁ దెలిపియుండును. ఈ విషయమున ననుసంధాన మొనరించు టెంచుకంతైన సంతోషజనకము కాదు! తృతీయదళీయులు దీని సంబంధమున నేవార్త దెలుపలేరు. పేరిసునగరమున పలువురు రమణులు రహస్యముగఁ గుట్రలు సల్పుచుండిరి. వారి గుట్టుమట్టు లెవరికిఁ దెలియవు! పదగౌరవము కూడ నాకాంతలకుఁ దక్కవగలేదు! ప్రాయశః వారిలో నెవరో నా పెట్టియయున్కి నెఱిఁగియుందురు!"

"నే నీయువకుని గుఱించిన యుదంతమునంతయుఁ దెలిసికొంటిని. ఏ రష్యావాసినితోను వీనికి ముఖపరిచయమైన లేదని వింటిని. ఇయల్టాదేవితో వీనికి పరిచయమున్నదా లేదా యనికూడ నేను వాకబుచేసితిని. ఆమె నీయువకుఁ డెన్నఁడు కలిసికొనియే యుండలేదని నా దృఢవిశ్వాసము."

"దేవికిని రష్యా విలాసినులకును నెట్టి సంపర్కములేదు. నా మాటనుబట్టి మనదళీయులు ఆ నెలంతపైఁ గన్నువైచి వచ్చుచుండిరి. ఇయల్టావిషయమున నాకెట్టి సందియములేదు. ఆమె యొక రాజన్యుని పుత్రిక. వివాహమైన కొలఁదిదినములకే ఆమె వితంతు వాయెను! తదుపరి ఫ్రాన్సు సీమ కరుదెంచి నీచపదస్థులఁ గలియక విలాసామోదములం దాకాంత కాలము గడుప దొరఁకొనెను!—పోనిమ్మా విషయ మటుండనిమ్ము. ఇపుడీ కైదీని గుఱించి ఒక చూడాంతమును సిద్ధాంత మొనరింపవలెను. బాగుగ యోచించుకొమ్మని వానికి నేనొక మాసముకాలము గడువొసఁగితిని. రేపటితో నాగడువు గడచిపోవును. నన్ను గుఱించి అతఁ డేమైన నడిగియుండెనా?"

"లేదు. కడుపునిండ తిని కంటినిండ నాతఁడు నిదురించుచుండెను. అంతియే!"

"అతనితోఁ బ్రసంగింప విరమించి అనుచిత మొనరించితిని. వర్జర్సు తనయపరిణయము స్థిరమై పోయెను; రేపు వానిఁజూచి సంగతి తెలిపి చూతును. ఇంచుకపట్టు సడలునేమో చూతును."

"రష్యావిలాసినీదళీయుల యెడలున నాతఁ డేమియుఁ దెలుపడని యేలినవారు యోచించియుంటిరి. అట్టియోచనకు మనసున జోటీయఁ దగదని నా యభిప్రాయము. అతని బంధింపకుండగ నే ప్రకృతచోరులఁ బట్టఁజూచు టుచితమూయెడిది."

"తొందరపడినందున పొరపడియుందును. కాని యిపుడా భ్రమను సంశోధింపఁజనదు! రాబర్ట్సు జాగరూకుఁడై యుండెను—ఇపు డాతని వదలివైచినను, దళీయసంగిణుల నాతఁ డికఁ గలిసికొనడు."

"నే నీ విమయమును బాగుగ యోచించి చూచితిని. రాబర్ట్సున కెవ రేని సహకారియున్నట్లు నేఁ దలఁపను. అతని వదలివైచుట సమంజసము. కోర్టునుంగల నెట్టి యభియోగముఁ దెచ్చువాఁడఁ గానని వానిచే ప్రతిన జేయించినయెడల అతఁడు మిన్నకుండును. ఒక మాటు మాటయిచ్చినయెడల అతఁడు దానిఁ దప్పి నడువడు."

"రాబర్ట్సు నీ మేడలోనికి గొనివచ్చినపుడు బాలుఁ డొకఁ డాతని జూచియుండెను.—జ్ఞాపకము లేదా?"

"ఓ! మీా రాబాలకుని విమయముఁ జెప్పుచుంటిరా? అతఁడు ప్రాచీర మెక్కఁబోయి క్రిందఁబడిపోయెను! నాశవుచేసి కనుఁగొనఁగా వానితలకు గాటమగు గాయము తగిలెనని దెలియవచ్చెను! ప్రాణములతో నాతఁడు నిలచినను, బ్రదికినన్నాళ్ళు మూగియై యుండవలెను!"

"ఆతని శిరము మరలఁ దిన్నఁబడదని చెప్పఁగలరు? వానిఁ బోలు బాలకుఁ డిట్టి యాచరణమునకుఁ గడంగుట మిగుల నద్భుతముగ నుండెను; దొంగతనమున వానికి సంబంధముండియుండును!"

“అతఁడు దుఃఖినియగు నొక వితంతువు మనుమఁడు. రాబర్టుపై వానికి భక్తివిశ్వాసములు మెండు. అతఁడు కాన్పింపకపోవు టెఱిఁగి, అతాత్తుగ వాని జాడఁ దెలిసికొని సంగతియేమో కనుఁగొనుటకై ప్రాచీరము నధిరోహించెను. కాని యావిషయమున నొక వదంతిని ప్రచార మొనరింపకమున్నె పడినకతన వాని మస్తకము పగిలెను! ఇంతదనుక కార్యదర్శిని విడచిపుచ్చుటకు గాని, ఆతనివార్త నెఱుఁగుటకుగాని యెవరును యత్నింపలేదు. దానంజేసి వానిసంగతి యేరికిని దెలియలేదని స్పష్టపడుచున్నది.”

“సరిగ వచించితిని.—వీని విషయమున నీవు తెలిపిన విధమున యోచించిచూతును.”

ఇంతలో భృత్యుఁ డొక డచటి కరుదెంచి,

“స్వామీ! మీ కొఱకై ఎవరో వచ్చిరి.” అని యొకచీటి ఆతని కందించెను.

కర్నలు మిక్కిలి విసుఁగుఁజెంది “ఎవరు వచ్చిరి?—నే నెవరిని జూడఁజాలనని నీతోఁ జెప్పియుండలేదా?” అనెను.

“ఆ వచ్చిన యాతఁడు మిక్కిలి పీడింపఁ దొడఁగెను; మిగుల తొందరపని యున్నదఁట ఆతనికి.”

దొర చీటియం దాగంతుకుని పేరుఁ జదివి మిక్కిలి యక్కజ పడి “మంచి దాతని చావడిలోనికిఁ గొనిపొమ్మ” ని పిదప ప్రధాన భృత్యు నుద్దేశించి యిట్లనెను. “ఆగంతకుఁ డెవ్వరో యెఱుఁగుదువా?—కాశీపతి మేనల్లుఁడు. ఈతనితో నాకించుకంతైన పరిచయము లేదు. ఇచటి కేల యీతఁ డరుదెంచెనో గ్రహింపఁ గలవా?”

“అతనిమాతుల పంపియుండును.”

“కావచ్చును. కాని ఆతఁ డీసమయమున నరుదెంచనేల?—

పోయి నాబండి సిద్ధముచేసి యుంచుమని సర్దారునకుఁ జెప్పుము; బందీని విడతునో విడువనో యింకను స్థిర మొనరింపఁజాలను.''

తోడనే కర్నలు చావడిలోని కరిగెను. గవాక్షపార్శ్వమున గంభీర ముఖుఁడై, మేక్సీము నిలువఁబడి యుండెను. ఆతని వదనమండల ముపలక్షించి, ఏదేని అభము జరుగకమానదని దొర గ్రహించెను. సౌజన్యమధురస్వరమున నాతని నుద్దేశించి కర్న లిట్లనెను. "తమ రేపనిమీఁద నేఁడిచటికి దయచేసితిరి? మిమ్ముఁజూచి మిగుల నానందముఁ బడసితిని. మిమ్ముగుఱించి నే నీవఱలో వినియుంటిని కాని సమ్ముఖమున మీ పరిచయము కలుగుభాగ్య మీవరలో నా కలవడ లేదు.—మీ మాతుల వర్జస్సుగారు కుశలముగ నుంటిరిగదా? సుశీల యగు వారి కన్నియకు మంగళ మేకదా? ఆపె పరిణయదినము నిశ్చయ మైనట్లు వింటిని. నిజమేనా?"

"నేనావిషయ మెఱుఁగను. వేరుపనిమీఁద మీకడకు వచ్చితిని" అని మేక్సీము పరుషస్వరమున నుత్తర మొసఁగెను.

యువకుని గంభీరాకారమునుగాంచి—ఆతని తీవ్రకంఠస్వరమును వినినంతనే దొరభావముకూడ మాఱెను. ఉద్ధతభావమున నాతఁడు "ఇచట మీపనియేమో వెంటనే తెలుపుఁ" డనెను. స్థిరదృష్టుల కర్నలుపైఁ బఱపుచు "రాబర్టున కేమి ఘటించినది నేనెఱుఁగ వచ్చితి" నని యాగంతకుఁడు పలికెను.

యువకుని తీవ్రోక్తి వినినను, దొర దృఢచిత్తుఁడై యుండెను—ఆతనిలలాటమున ప్రతిభ రేఖ యొకటియైన నంకితము కాలేదు. స్థిర కంఠమున నాతఁ డిట్లనెను. "మీనుడువు అర్థమేమో నాకు బోధపడుటలేదు—మున్నెంపుఁడు. రాబర్టువిషయమున నన్నడుగుచుంటి రేల? మీమాతుల కచేరియందాతని నేనొకమారు చూచియుంటిని. కాని వానితో నే నెన్నఁడు ప్రసంగించియుండలేదు."

"కాని పదపడి మీరాతని విషయమై యాతురపడుట విలోకించి యుంటిని."

"మీ రనున దేమో స్పష్టముగఁ దెలిపెదరా?"

"రాబర్టు యిపు డెచటనుండెనో చెప్పుఁడు."

"నేనెట్లు చెప్పఁజాలుదును? నగలపెట్టె యపహరింపఁబడిననాఁట నుండి నేనాతనిఁ జూచియుండలేదు. అతఁడు దేశాంతరమున కరిగియుండును."

"ఒకమాసమునకు మున్నాతని నేనీపట్టణమునఁ జూచియుంటిని."

"మాసములో ఫ్రాన్సునుండి అన్యసీమకుఁ బోవు టసాధ్యము కాదా?"

"అతఁడొక బండిమీఁద మీ నిలయముదిక్కుగ పోవుట నేను వీక్షించియుంటిని."

"అట్లైన మీరేల బండిననుసరించితిరికారు! సంగతులన్నియు బోధపడియుండునే!"

"బండిననుసరింపలేదు కాని అది మీగృహాంగణమున బ్రవేశించుటఁ జూచితిని".

"ఏమి! మాగృహాంగణమునఁ బ్రవేశించెనా? మీరు యోచించి మఱిమాటలాడుడు—మీవంటివారిట్టి యద్భుతవార్తను నమ్ముటుచితముకాదు."

"అద్భుతవార్తకాదు. నాకీసంగతిఁ దెలిపినవాఁడు నిక్కమే వచించెను."

ఉబికివచ్చునగవునాపికొనులాగున నటించి కర్నలిట్లనెను. "పదచ్యుతుఁడై చౌర్యాపరాధియైన యనంతరమాతఁడు నన్నుఁ జూడవచ్చెనని మీరు యోజించుచుంటిరి. చోరుఁడేవచ్చి నగలపెట్టె నిచ్చివేయ నుంకించెనని మీరు తలంచియుందురు."

"చోరుఁ డెవ్వఁడో నేనెఱుఁగను. కాని రాబర్టు నిజేచ్ఛ నిచటికి రాలేదు."

"అట్టైన పట్టపవలు పేరిసు వీధులఁబట్టి అతని నిచటికి గొని వచ్చితినని మీ రనఁబోవుచుంటిరా? ఇట్టిసాహసము నాకాపాదించి నామానము మీరు పెబ్బిల్లఁజేసితిరి! కాని, అయ్యా! ఆతనిబట్టితెచ్చి నందున నాకు ప్రాపించులాభ మేమో తెలుపుదురా!"

"లాభాలాభములను నేనెఱుఁగను. అతని మీ రిచటికిఁ బట్టితెచ్చుట మాత్ర మెఱుఁగుదును. ఇవుడుకూడ నతఁడీ మేడయం దుండెను. అతఁ డిత్తఱి యిందు లేకున్నను మీరే వానినెచటికైనను తొలగించియుందురు. అతనిఁబట్టి యిచటికి తేలేదని మీరు మీ హృదయమునఁ జేయివైచి వక్కాణింపఁగలరా ?"

"తేలేదని హృదయమునఁ జేయివైచి వక్కాణించుటటుండ, నే నీవిషయమున నావంతయైన నెఱుఁగనని నొక్కిచెప్పుచుంటిని."

"అబద్ధము నొక్కిచెప్పి మీసాహసము వెల్లడించుచుంటిరి. కాని మీరాతనిఁబట్టి యిచటికిఁ గొనివచ్చుట సత్యేతరము కాదు."

కొన్నినిముసములు కర్నలూరకుండి పిదప అవమానవేదనావిధుర స్వరమున గంభీరభావమున నిట్లనెను. "దుండగము మెయి నాగౌరవమునకు నిట్లాఘాత మొనరింప దొరఁకొనినందులకు నేను మీకుతగిన ప్రతీకార మొనరింప నేర్తును. కాని నానెయ్యుఁడగు మీ మాతులమొగముఁజూచి నేనూరకుండవలసివచ్చుచున్నది. మీతో నేనికఁ జెప్పవలసిన దేమియులేదు. ఇఁక నీవిషయమును మీరు నన్ను పీడింపరనుకొనియెదను."

"ప్రసంగపీడన మేల! నేనన్యోపాయము నవలంబించెదను. అవసరమున్నయెడల పోలీసులసాయము పడయుదును!"

సగర్వమున కర్నలిట్లనెను. "నేనిఁక నీదౌష్ట్యమును సహింపఁ

జాలను. చాలసేపు మీప్రలాపమును వినియుంటిని; ఇఁక నేనేమి యు వినఁజాలను. మీరిపుడే యిందుండి అవ్వలికి వెడలిపొండు."

క్రోధారుణనేత్రుఁడై మేక్సిము "మీసిద్ధాంత మిదియేనా?" అనెను.

"ఔను. ఇట్లని నేముందే జెప్పిన బాగుండెడిది!"

"మంచిది. నేఁగూడ మీ దౌరాత్మ్యమును నీరవుఁడనై సహించు వాఁడనుకాను. ద్వంద్వయుద్ధమునందు దీని ప్రతిఫల మొసఁగుదును—రణరనియమసమయములను తెలుపుటకు రేపు నా సహకారి మిమ్ముఁ గలిసికొనును!"

"నేను సంసిద్ధుఁడనై యుంటిని!"

ఉత్తేజితుఁడై మేక్సి మందుండి నిష్క్రమించెను.

ఇంతదనుక దొర వెలుపలికిమాత్రము గాంభీర్యముఁ జూపెను! ప్రధాన పరిచారకుఁడు గదియందుఁ బ్రవేశించి ఆతని ముఖలక్షణముల నుపలక్షించి అవిలంబనమున నేదియో యుపద్రవము రానున్న దని గ్రహించెను.

కర్నలు—ఆతఁ డేలయరుదెంచెనో యెఱుఁగుదువా! రాబర్టు జాడ నతఁడు కనుగొనెను—యువకుఁ డీయింటనే యుండెనని నా ముఖము ముందు నొక్కిజెప్పెను. మాసమునకు మున్నాతఁ డీగృహముసఁ బ్రవేశించు టెవరో చూచియుండిరి.

"అతని కాబాలుఁడే యీ సంగతిఁ జెప్పి యుండునని తలఁచితిని. కాని అట్లని నిశ్చయముగఁ జెప్పఁజాలము. ఏలనన బాలుఁడు స్మరణశక్తిరహితుఁడై పడియుండెను!''

"సంగతి యెవరివలన వినిననేమి?—ఎట్లో అది వానికిఁ దెలియ వచ్చెను. పోలీసుల భయముఁగూడ అతఁడు నాకు జూపిపోయెను. ఫ్రాన్సు సీమదేశస్థుల కసాధ్యమైన దేదియులేదు. ఖైదీ నిప్పుడు విడు

దలఁ గావించు టసాధ్యము! వాని నిందుంచుటగూడ విషాదకరము! నేఁటి సాయంసమయమందే అతని నిందుండి తొలఁగింపవలెను. పోయి తంతిద్వారా మన యుద్యోగులకు స్టార్సుబర్గునకు మేలుపయనము నేర్పాటుఁ గావింపుడని తెలుపుము. నే నిప్పుడే ఒకమారు ఖైదీని చూచివత్తును. పోయి వానికిఁ గబురుచేయుము."

భృత్యుఁడు వెడలిపోయెను. క్రోధక్షోభములచే నధీరుఁడై జారి షఫ్‌దొర గృహమధ్యమునఁ బచారుఁ జేయుచు నిట్లు వితర్కింపఁ దొడఁగెను. "దుర్ముహూర్తమున పేరిసునగరమున కరుదెంచితిని. ఈ పాపీయసీయుల చక్రాంతజాలమును దుష్కాలమున భేదింప సమ్మతించితిని. రష్యాసీమయందు సందిగ్ధచారిత్రుల నవలీలగ బంధింప వచ్చును. కాని యిచట నంతయు విపరీతముగ నుండెను—నాయత్నము వితథమయినయెడల, నెల్లఱును నేను వట్టి మొఱకుఁడనని యోజింతురు. పక్షుల పంకమునకు రాబర్టు ప్రాయశ్చిత్తముఁ గావించుచుండెనని తోఁచుచున్నది!''

చింతాకులచిత్తుఁడై దొర పుస్తకాగారాభిముఖముగఁ జనెను. మాసమునకు మున్ను రాబర్టియాగారమందే ఖైదీ గావింపఁబడెను.

ఈ మాసము దినములనుండి బంధితుఁడై, మనోవ్యాధిబాధితుఁడై రాబర్టు కాలము పుచ్చుచుండెను. విగనరీ మెలిసుల ప్రణయవృత్తాంత మెఱిఁగించి కర్నలు తఱచుగ వాని ఆొమ్ముస నమ్ము వైచి, అతని యలజడిఁ గాంచి ప్రమోద మానసుఁ డగుచుండెను! అటుల ధైర్యోపేతుఁడగు యువకుఁ డీయుత్పీడనమునంతయు సహించి సంతాప జడధిమున్గియున్నను తన వేదనమును ప్రకాశింపకుండెను! అతఁ డిట్లు దినములు పుచ్చుచుండ నొకనాఁటి నిశీథిని ప్రాచీరమున జర్జ టాతనికి దృగ్గోచరుఁడాయెను.—నిరాశాతమసావృతమైన నాతని హృదయకుహరమున నూతనాశాలోకము సూపట్టెను! కాని ఆ

యాస మాయావినియై వానివంచించివైచెను. దినమువెంబడి దినము వారమువెన్క వారమతీతమాయెను! ఎంత వేచినను బాలకుని సౌమ్యసుందరప్రతిమ మరల నాతనినయనపథమునఁ బడలేదు! క్రమక్రమముగ కర్ణులు రాకపోకలుకూడ ముగిసెను! ఆశాప్రదీపము నిర్వాణమాయెను! హతాశవ్యథితహృదయుఁడై ధ్యానమగ్నమాని మాడ్కి నిస్తబ్ధుఁడై పరిణామమును ప్రతీక్షించుచు అతఁడు కాలముఁ బుచ్చదొడఁగెను. ఆతని స్థిరశక్తిని, అచల ధైర్యమును గాంచి పరిచారకు లంద ఱాశ్చర్యమగ్న మానసులైరి!

రాబర్టిట్లు సమయ మతివాహిత మొనరించుచుండ, దొరవానిఁ జూడ నాగారమునఁ బ్రవేశించి యిట్లనెను. "చాలదినములైన పిదప మిమ్ముఁ గలిసికొంటిని. నేఁ జెప్పినదాని విషయమై యోచించి తెలుపుటకు మీ శోకమానసము మితిమీఱెనఁగితిని. రేపటితో నామితి సరిపోవును. సంగీణులపేరులు తెలిపినంతనే మీరు విడుదలఁ బడయుదురని నమ్ముడు. నా జతనముకతన మీరు మరల కౌశీపతికిఁ బ్రీతిభాజను లగుదురు."

"మీ పల్కులు ప్రలోభనీయములే!—నేను నిర్దోషిని. నా కెవరును సంగీణులుకాని సహచరులుకాని లేరు. అనృతము వచించి నే నిందుండి దాట గమకింపను."

"కుమారి తమకు దుష్ప్రాప్యమై పోయినదని మీరు యోచించుచుండవచ్చును. కాని యట్లు తలఁపకుఁడు. నే నంతయు మీకు విప్పి చెప్పుచుంటిని—

"మీరాలోచింప కష్టపడ నక్కఱలేదు. మీ క్షేమమును అనుడు—నా యొద్దనుండి ఏమాటను బడయఁజాలరు!"

"అవుఁగాక, అయినను అన్ని విషయములను వినుట మంచిది. కౌశీపతి తన తనూభవను విగనలీకీయ నిశ్చయించునట్లు మీ రెఱుఁ

గుదురు. ఇన్నినాళ్ళకు వివాహదినము నిశ్చితమాయెను. విగనరీకంఠమున వరమాల్యము వేయ నెలిసు సమ్మతించెను. మీరు కార్యరంగమున లేనికతననే యింతమట్టునకు జరగిపోయెను. నేఁ జెప్పినట్లు తాము వినుచో నీ పరిణయమున కంకిలి కలుగకమానదు."

"నాపై నిట్టి యత్యాచారము చూపినందున మీ కొదవు లాభమేమి? రేపకడ నేను విడుదలఁబడసినను, నిశ్చితమయిన కల్యాణము నిలిచిపోఁజాలదు. ఆ యుద్వాహమును ప్రతిఘటింప నే నెట్టి ప్రయత్నము సలుపను!"

"ఇంకను వేళ మించిపోలేదు. ఇవుడుకూడ పెండిలి యాగిపోఁజాలును. నిజేచ్ఛకు విరుద్ధముగాఁ గుమారి వివాహమునకు సమ్మతించెను. పలుదినము లాయబల నిజహృదయముతో దారుణసమీకము సలుపుచు మీయాగమనమును ప్రతీక్షించి యుండెను! మీ నామమునకుఁ గళంకము నాపాదించినవారినోళ్ళు తాము కట్టివేయుదురని యామె యాశపడెను. కాని ఆయాశ విఫలమగుటచే, హతాశహృదయయై నియతీచరణముల నామె యాత్మసమర్పణ మొనరించుకొనెను! మీరేల నిన్నినాళ్ళు నీరవులై, నిశ్చేష్టులై యుంటిరో గ్రహింపఁజాలుట కష్టముకాదు. మీపైఁబడిన యపవాదమునుగుఱించి జర్జటను బాలకుఁడు మీకుఁ జెల్పియే యుండును."

జర్జటుపేరువిని రాబర్టించుక చకితుఁడాయెను.

దొర—ఈబాలుఁడు మీహితైషియై యుండును. మిమ్ము బండిలోఁ జూచి యతఁ డరుదెంచెను. బహుకష్టమున వాని నిందుండి తొలగించివైచితిమి. నేలఁబడినందున, వాని శిరమునకు బలమైన గాయము తగిలెను. పాపము బాలకుఁడు స్మృతిఁ గోల్పోయెను! కావున నిఁక వానిసాయమున మీరు విడుదలఁబడయుదురనుమాట కల్ల!"

బాలకుని దుర్దశను గూర్చి వినగనే యువకుని ముఖము వివర్ణమైపోయెను. దొరనుద్దేశించి యాతఁ డిట్లనెను. "మీ రేల యీ వ్యర్థప్రసంగము సలిపెదరు? నాకడనుండి మీ రేమియు నెఱుఁగఁజాలరు. ఇట్లని వేమాఱు చెప్పియుంటిని. ఇపుడుకూడ చెప్పుచుంటిని. మీ రెట్టిప్రలోభనమును చూపినను చూపుడు; నా భావిప్రణయ సుఖమునుగుఱించి మోహామయ ప్రతిమల నెన్నెని దృష్టి సమక్షమున నంకిత మొనరించిన నొనరింపుడు. మీ మనోరథము సఫలము కానేరదు. నిక్కముగ మీతోఁ జెప్పవలయునదేమైన నున్న యెడల నేనేల సంకోచింతును? ప్రేమసమ్ముఖమున జీవనము తుచ్ఛమైయుండ, కుట్రయందలి సహచరుల నెంతవారు? నేను మీ పేటి నపహరించి మీరనినట్లు విలాసినుల కొసఁగియే యున్న యెడల, ప్రేమార్థినినైయై, ఇపుడు దుఃఖితహృదయుఁనై పొగులునెలిసుకొనరమై ఆ పేటిని మఱల తెచ్చి మీకొసఁగివైచువాడను! మీరు నాకీయదలఁచు భాగ్యమును బడయుటకు ఎవరిపగగాని పాటింపక, వేయి మాఱులు మృత్యువునైనను హర్షోత్ఫుల్లచిత్తుడనై కౌఁగిలించుకొనువాడను! నే నేమియు నెఱుఁగను. నన్ను పీడించి పిప్పి చేసినను నావలన మీ రేమియుఁ దెలిసికొనఁజాలరు! నేను మిథ్య వచించుట లేదు. హృదయపూర్వకముగ నిజము చెప్పుచున్నాను. ఇపుడు మీ యిష్ట మెట్లో అట్లాచరింపుఁడు! నా గొంతుకోసినను, నా కంఠమునుండి యసువుల నూడ వెఱికినను, నావలన నపహరణవిషయ మేమియుఁ దెలిసికొనఁజాలరని మఱొకమారు నొక్కి చెప్పుచుంటిని!"

రాబర్టు నుడువులు విని దొర నిర్విణ్ణుఁడై పోయెను. ఇఁక నాతని నోటినుండి యేమాటయు వెలువడలేదు. పెదవి కఱచుకొని— "ఈతని బంధించుటకాని పనియైయుండు"నని యాతఁ డనుకొనెను!

# ౪

మేక్సిము కర్నలును కలిసికొనిన నాఁటి ప్రభాతమున నొక తరుణి భీత హారిణమువలె చంచలచరణయై పేరిస్ రాజమార్గమునుండి చను చుండెను. ఆమె సుందరానన మొక యవగుంఠనముచే నావృతమై యుండెను. హార్మ్యరాజి ఛాయ ననుసరించి చనుచు, చంచల విలోల దృష్టులఁ గుట్టిమంబులపై నాకుటిలాలక పఱపుచుండెను. లోకుల కౌతూహలదృక్కుల దాటి చన యత్నించుచు, నెవరైనఁ దన్నునుగ మించి వత్తురేమోయను భయ మామెను బీడించుచున్న ట్లాసారంగ లోచనను విలోకింపఁగనే బోధపడుచుండెను. మార్గమధ్యమున నొక రక్షకభటునిఁ గాంచి, "ఇయల్టా దేవి గృహ మెచ్చట?" అని మృదు స్వరమున నా మృగాక్షి వాని నడిగెను.

"ఇదె ఆమె గృహము. ఈ కాన్పించునదే ఆమె యుద్యానప్రాకారము. ఈచిన్ని గుమ్మము నతిక్రమించితిరేని, తోరణద్వారము చూపట్టును. దానిగుండా లోని కరుగవచ్చును."

సీమంతిని చనెను. గమ్యస్థానము చేరుకొలఁది ఆలలన నడక అల్లన కాఁజొచ్చెను. ద్వారసమ్ముఖమున పిల్లకొండవలెనున్న స్థూలకాయుఁడగు నొకద్వార రక్షకుఁడు నిలువఁబడి యుండెను. వానిదాపునకుఁ జనతరుణి భయముఁజెంది, యటనున్న గంట మ్రోయించి వానినుద్దేశించి, "దేవిదర్శన మపేక్షించుచుంటి" నని మెల్లగననెను. ద్వార రక్షకుఁడు "నేఁడామె ఎవరినిగాని జూడఁజాలదు. మీ పేరేమి? ఎందులకై వచ్చితిరి?——"

"కౌంటీపతి తనయ అరుదెంచెనని చెప్పుము. ఆమెదర్శన మీయ వచ్చు" నని యించుక కంపితస్వరమున నామె జవాబొసఁగెను.

“అమ్మా! క్షమింపుఁడు; నేనిపుడేపోయి కబురుఁ దెల్పెదును. ఆమెపరుండి యున్నందున నట్లుచెప్పితిని.”

ఇంచుక నేపటిలో నాతరుణి దేవి శయనమందిరమునకుఁ గొంపోఁ బడెను. ఇంకను మంచమువీడి నడచుటకు దేవికి శక్తిరాలేదు. తల్ప మునకు నాల్గుతట్టులను విచిత్రరాగ సంశోభితములయిన పట్టుతెరలు వ్రేలాడుచుండెను! వాతాయనములు నానావర్ణ రంజితకాచ ఫలక ములతో విరాజిల్లుచుండెను! సంశయాకుల స్వాంతయై, నిర్దేశింపఁ బడిన ఒకసోఫాపైఁ గుమారి కూర్చుండ, అతికోమలమై, మధురమై, త్రిదివ సంగీతతుల్యమైన స్వరమున దేవియిట్లనెను—

“మీరరుదెంతురని నేనెఱుఁగుదును. అతని విషయమై మీతో గొంత ముచ్చటింతునని మీరు ముందేగ్రహించి యుందురు!”

కుమారి మొగము బిడియముచే నెఱ్ఱనైపోయెను. మెల్లగ నామె దేవి పాన్పు ప్రక్కకరిగి నిలువఁబడెను.

దేవి—మీరరుదెంచి నందులకు మిగుల నానందించితిని. మీరు రాకున్నయెడల, మిమ్ముఁజూచు భాగ్యము నాకింతలో నలవడకుండె డిది! మాటలాడుటగాని, ఇటునటుఁ జనుటగాని కూడదని వైద్యుఁడు చెప్పియుండెను, కాని అతని నిషేధమును చెవిబెట్టఁజాలనైతిని. నిన్న నించుకగుణము కాన్పించెను. కాని మీ యింటియొద్దనుండి మఱలి రాగనే జ్వరము తీవ్రమాయెను. ప్రక్కపైఁగూర్చుండి మాటలాడుడు.”

కుమారి అట్టులే కూర్చుండి ఆవేగ కంపితస్వరమున నిట్లనెను. “ఈ యవస్థయందు దర్శన మొసఁగినందులకు మీ కనేకవందనము లర్పించుచున్నాను. మీకడ నేనే మాటయు దాఁచను. జనకుని అను మతిఁ గొనకయే అరుదెంచితిని!”

“అందులకు నే నాశ్చర్యపడుచుంటలేదు. నిన్న నేను మీ భవన మునకు వచ్చినపుడు మిమ్ముఁ జూచుటకు మీ జనకుఁ డనుమతింప

కుండుట జ్ఞాపక మున్నది. అన్ని యవాంతరముల నతిక్రమించి, మీ రరుదెంచినందులకు నాకు పట్టరాని ఆనందము కల్గుచున్నది.''

"రాబర్టు నిరపరాధియని ఋజువుచేయ మీరు యత్నించుచున్నట్లు మేక్సిము నాకుఁ దెలిపెను. అందుచే మీకడ కరుదెంచితిని.''

"మీరాతని ప్రేమించుచుంటిరి—కాదా?''

"అవు''నని నతవదనయై కుమారి మెల్లనఁ బల్కెను.

"అట్లయ్యు మఱొకనికి మిమ్మొసఁగుటకు మాటలు జరిగియుండెను కదా!''

"రాబర్టు చెడుపనిచేసెనని నాకందఱు బోధించిరి. అంతియెకాక వేగమే పెండ్లి చేసికొమ్మని జనకుఁడు పలుమాఱు నన్ను బ్రతిమాలఁ జొచ్చెను. నేనాతనిమాటలు పెడచెవిఁబెట్టఁజాలకపోవుచుంటిని. కాని నాహృదయసింహాసనమునుండి రాబర్టును దొలగింపఁజాలకపోవుచుంటిని. ఇట్లని లోకులెఱుఁగరు."

"అతఁడు దొంగతనమొనరించెనని వారు ఋజువుచేసితిరఁట కాదా? ఇది మిథ్యాకళంకముకాని వేఱుకాదు—మఱొకమాటాడుటకు మున్ను మిమ్మొకవిషయమడుగుచుంటిని. ఈసంగతులన్నియు మీ కెవరు తెలిపితిరి! మీరేమేమివింటిరి''

కుమారి తాను వినినదంతయుఁ దెలిపివైచెను.

"రాబర్టు చోరుఁడని వారలు సిద్ధాంతీకరించిరి! పత్రములతో నున్న ఒకపెట్టె నపహరించిన ఆతనికివచ్చు లాభ మేమని మీరేల నాచెనటుల నడుగలేకపోతిరి? మందసమునిండ మణిమాణిక్యములు ప్రోగులై పడియుండ ఆతఁడేల వానిఁ దాకలేదని వారినేల అడిగితిరి కాదు?''

"ఇనుపపెట్టెనుండికూడ ఏఁబదివేలు హరింపఁబడె" నని ఆవేగరుద్ధస్వరమున కుమారి పల్కెను.

"అది వట్టి యబద్ధము!"

"నిక్కముగ రూపాయ లపహరింపఁబడెను. నా జనకుఁడును, దొరయు నెదుట నుండగనే విగనరీ మందనమందలి పైకమును లెక్క పెట్టెను. అప్పు డొక నోటులకట్ట వానికిఁ గాన్పింపలేదు."

"అట్లిన్నటికి జరిగియుండదు. అంతకు మున్నొకమాఱు అపహరణయత్నము జరిగియుండెనను విషయము మీ జనకుఁడు మీకుఁ దెలిపియుండెనా?"

"లేదు—అంతకుమున్నట్టి దేదేని జరిగియే యున్నయెడల నేను తప్పక వినియుందును. విగనరీయే నాకుఁ దెలిపియుండును."

"అట్లైన బాలకుఁడు పొరపడియుండును; అతఁడే నాకీసంగతి తెలిపియుండెను."

"జర్జటు మేక్సిముతోఁగూడ నిన్న మా కచేరికి వచ్చియుండెను."

"బాలుఁ డెట్లుండెను."

"ఆరోగ్యవంతుఁ డాయెననియే నా యభిప్రాయము; కాని వాని మానసికావస్థయం దింకను మాఱుపు చూపట్టలేదు."

"అట్లైన మీ మాతుల నందనుని కాతనివలన నేమియుఁ దెలియ రాలేదా?"

"విగనరీ సమక్షమున నపహరణమును గుఱించిన విషయముల నెన్నియో చెప్పియుండెనఁట. మఱి కుదుటపడినంతనే అతఁడు చోరుని పేరుఁగూడ జెప్పఁజాలునఁట!"

"అట్లే కావచ్చును. రాబరును గుఱించిన యుదంతము నేమయిన బాలుఁ డీవఱలోనే మేక్సిమునకుఁ దెలిపియుండునని యేనూహించితిని."

"రాబర్టు పేరిసునందే యుండెనని మీ యభిప్రాయమా?"

"ఉండెననియే నా దృఢవిశ్వాసము. మీతోఁ గలిసికొనవలసిన నాఁడే అతఁడు పగతురచేతులఁ బడియుండును!"

“మే మిరువురము కలిసికొనవలసి యుండెననికూడ మీ రెఱుఁగుదురా?”

“నే నన్నియు నెఱుఁగుదును. మేక్సిము నా కన్నివిషయములు విశదముగఁ దెలిపివైచెను. ఇపుడు మంచముఁబట్టి యున్నందున నేమియు సేయఁజాలకుంటిని. ఇక సమయమాయెను. రాబర్టును వెతకి కనుగొని తీరుదును. అతనిఁ గనుఁగొనగలిగితి నేని స్వయముగ నే నాతని మీ జనకునిపాలికిఁ గొంపోయి అతఁడు నిర్దోషియని వలయు ప్రమాణములను జూపుదును.”

“జర్జటు దొంగతన మొనరించెనని మా మాతుల నందనుఁడనెను.”

“నే నామాట మీతోఁ జెప్పలేదు; కాని రాబర్టు నిర్దోషియని శపథపూర్వకముగ నేను జెప్పఁగలను!”

దేవి పలుకులవలన నెలిసు సంశయములన్నియు దూరీకృతములాయెను. ఆ మహిళ నిక్కపుచోరు నెఱుఁగుననియు, నిరపరాధుని కళంకభంజనార్థ మా యపరాధిచే నాత్మదోషము నొప్పుకొనునట్లామె యొనరించుననియుఁ గుమారి గ్రహించి, అంతరంగమున నామె మంగళము నాకాంక్షింపఁ దొడఁగెను. కాని హఠాత్తుగ నొక సందేహ మామెకుఁ దోఁచెను. దేవి కేవలము నిరపరాధికళంకమును విమోచన మొనరించుటకే యింత యాతురపడుచుండెనో, లేక ఆమె మనసున మరేమయిన నుద్దేశముండెనో,—రాబర్టు నామె ప్రేమింపలేదుగద యను శంక కుమారినిఁ బీడింపఁదొడఁగెను!

కుమారి మ్లానముఖియై యుండుట విలోకించి దేవి యిట్లనెను: “తా మిచటి కరుదెంచినందులకుఁ జింతిలుచుండుట లేదని తలఁచెదను. రాబర్టును రక్షించు నుపాయమును మన మిరువురము యోచింపవలయును గదా!”

“అతనికిని మీకును చెలిమి ఎంతకాలమునుండి యున్న?” దని లజ్జాభరితమృదుస్వరమున కుమారి ప్రశ్నించెను.

“నేనాతని నెన్నడయినఁ జూచినట్టులే నాకు జ్ఞాపకము లేదు. అతఁడు నాకు అపరిచితుఁడు!”

కుమారి ముఖమున హర్షదీప్తిద్యోతకమాయెను. తన ప్రేమోదంతమును,—రాబర్టుయెడఁ దనకుఁగల గభీరానురాగవృత్తాంతము నామె దేవి కెఱిఁగింప నుంకించుచుండ, పరిచారిక ఆగారమునఁ బ్రవేశించి, “మేక్సీముగా రరుదెంచి ఇపుడే మిమ్ముఁజూడ వాంఛించుచున్నా” రనెను.

“తీసికొనిరమ్మ. ?’

దాసి నిష్క్రమింపఁగనే కుమారి “నామాతులనందనుని కన్నులఁబడి మఱింత సిగ్గుల పాలగుదును. ఇపు డేమిసేయుదును!” అనియెను.

“మీ రిచటి కరుదెంచిన ట్లాతనికిఁ దెలియరాదా?”

“వేయివందనములు.—తెలియనీయఁగూడదు.”

“మంచిది. మీ రీగదిలోఁ బ్రవేశింపు” డని తన తలవైపునున్న కవాటమును జూపెను.

ఎలిన్ తోడనే ఆగారమునఁ బ్రవేశించెను.—అది దేవి ప్రసాధనాగారము.—మిగులఁ బెద్దవియగు నిలువుటద్దములతోడను, విచిత్రశిల్పనైపుణ్యముఁ దెలుపు సుందరాసనములతోడను నిండియుండెను.

శయనాగారమునఁ బ్రవేశించి మేక్సి మిట్లనెను. “ఇంత సుస్తీగానున్నను, నిన్న బయటకు పోయియున్నారా?”

“అవును. కాని పనియేమియు జరుగలేదు. ఇపు డందులకుఁదగు ఫలము ననుభవించుచుంటిని. కానిండు.—జర్గటు మా టేమో చెప్పుఁడు.”

“చెప్పవలసినది చాలగనున్నది. కాని ముఖ్యాంశములను ముందుఁ

జెప్పుదును.”

“జర్జ యెట్లుండెను?—వానికి మరల పూర్వస్మృతి కలుగును కదా?”

“కలుగుననియే నా నమ్మకము. అపుడప్పుడు వాని కది కలుగుచుండుగాని మరల చలించిపోవుచుండును. నేఁడాతఁడు కొన్ని సంగతులు చెప్పివైచెను. ఇంకొకవేళనైనచో నాతఁడు వానినిఁ జెప్పకనే పోయియుండును.”

“వాఁడేమేమి చెప్పెను?”

తాను వినినవిషయముల నెఱిఁగించి యువకుఁడు “దొంగతనమున జర్జటుచోరులకు సాయ మొనరించెనని నా దృఢవిశ్వాస” మనెను.

“మీరు వచించినది సత్యదూరమై యుండదు.”

“ఇట్లని గ్రహించినంతనే మీకు క్లేశ మొనవుటలేదా?”

“ఇం దొక రాజనైతికవ్యాపారము కాదా?”

“రాజనైతికవ్యాపారమా?—ఏమనుచున్నారు?”

ఇరువురుచాలసేపు ప్రసంగించుకొనిరి. సీహారనృత్యప్రాంగణమునఁ దాను సుందరిని గాంచుటయు, ఆ కాంతయొక్క జనవిహీనమయిన దివ్యహర్మ్యముఁ దాఁ జూచుటయు, ఆ సౌధమున గాఁపుండు విదేశీయుని విలోకించుటయు, మందసమునుండి నగలపేటిక నాతఁ డే యపహరించుటయు జర్జ యెఱింగించినట్లు యువకుఁ డొక్కొక్క విషయము దేవి కెఱిఁగించెను. పదఁపడి బాలకునికడ రాబర్టునుగురించి తాను వినిన యుదంతముఁ దెల్పుచు నాతఁ డిట్లనెను. “ఆతఁ డెవరి నిలయమందు బంధింపఁబడెనో వినినయెడల మీ రాశ్చర్యపడకమానరు. పెట్టెను గోల్పోయిన రష్యాదేశస్థుఁడే ఆతని బందీ గావించెను!”

“ఎవరు! బొరిసఫ్ కాఁడుకదా? అతఁడు కాకున్న నట్టి ఘోర

పాపి మ జెవండు కలఁడు? రాబర్టు నతఁడు తన మాయావాగులఁ బడవైచి బంధించి వేసెను! వాని కసాధ్యమైన కృత్య మేమియు లేదు."

"ఆదురాత్ముఁ డింకను వాని ప్రాణములను గొనకున్నయెడల, అదృష్టవంతులమే."

"ఏమి! అతఁడు మానవాంతకుఁడా?"

"అతఁడు రష్యాపోలీసులపత్తేదారు! ఎట్టులయిన నపహరింపఁబడిన పెట్టెను వెతుక నాతఁడు యత్నించును! రాబర్టుమీద నీ కళంకము మోపఁబడినందుననే అతఁడు వానినిబంధించివైచెను. సాధ్యమయిన, వాని ప్రాణములఁ గాఁపాడుట కిఁక నొక నిముసమయిన నాలసింప రాదు. నేఁ బూనుకొన్న నీ కార్యము కానేరదు. మీరుమాత్ర మీ పనియందు చేయి జేసికొనకుఁడు."

"ఏల?—నే నప్పుడే చేయిఁ జేసికొంటినే!"

"ఏమి చేసితిరి!"

కర్నలును దాను గలిసికొనుటయు నాతనితోఁ దీవ్రముగఁ బ్రసంగించుటయుఁ దేటతెల్లముగ యువకుఁ డామెకు దెలిపెను. సంగతులు విని విచలితచిత్తయై దేవి "అంతయు వమ్ము చేసితిరే!" యనెను.

"ఏమి—అట్లనుచున్నారు?"

"మీ రట్లు జగడ మాడినంతనే ఆ దుర్మతి రాబర్టును వదలి వేయుననియే యోచించితిరా!"

"నే నేమి దీర్ఘాలోచనచేయక కోపముతో ఆతని దావున నట్టి తీవ్ర ప్రసంగము నలిపితిని!"

"అందులకై నేను మిమ్ము నిందించుటలేదు. మేలు కోరియే మీ రట్లొనరించువారు. కాని, యికనైన నప్రమత్తులరై యుండుడు. ద్వంద్వయుద్ధమునకు డీకొనకుఁడు. దొరకడ కెవరిని బంపిన ప్రయో

జనములేదు. పత్రములపేటికను హస్తగత మొనరించుకొనిన చోరు నకు భీషణప్రతీకారము నలుప నాతఁడు బద్ధకంకణుఁడై యున్నాఁడు. అతఁడు కడుంగడు దుష్టుఁడు. దొంగ తన చేతికిఁ జిక్కినయెడలఁ దత్క్ష ణమే వానిని హత్య గావించుట కాతఁడు సంశయింపఁడు. మీరు జాగరూకులై కనిపెట్టుచుండుడు.''

"ఇది రాజనైతికచౌర్యమనే మీరు యోజించుచున్నారు—ఈ దారుణకృత్యమును జేయఁజాలినవా రెవరు!"

"ప్రాయశఃవిదేశీయు లెవరైన నీపనిఁజేసియుందురు. యూరపుఖండ మంతయు నిపుడు నిర్వాసితుల కాలవాలమై యున్నది. రష్యాయందు జరుగు దుర్భరమైన యత్యాచారములనోర్వనేరక పలువురు రాష్ట్రాం తరసీమల కరుదెంచి యా దురంతాపచారములకు వలయుఁ బ్రతీ కారము సల్ప ప్రయత్నించుచున్నారు. భాగ్యవశమున నే నాయేలిక యధీనమం దుండుదానను గాను. అందుచే కర్నలు వంటివానితోఁ నాకుఁ బరిచయము కలుగలేదు. కాని దుర్బలుల పక్షము నవలం బించుట నా స్వభావము. అపరాధపరిశోధకులమని చెప్పుకొనుచు నిర్దోషులనే పీడించువారి చెడు చెయిదముల కడ్డు నిలిచి నిరీహులను గాఁపాడ యత్నించుచుందును."

"రాబర్టు నిర్దోషియని మీరు బాగుగఁ నెఱుఁగుదు రనుకొనెదను. అందుచేతనే తా మాతనిఁ గాపాడ గృతనిశ్చయులై యున్నారు."

"మీవలె నతఁడును నిర్దోషియే! దొర పత్రముల నెవ రపహ రించిరో మే మెఱుఁగుదుము. తన పితామహి యుద్బోధనము నాలించి జర్జ టీకృత్యమునఁ జేయి చేసికొనియుండును. అతఁ డింకను పూర్ణస్వస్థుఁడు కానందున వాని యవ్వతో నేమియుఁ జెప్పఁజాలక పోవుచున్నాఁడు. ఇపుడు దొరపూనిన కర్జమును ప్రతిఘటింపవలయును! రాబర్టునంటిన కళంకమును తుడిచి తీరవలయును!"

«ఈ యత్నమున మీరు తోడ్పాటునుగూడ నంగీకరింపవల యును:—ఈ భీషణ సంఘటనమునకు సంబంధించిన విషయములు కొన్ని మీకు విప్పి చెప్పెదును. మందసమును పగులఁగొట్టవలెనను యత్నము రెండుమారులు జరిగియుండుట మీ రెఱిఁగియుందు రను కొనెదను!» ఇట్లని మేక్సిము అన్ని సంగతుల నొక్కొక్కటిగ నామెకు నివేదించెను. మందసపుమరయందొక స్త్రీయొక్కహస్తము కొనఁబడుట గూడ నాతఁడు తెలిపివైచెను!

«సాధారణచోరుఁడుగాని, చోరాంగనకాని యీపని సలిపెనని మీరు తలఁచుచున్నారా?''

«ఏదేని విశేషోద్దేశసిద్ధికొఱకే ఈ పని జరిగియుండును. కాని, దురదృష్టవశాత్తు నేనును విగనరీయు మొదటి సంఘటనమును మరుగుపరచితిమి.»

«ఇదంతయుఁ దలఁచిచూడ రాబర్టు నిక్కముగ నిర్దోషియని బోధపడుచున్నది. మొదటిమారు చౌర్యయత్నము జరిగినపు డాతఁడు కౌశీపతి యాగారమున నతిథుల నడుమనుండెను. చోరుల కాతఁడు సాయము సలిపియేయున్నయెడల మందసముయొక్క చిత్రపు మర సంగతి నిక్కముగ వారికిఁ దెలిపియుండును—ఆ యభాగిని హస్తము ఛిన్నము కాకనే పోయెడిది!»

"అవును మీ రనినది నిక్కమే!

«ఈ చౌర్యానంతరముగూడ మీర లిట్లు అంధులైనందులకు నేను విస్మయపడుచున్నాను. ఒకఁ డాసమయమున నింట లేకుండుట వలన నెట్టిదోషభారము నాతనిపై మోపివేసితిరి!'' ·

ఏదియో యోజించి దేవి మరల నిట్లనెను.

«మనసున దురభిప్రాయమునకుఁ జోటిచ్చి అంధుఁడై మెలఁగిన కౌశీపతి తన వాంఛకుఁ బ్రతికూలముగఁ దన తనూభవను పెండ్లిఁ

గావించుకొన యత్నించినందులకు రాబర్టుపై నీ యపనింద నాపాదించుట నా కంత ఆశ్చర్యముగఁ దోఁచుటలేదు. అతఁడు సాధుప్రకృతిఁ గలవాఁడే యయినను, మానవుని మనసునఁ గల భావముల నన్నిటిని హృదయంగ మొనరించుకొనఁజాలు శక్తి యతనికి లేదు. ఈ విషయ మటుండ, రష్యాదేశస్థుఁడగు నీ గూఢచారి నిజమైన చోరునిఁ బట్టఁజాలక, యెదుటఁ గానబడినవాఁడే యపరాధి అని నిశ్చయించెను. కాని యీవిషయమున విగనరీ యాచరణ మన్నింటి కంటె అగమ్యగోచరముగ నున్నది."

"విగనరీయాచరణ మనిందనీయము; రాబర్టు చోరుఁడని మా మాతుల చెప్పినప్పుడు శక్తివంచనలేక విగనరీ యాతని నడ్డుకొని ప్రతివాదము సలిపెనఁట"

"అపుడు మీ రచట నే యున్నారా?"

"లేను; ఇట్లని విగనరీ చెప్పగా వింటిని. అతఁ డబద్ధము వచించువాఁడుకాఁడు. రాబర్టు వాని ప్రాణమిత్రుఁడు."

" కేవలము మిత్రుఁడుకాఁడు; ప్రణయమున ప్రతిద్వంద్వికూడ గదా!"

"ఎలిన్సు విగనరీహృదయపూర్వకముగాఁ బ్రేమించెను; కాని ఆమె తనకు లభ్యమగునని అతఁడెన్నడాసించి యుండలేదు—రాబర్టు ఎలిసుల ప్రేమోదంత మాతఁడెఱుఁగును. విగనరీ నిక్కముగ సజ్జనుఁడు. రాబర్టును రక్షింపఁజాలుశక్తి ఆతని కున్నయెడల నిజముగ నాతఁడట్లు కావించియుండును."

"పాప మామిత్రుని కించుకంతైన తెల్వి లేదు—వట్టి మూర్ఖుఁడనుకొనెదను."

"ఏమనవలెను? ప్రాణమిత్రునిపై దురంతాపవాదము పడుటనాతఁ డెదుట నిలిచి కాంచెను! కాని ఏయొక్కమాట చెప్పినంతనే యిర్వుర

చిత్తములను వేధించు సంశయము లుత్పన్నమగునో దాని నాతఁడు వల్కలేదు!''

దేవి యభిప్రాయమేమో ఇంచుక గ్రహించి కంపితస్వరమున నాతఁడిట్లనెను. "ఉదయమే కచేరి కరుదెంచి విగనరీ చూచునరికి మందసము తెఱువఁబడి యుండెను. తోడనే యతఁడు శ్రీపతికిఁ గబురు పంపెను. అతఁడువచ్చి చూచి 'ఇది రాబర్టుపని'యని వాక్రుచ్చెను!"

"కాని విగనరీ నోటినుండి ఏమాటయు వెలువడలేదుగా?— ఈ పని రాబర్టు చేసినది కాదనియు, అంతకు మున్నొకమాఱు అపహరణ ప్రయత్నము జరిగియుండెననియు, మందసపు మరయందొక యువతి ఛిన్నహస్తము కానఁబడినదనియు, ఆనాఁడత్తఱి రాబర్టు అతిథిమందిరమం దుండెననియు ఆచౌర్య ప్రయత్నముతో వాని కించుకంతైన సంబంధము లేనితఱి, ద్వితీయ సంఘటనముతోఁ గూడ వానికెట్టి సంపర్కము లేదనియు నీమిత్రుఁడగు విగనరీ నోరు తెఱచి పలుకలేదు. ఈయుదంత మాతనినుండి శ్రీపతి వినియున్నయెడల, రాబర్టుపై నావృద్ధుఁ డిట్టిదుస్సహాపవాదము నాపాదించి యుండడు!"

"మాతుల ఒకమాటే యభిప్రాయముఁ జెందునో దానిని మరల్చుకొనఁజాలదు. అయినను జరిగినదంతయు తేఁట తెల్లముగఁ దెల్పిన బాగుండెడిది. కాని అప్పటి కంగారున వాని కేమనుటకు నోరాడలేదు!''

"అట్లూహింపకుఁడు. ఆక్రోశనభయమునను, తనపై దోషము పడునను వెరపునను అతఁడు మిన్నకుండెను."

"విగనరీ మిన్నకుండుట కుత్తరవాదిని నేను. ఈ విషయమును గోప్యముగ నుంచుమని నేనే అతనితోఁ జెప్పియుంటిని."

"ఇట్లుచెప్పి మిత్రులయ్యు మీరు రాబర్టున కెనలేని యహితము సల్పినారు. కాని యింత జరుగునని తాము కలనైనఁ దలఁపలేదు. విగ

నరీ ఒకమారు జరిగినది తెలిపివైచి యున్నయెడల సంగతులు వేఱు విధముగ మాఱియుండును—నిర్హేతుకముగ నాతని స్నేహితునిపై నీయపవాదు పడకుండెడిది. దుశ్చింతకుఁ జిత్తమున తావిచ్చియే అతఁ డుదాసీనుఁడై యుండెను. ఈర్ష్యకు వశుడై రాబర్టున కనిష్టము నాపాదింపఁదలఁచియే విగనరీ యీదుష్కృత్య మొనరించియుండెను!

“ఇట్లని యవలీలగ విశ్వసింపఁజాలము. ఇపుడైన జరిగినదం తయుఁ గొఱియధ్యక్షుని సమక్షమునఁ దెలిపివేయుమని ఆతనికిఁ జెప్పి నట్లయిన నందులకు సమ్మతింపకపోడు.”

“ఇఁకనైన జాగరూకులై యుండుఁడు. వేళమించినపిదప అట్టిప్ర యత్నము సలిపిన కార్యములేదు—రాబర్టున కెట్టి యుపకారము కలుగనేరదు. నాయుద్దేశము విగనరీ యెఱుఁగరాదు. వానికేమియుఁ దెలుపనని మీరు మాట యివ్వవలెను.”

“ఈ విషయమున నిశ్చింతతో నుండుడు. అతఁడు పెండ్లితలంపు లలో మునిఁగి యున్నాఁడు. ఇతరాలోచన యేమియు నిపుడాతని చిత్తమునఁ జొరఁజాలదు.”

“కర్నలు గృహమునఁ రాబర్టు బంధితుఁడై యుంట విగనరీ వినెనా!”

“కచేరీనుండి మరలుతఱి నేనుదొరయింటి కరిగితిని. కచేరీయందు రాబర్టునుగురించి విగనరీకిని నాకును ఇంచుక తీవ్రవాదము జరిగి యుండెను!”

“జరిగినదేమో జరిగిపోయెను. ఇఁక మీరాదొరయొక్క యావా సమున కరుగఁబోకుఁడు. హఠాత్తుగఁ గిన్కఁజెంది, యేమోమాటాడి తిరిగాని, యీవిషయముఁగూర్చి మీరు పెద్దగ యోచించుటలేదని దొరయనుకొనునట్లిఁకఁ దాము నడువవలయును. నేనుమరల మీకేమైనఁ దెలుపునందాక నీకార్యమందెట్టి జోక్యముఁ గలుగఁజేసి కొనకుఁడు.

రాబర్టు నీయాపదనుండి తప్పింపఁజాలువా రెవ్వరైననున్న నేనే ఆ సమర్థురాలనని గ్రహింపుఁడు.''

"ఈయనారోగ్యావస్థయందు మీరిట్టి మహత్కార్యమును బైన వేసికొనఁగలరా!"

"నాయాదేశానుసారముగ నన్యులు పనిచేయుదురు. రాబర్టు నిం దుండి మఱొక తావునకుఁ దప్పింప నివుడాదొర యత్నించుచుం డును. ఇవుడొకనిముసమైన గాలహరణ మొనరింపఁ జెల్లదు. మూఁడు దినములు గడచినవెనుక నీవిషయమునఁ గబురుఁ దెలిసికొనుఁడు."

"ఎట్లు తెలిసికొనఁ గలుగుదును?"

"నన్నుఁజూడ నరుదెంచిన నేను రోగపీడితనై యుంటినని ద్వార రక్షకుఁడు తెల్పుచో, నాపరిచారికను జూచిపోదునని చెప్పుఁడు. నాకుఁ జికిత్సజేయ డాక్టరద్దు నిలుచుచో, మీకీవఱలో నేనొసఁగిన ఉంగ్రమక నాతనికిఁ జూపుడు. పరిచారికను పిలిచినంతనే మిమ్మామె అవ్వలికిఁ గొంపోవును. వైద్యుఁడిచ్చటి కనుక్షణ మరుదెంచుట సంభవము. మీరిఱువు రిపు డొకరి నొకరు గలిసికొనుట నాయిష్టముకాదు.''

మేక్సిమంత దేవి శయ్యాపార్శ్వమున వ్రేలాడు పట్టుత్రాటినిఁ బట్టుకొని ఘంటారవ మొనరింప నుంకించుచుండ, నాకస్మికముగఁ బ్రక్కగదినుండి యార్తనాదము వినవచ్చెను! దేవి చకితయై తల్ప మున చివాలున లేచి కూర్చుండి పరిచారిక నప్పుడే పిలువకుఁడనెను.

"అదొక యాఁడుదాని యార్తధ్వనికాదా?''

"ఈగదియందొక సుందరి యున్నది. కాని ఆమెయే యేల ఆర్త రవ మొనరించెనో తెలియుటలేదు."

"భయమునననో, అబ్బురముననో ఎవరో అట్లు కెవ్వన కేకవైచిరి. మీరనిన ఆఁడుదియే అట్లొనరించియున్నయెడల మరల నివుడే అట్టి కేక వేయక మానదు!''

"ఆమె యీవలికి రావచ్చును. తలుపు తెఱచియే యున్నది."

"అట్లయి నే నిఁక సెలవు గైకొందును."

జవనికాంతరాళమందలి ప్రసాధనాగారము దిక్కుగఁ జూచి దేవి యిట్లనెను: "కొంత తాళి మఱిపొందు. మీకన్నులఁ బడకుండుటకై ఒకరయుణి యీగదియందుఁ దాఁగియుండెను. మీరు పోయి ఆమె నిచటికిఁ గొనిరండు. నే నామె వేఁడికోలును మన్నించుట లేదు.— నన్నామె మన్నించు గాక!"

మేక్సిము మెల్లఁగ నాప్రక్క గదిలోఁ బ్రవేశించి చూచెను.— కంపితకాయయై, వెలవెలబోవుచు జవ్వనియగు నెలిస్ అందు నిలువఁ బడియుండెను! యువకుని విస్మయమునకు మేరలేదు. నేఁ డిత్తఱి ఈస్థితియం దామె తన కన్నులఁబడునని ఆతఁడు కలనైన తలఁప లేదు. కుమారి యేయుద్దేశమున దేవి నిలయమున కరుదెంచెనో గ్రహించుట కాతనికి సమయము పట్టలేదు. స్మితముఖుఁడై యువకుఁ డిట్లనెను: "నీయార్తస్వరము విని దేవి మిగుల భయముజెందినది. అందుచే నామె నన్ను నీయొద్దకంపెను. కెవ్వన కేక వైచితి వేల! ఏమి జరిగెను?"

కంపిత కోమలస్వరమున నాబాల యిట్లనెను: "ఏమియు జరుగ లేదు. హఠాత్తుగ భయము వేసినది! నే నిఁక నొక క్షణమయిన నీగదియందు నిలువఁజాలను! అవ్వలికి నడువుము."

యువకుఁడు మఱఁదలిని దేవి పర్యంకపార్శ్వమునకుఁ గొంపోయెను. ఆమె స్థిరదృష్టిని గుమారి వదనముపైఁ బఱపి, ఈషచ్చంచలస్వరమున నామె యిట్లనెను,—"మన మిట్లు కలిసికొనిన విషయము రహస్యముగనే యుండవలెను. ఒకవేళ మన మిఁకఁ గలియఁ జాలకపోవచ్చును. మేక్సిముగారికన్ని సంగతులు తెలియును. అవసరమయిన యెడల అతఁడు మీకే యాలోచనయందైన తోడ్పడును.

రాబర్టు చిరకాలములో విడుదలఁ బడసి నిజకళంకమును మాఁపుకొనును. సెలవుఁగైకొనకమున్ను మిమ్ము నే వేఁడుకొనున దొకటి కలదు. నేఁడు మీ రిందేమేమి చూచితిరో,—ఏ మేమి వింటిరో, ఏ హేతువుచేనైన నెన్నఁడు, నెవరి కడను తెలుఁపకుఁడు."

"మీయభిప్రాయానుసార మాచరించెద"నని కుమారి మెల్లనఁ బలికెను.

మేక్సిము ఘంటారవ మొనరించినంతనే పరిచారిక యరుదెంచి వారి నవ్వలికిఁ గొంపోయెను. అరుగుచుండ దేవి వాని నుద్దేశించి యిట్లనెను. "నాకు తెలుపక ఏమాటను వెల్లడిసేయక, ఏమి గాని చేయక ఉండవలెను సుఁడీ! నే నొక్కతెనే అంతయుఁ గావింతును. నామీఁదనే భారమంతయు నుండును."

కుమారీ యువకు లిర్వురు కలిసి రాజవీధినుండి సాగి పోసాగిరి. ఉభయులు చాల సేపేమియుఁ బలుకక, నడువఁ జొచ్చిరి. కుమారి దరిఁజేరి మేక్సి మిట్లనెను "నన్ను నీవేల విశ్వసింపఁజాలవైతివి? దేవి కడకు నీవరుదెంతువని తెలిపినచో నొకతెవు భయమున రానక్కఱ లేక పోయెడిది కదా!"

"ఆమెను జూడవలెనని నిన్న రాత్రియే అనుకొంటిని. విశేషవ్యవధి లేవందున నీతో చెప్పుటకు వీలు చిక్కలేదు. నీకడ నన్నివిషయములు వినినంతనే దేవిని చూడవలెనను వాంఛ ప్రబలమైనది!"

కుమారి యనంతర మాతని నిట్లడిగెను.

"రాబర్టెం దుండెనో ఆమె యెఱుఁగునా?"

"అతఁడున్న స్థానమును నే నామెకుఁ దెల్పితిని."

"అతఁ డెందున్నాఁడు?"

"నీపిట్లు నేఁటి యుదయ మడిగియున్న యెడలఁ జెప్పి యుందును. రాబర్టు శుభముఁ గోరి ఆవిషయ మెవరి కడను వెల్లడిఁ గావింపనని

ప్రతిజ్ఞఁ గావించియున్నాను. దీనిని గురించియే వచ్చునప్పుడుకూడ దేవి మరల నాతోఁ జెప్పుట నీవును వినియున్నావు."

"ఆమె నన్ను గూడ నేమియు వెల్లడిచేయవలదని వారించెను."

"ఏమి వెల్లడి చేయవలదని?"

"ఇఁక నడుగుటేల?—ఆకాంతయొక్క సౌధమంతయు రహస్య పూర్ణమైయున్నది."

"నీవనుకొనినది నిజము. దానిని గుఱించి మన మేమియుఁ బ్రసంగింపవలదు; నీజనకుఁడును విగనరీయు నీవిషయమున నేమియు నెఱుఁగరు. రాబర్టిఁక కానరాడని నీతండ్రియొక్క దృఢవిశ్వాసము! నిశ్చింతచిత్తుఁడై విగనరీ కూడ ఆనందమహాహ్లాదధివీచికల నుఱ్ఱూఁత లూఁగుచున్నాఁడు. నీవాతని మిత్రునిఁ బ్రేమించితి వను సంగతియే అతఁడు పూర్తిగ విస్మృతించెను! ఈవిషయమును గుఱించి అతనికిఁ గాని, నీతండ్రికి గాని ఏమియుఁ దెలుపకుము. వారీసమయమున విలోకించు సుఖస్వప్నము ననారతము వీక్షింపఁజాలుదురా?"

"నేనును గుట్టుగ మెలఁగవలెననియే అనుకొనుచున్నాను. వివాహ విషయమున నామనస్సు తిరిగిపోయినది. ఇప్పుడు నేను పెండ్లి కావించుకొనను. ఇట్లని జనకునకు స్పష్టముగఁ దెలిపివేయుదును."

"విగనరీని నీవు చేపట్టనని చెప్పుచో, అతనిని, రాబర్టును గూడ గాక మఱొక్కరి నెవ్వరినైన వివాహమాడమని అతఁ డనవచ్చును."

"అట్లయిన నే నెవరినిఁ గూడ పరిణయమాడనని చెప్పుదును!"

"కుమారీ! నామాటవిని, యిపు డీవిషయమున నీవెట్టి యభిమతమును దెలుపకుము. అందుల కిది సమయము కాదు. కతిపయ దినములవఱకు నీతండ్రి కడ నేమాటయు నెత్తకుము. ఇంచుక సుస్థిగా నున్నందునఁ గొన్ని దినములు విశ్రాంతి యావశ్యమని చెప్పుము. ఇట్లొక వారము దినములు గడపిన పిదప రాబర్టును గుఱించి కర్త

వ్యమును స్థిర మొనరింపుము."

"నీవు కూడ అతని పక్షీయుఁడ వైతివా?" అని యావేగభర మున కుమారి యడిగెను.

"ఆగుణవంతునిగూర్చి మిథ్యాపవాదము ప్రచారమాయెను! దానిని విశ్వసించినందులకు నాయంతకు నేనే ఇప్పుడు మిక్కిలి యచ్చెరువొందు చున్నాను. దేవి చెప్పిన మాటలు వినిన దాది, విగనరీ యెడగల నాపూర్వానురాగము సన్నగిల్లుచున్నది.

"ఇపుడు నామనసునందలి మాట నీకడఁ దెలుప సంశయింపను. క్రోధక్షోభములచే నున్మాదినినై విగనరీని వివాహమాడుట కియ్య కొంటిని. ఇపుడు నాచిత్తము పూర్తిగ మాఱిపోయినది. ప్రాణము పోనున్నను సరియే నే నాతని కేలు పట్టఁజాలను! ఇనుమంతైన బుద్ధి గలవాఁడగుచో, స్వార్థకాంక్షవీఁడి,—అర్థాపేక్షఁ బాసి, నాపై నాస విడిచి అతఁడు మనసు మరల్చుకొనును!"

"మంచిదిపు డావిషయమటుంచుము—నే నిఁకఁ బోదును. దేవి యనుమతిఁ బడసినంతనే నే నెఱిఁగిన రహస్యోదంతమునంతయు నీకుఁ దేటతెల్లముగఁ దెలిపివేయుదును."

"సరియే. అపుడు నేనామె భవనమునఁ గాంచిన భయదచిత్రముఁ గూడ నీకుఁ దెల్పఁ జాలుదు ననుకొనెదను."

౧౧

తన నిలయమున కరుదెంచి మేక్సిము భయముచూపిన నాఁటినుండి కర్నలు కడునుత్కంఠితుఁడై పోయెను! కాని యనంతర మాయువకుఁడట్టి తీవ్రతను జూపనుంకింపక మిన్నకుంటఁగాంచి, యించుక నిశ్చింతుఁడై యుండెను. కాని రాబర్టు విషయమున నేమిచేయ వలయునను విషయమును నిశ్చయమొనరింప నూహించి, తన ప్రధానపరిచారకుని సలహాననుసరింప నెంచెను.

రాబర్టును విడిచిపుచ్చుటకు మున్ను కోఠీయుద్యోగుల చారిత్రములనుగుఱించి విశదముగ వానినడిగి తెలిసికొన్నయెడలఁ దన పత్రముల పెట్టెనిగురించిన యుదంతమేమైన నెఱుఁగవచ్చునని తలంచి, నాఁటికి మిన్నకుండి, అశ్వము నధిరోహించి అతఁడవ్వలి కరిగెను. బాహిరమున కరుగగనే అతనిహృదయమున రేకెత్తియున్న ఉద్వేగమంతయు దూరీకృతమై పోయెను! మామూలుగనే అపరాహ్ణమున క్లబ్బునకుఁ జని నెయ్యులఁగూడి అతఁడెప్పటియట్లు ద్యూతమాడఁ దొడఁగెను. అతఁడు మొదటియాట యందుగెలుపొంది యిఁకఁబోవుటకు దుస్తులు సర్దుకొనుచుండ నింతలో నెవఁడో అతనిమ్రోల కరుదెంచి చేతికొక చీటి యందించెను. ఎంతసేపు చూచినను అందున్న పేరెవరిదో అతఁడు గుఱుతింపఁజాలక పోయెను. కాని ఆచిన్ని యుత్తరమందొక వంక స్వీయదేశ రహస్యచారుల సాంకేతిక చిహ్నముండుట విలోకించి, ఆలసింపక ఆగంతుకునిఁజూడ అతఁడవ్వలి కరిగెను. దాఁపువగల యొక గదియం దాగంతుకుఁడు దొరకొఱకై వేచియుండెను. అతఁడు యువకుఁడు! సుందరుఁడు . శుభ్రాంబరధారి. కర్నలునుగాంచి రష్యాభాష యందాతఁడు సంబోధించెను. లేఖయందలి సాంకేతికపదమును

జూచియు ఆగంతుకుని గాంచియు అతఁడు తన దేశమునుండి వచ్చిన యొకరక్షకసైనికోద్యోగియని అతఁడు గ్రహించెను.

ఆగంతుకుఁడు—అయ్యా! ఈతావు మనపెట్టి ప్రసంగము సలుపుకొనుటకు ననువుగ లేదు. మీతోనేఁ జెప్పవలసిన సంగతు లెన్నో కలవు. మన మేదేనివిశ్రామ మందిరమున కరిగి ఆహారముఁ గొని యిష్టాగోష్ఠి సలుపుకొందము.

"మంచిదట్లే పోదము."

"ఏదేని హెూటలు దిక్కుగ దారిఁబట్టుఁడు. మూఁడుదినము లొక్కవరుసగ రైలునందుంటిని! ఆకలి దుస్సహముగ నున్నది."

ప్రసంగించుకొనుచు నిర్వురు రాజపథమునఁ బ్రవేశించిరి. మార్గము జనశూన్యమై యుండెను. నడచుచుండ నాగంతకుఁ డిట్లనెను. "మీరు నన్ను గుర్తింపఁజాలకుండు టచ్చెరువుకాదు. సెంటుపీటర్సు బర్గునందు సేనాపతినిగలిసి మీ రుద్యోగము చేయుచున్నపుడు నేను పోలండునం దుంటిని. మీరు విదేశమున కరుదెంచినంతనే నేను సెంటుపీటర్సు బర్గునకు వచ్చితిని. మీరు నాసుహృద్వర్గులని యెంచియే నాయుద్యోగ నిదర్శనముసు మీకింకను జూపలేదు. ఎపుడుచూపినను చూపవచ్చును. ఇపుడు సంకేతశబ్దము వినుఁడు" అని యాతఁడు దొర చెవిలో మెల్లఁగ నేమియో పలికెను.

"తెలుపవలసిన అక్కఱలేదు.—తా మేదేని ముఖ్యకార్యమున విచ్చేసిరా?"

"సిక్కముగ నొక ముఖ్యకార్యము మీఁదనే అరుదెంచితిని. పేరిసు నగరమునకు వచ్చుటకు వలయుసన్నాహము సలుపుకొనుటకు సేనాధిపతి నాకు రెండుగంటలకంటె నధిక సమయ మొసఁగలేదు."

"కార్యమేమి?"

"అది మిమ్మును గూర్చినదియే.—జడియకుఁడు. ఏవదంతియైనను

మన ప్రధాన కార్యాలయమున నెట్లు పరీక్షింపఁ బడునో మీ రెఱుఁగి నదే. మీకుఁ బ్రతికూలముగ సేనాధిపతి ప్రోలనొక యభియోగము కావింపఁబడెను."

"అయ్యో! అదెట్టి యభియోగము?"

"కర్తవ్యమునెడ నిర్లక్ష్యము చూపుటయే మీపైఁబడిన నేరము! కడుంగడు ముఖ్యములగు కొన్ని పత్రముల నొక పెట్టియందుంచి దాని నొక కోశాధిపతికడ నుంచితిరట కాదా?"

"అట్లు భద్రముగ నుండుననియుంచితిని. రష్యావిలాసినులును నాపై నెట్టిదృష్టి నిక్షేపించియున్నారో ఎఱుఁగుదురుకదా? తక్కుంగల వారి మాట యటుండ, నింట బనిచేయువారిని సహితము నమ్ముటకు వలను గాకున్నది."

"పెట్టె విలాసినుల చేతులఁబడెనఁట కాదా?"

"ఈ సంగతి అధికారులకుఁ దెలుపక నేననుచిత మొనరించితిని. అట్లేల గావించితినో మీకు నివేదించెదను. ఈ సంగతి పైకెట్లు వచ్చెనో తెలుపుదురా?"

"మీ రూహింపఁజాలక పోయినారా? ఇంటఁ దిన్నవాఁడే యింటివాసములు లెక్కబెట్టును! దినములు చాలనపు డింటి రోకలి మొసలియై ముసలము తెచ్చును! అంటిన వస్తు వగ్నిగమ్యమును!— మీ భృత్యులలో పరిధానుని విస్మృతించినారా?"

"ఏమి! ఇది నా ప్రధానపరిచారకుని పనియా? ఆహా! ఎంతటి దుర్మార్గుఁడు!"

"అతఁడేమి చేయును. అతనికి అధికారులొసగిన రహస్యాదేశ మది. ఒకరిపై నొకరు కన్నువైచియుండవలయునను విధానము రష్యా రక్షకపతుల చిరంతన పద్ధతియే. అందుచే నించుక యోచించిన పరి చారకుని యపరాధ మేమియుఁ గాన్పింపదు. అతఁడు పై యధికా

తుల యాజ్ఞ ననుసరించి యట్లాచరించెను.”

“ఇందులకు ప్రతీకారము కావింపవలయును. ఆ దురాత్ముఁడు నా కరిష్టము నాపాదించునని భయమందుచునే యున్నాను. పెట్టిపోవుట మాత్రము చెప్పి అతఁ డూరకుండలేదని తలంతును.”

“పత్రమునననుసంధాన మొనరించు ప్రయత్నమున మీరు పెర తెఱఁగులబట్టితిరనికూడ అతఁడు వచించెను.”

“చోరులకుఁ దోడామెనని నే నొక యువకునిఁబట్టి బంధించితిని. ఈ విషయమునుగూడ అతఁడు చెప్పియుండును.

“చెప్పుటలో నతఁ డేమియు మిగుల్పలేదు. మీ యకార్యమంతయు నధికారులకుఁ దెల్లమయినది. అందుచే మిమ్ము వారు మిక్కుటముగ దూషించుచున్నారు.”

“యువకునినుండి యేయుదంతము నెఱుఁగఁజాలక అతనిని సైబీరియా కంప నేను నిశ్చయించుట నిక్కమే కాని యిప్పు డా సంకల్పము వదలుకొంటిని. ఇప్పుడు వానిని మెల్లగ నావలికి దాటింపగల యుపాయ మేమైనఁ దెలిపితిరేని తాము నాకెనలేని యుపకారము చేసినవారగుదురు. విడుదల యొసఁగినయెడల నెట్టి కల్లోలము బుట్టింపనని ముందుగ వానిచే వాగ్దానము చేయించుకొను టుచితమని ద్రోహియయిన ఆ పరిచారకుఁడే నలహా చెప్పెను.”

“ఆపద్ధతి సమంజసముగనే యున్నది. భోజన సమయమున నీ విషయమై ప్రసంగించుకొందము. భోజనానంతర మొకమాఱు నాటకాలయమునకుఁబోవుదమా?”

“కార్య సమయమందుఁగూడ తాము చిత్తమును వినోదముల దిక్కునకు మరల్పఁజాలుదురే!”

“కార్యమునకును వినోదములకును సంబంధమున్న ట్లొకింత సేవు తడసినయెడల మీకే బోధపడును. వేగమె హోటలునకు నడువుడు.

ఆఁకలి అధికమగుచున్నది."

వివిధపానీయములతోఁగూడఁ గడుపాఱ విందారగించిన పిదప ఆ గంతకుఁ డిట్లనెను. "మీ ప్రధాన పరిచారకుని పక్షమవలంబించి మిమ్ము పదచ్యుతుఁ గావింప నరుదెంచితినని మీ రూహించుచుండ వచ్చును. అట్లెన్నటికిని దలంపకుడు. మన మిద్దరము కలిసి ప్రస్తుతోచితమేమో కావించుదము. వస్త్రము లపహరింపఁబడినను వానిని మనము మరలఁబడయఁజాలమని తలంపఁదగదు. కుట్రపన్నిన కూళలఁ బట్టవలెనుగాని క్రింది వారినిఁబట్టి బంధించిన నేమి ప్రయోజనము!"

"క్రిందివారినిబట్టి బంధించి పదంపడి కుట్రపన్నిన కూళలనుబట్టఁ దలఁచితిని. రాబర్టున కీయపహరణకృత్యమునఁ జేయి యున్నచో అతఁ డేసుందరి కుహనామోహశృంఖలమునైనఁ జిక్కియుండును! ఆ సుందరి సామాన్యాంగనయై యుండదు!! ఉన్నత సంఘమునకుఁ జెందిన ధన గౌరవ సమన్వితయైనదిగానుండి యుండును!!!"

"మీరు వచించినది నిజమేయైనఁ గావచ్చును. కాని ఆ రమణి యెవతియో మీ రెఱుఁగరు. కొందఱు రహస్యాంగనల వెన్నంటి తిరుగుచు మీరు వృథాగా వేసారుచున్నారు! ప్రాన్సుదేశస్థురాలే యొకతె పాపిష్ఠి విలాసినులకు నాయికయై, ఈ దుర్దాంతకృత్యమునకు కారకురాలయినది! నేడు నాటకాలయమున మన మా మహిళను గాంచఁ గలుగుదుము!"

ఇట్లు ప్రసంగించుకొనుచు చౌర్యమొనర్చిన స్త్రీని బట్టుటకు పెక్కు వెఱవులను రోయుచు నుభయులు హోటలునుండి వెలువడి చాలదవ్వు నాటకమందిరము దిక్కుగఁజనిరి. రాజపథమున నడచుచు దొరయిట్లనెను. "హోటలును దాటి మనము చాలదూరము వచ్చితిమి. నాటకశాల యనతిదూరమందే యున్నది"

"నే నా స్త్రీయొక్క యాసనమునకు సమీపమునందే యుండు రెండు

ఆసనముల టిక్కెట్టులను ముందే కొనియున్నాను.

"ముందే వలయు నేర్పాటుం గావించితిరే! ఒకవేళ నన్నుఁగలిసి కొనకున్న యెడల మీ రేమి చేసియుందురు?"

"నే నొక్కఁడనే నాటకమున కరిగియుందును. ఏమేమి జరిగినది పదఁపడి మీకుఁ దెల్పియుందును. మీరు క్లబ్బుకుఁ జనిరని వినియుంటినిగాన తిన్నఁగ నచటి కరుదెంచితిని—ఇటీవల నించుక మనఃక్లేశము కలిగినను మీరీ తావున సుఖముగనే యున్నారు. అల్లదే యటఁ గాన్పించు నా యున్నతభవనమందే కదా మీ బందీ బంధింపఁబడి యుండెను?"

"అవును. అతఁడు నిరపాయకరమగు స్థానమందే బంధింపఁబడి యున్నాడు. సౌధము చాలపెద్దది. నలువంకల విశాలప్రాంగణమున్నది. సెంట్‌పీటర్సు బర్గున నేదుర్గమందైన నుంచిన నెంతభద్రముగ నుండునో యిందుగూడ నట్లుండును."

"నమ్మి, పరిచారకుల కందఱికి నీ రహస్యోదంత మంతయు మీరు చెప్పియుందురు?"

"అవును. వీరందఱు పురాతన సైనికులు. రహస్యాధారతనము వారి యధీనమున రహస్యరక్షక భటులుగ పెద్దకాలము పనిచేసియున్నారు. విశేషవాక్య వ్యయమక్కఱలేకుండగ నెట్టి యాదేశము నైన నెరవేర్చుట వీరి యభ్యాసము. ఇపుడు బంధింపఁబడిన పేరిసు వాసిని మడియింపఁదలఁచితిమేని సంజ్ఞామాత్రమున నీ పరిచారకుల వలన నిముసములో నతడు మృత్యువు పాలికిఁ జనఁగలడు!"

"మీ కట్టి యుద్దేశము కలుగలేదను కొనెదను. బంధించి మాత్ర మే సంతృప్తులైతిరిగదా?"

"అవును. ఎట్టులయిన నవ్వలికి దాఁటిపోఁజాలకుండున ట్లాతని బంధించి వేసితిమి. పైవారెవరి కన్నులబడకుండు నట్లాతఁడు గోడల

నడుమ గుప్తపరుపఁబడెను. ఈ చోటున సిరుగుపొరుగునఁ గూడ నెవరును లేరు"

రాజపథమునుండి మరలి వారిరువురు నాటకశాలయందుఁ బ్రవేశించిరి. వెన్కనననతి దూరమునుండి నడచివచ్చు మేక్సిము వారిజాడను కనుపెట్టి కర్నలుతో నున్నవాని గుఱుతుపట్టి అతఁడు విశ్వాసఘాతుకుఁడని ఇయుల్టా దేవికిఁ దెలుపవలెనని నిశ్చయించిఁ దాఁగూడ నాటకమందిరముఁ జొచ్చెను. బొరిమఫ్ మొరాటిన్‌లు నిర్దిష్టాసనములఁ గూర్చుండియుండిరి. మేక్సిము కూర్చుండక మార్గమున నిలువఁబడి ఆగంతువు లిర్వురచేష్టలను పరిశీలింపఁదొడఁగెను. తనపై నాతఁడట్లప్రమత్తుఁడై కన్నువేసి యుండుట వారిర్వురు నుపలక్షింపలేదు. ఆసనముల నన్నిఁటి నా యాగంతువులు తేఱి చూడసాగిరి. మొరాటిన్ దాపున బాగుగఁ బరిశీలించి—"ఆ స్త్రీ యింకను రాలేదు" అనెను.

"ఆమె వచ్చునని మీరు నిశ్చయముగఁ జెప్పఁగలరా?—"

"నిశ్చయముగ నెట్లు చెప్పఁగలుగుదును?—స్త్రీచరిత్రమును గ్రహింపఁజాలు టసాధ్యము. ఆ విషయ మటుండ, నామెవంటి స్త్రీలను గుఱించి చెప్పుట కష్టము."

"ఇదె! ఈ వైపుననుండి ఒకసుందరి వచ్చుచున్నది."

"ఓ! అవును! ఆ స్త్రీయే!—వేయిమంది నడుమనున్నను నేనా సుందరిని బాగుగ గుర్తింపఁగలను. అట్టి యాకర్ణాంతనేత్రములు మఱొక కాంతకుండవు."

"చూడుఁడు! చూడుఁడు!!—విద్యుత్కాంతులలో నారమణి మో మెట్లు వెలుఁగుచున్నదో!—ఆహా! ఏమిసౌందర్యము! ఏమి సౌష్ఠవము!"

ఆ రమణివచ్చి వారిసమ్ముఖమునగల ఒకయాసనముపైఁ గూర్చుం

డెను. ప్రేక్షకుల దృక్కులొక్క మాతాకాంత దిక్కుగ మరలెను! ఇంచుక బరీక్షించి మేక్సి మాయువతిని గుర్తించెను! విస్మయపరీత చేతస్కుఁడై అతఁడిట్లు వితర్కింపఁ దొడఁగెను—“ఇదేమి! సార్జంటు దొరసాని యిచటి కరుదెంచెను! ఎట్టి సాహసురాలు! ఆ నాఁడు నాకడ నట్టిమాయనుచూపి చనిన యీ యామె బిడియముగాని భీతిగాని లేక యిచటి కెట్లు కుదెంచెనో! ఈమె పేరిను విడిచి యెందేని చనెనని నేఁదలఁచితిని. కూడనుండు వికారాంగు నీమె స్వీయదేశమున విడిచి వచ్చి, అట్టివాని నింకొక్కరుని మరలఁ బడయ యత్నించుచుండ వచ్చును! కాని నేఁడీయూఁడుదాని విడువను. నా మాతుల మందసము నుండి పత్రముల దొంగిలించిన దెవరో యీ యామెకడనుండి ఎఱిఁగి తీర వలయును. బొరిసఫ్ యేమి కావించినఁ గావించుగాక! వాని చెయ్దిముసకుఁ దగు ప్రతీకారము దేవి కావింపఁగలదు. ఇవుడీ సుందరిని విడిచివైచిన యెడల నీమె నిక పట్టఁజాలు టసాధ్యము. ఇవుడే సుందరి దాపుననున్న ఆసనముఁజేరి సంగతులన్నియు నడిగి చూతును”

నాటక ప్రథమాంకము ముగిసెను. ద్వితీయాంక ప్రదర్శన మారంభమగుటకుఁ గొలఁది నిముసములు మాత్రము వ్యవధియున్నది. సుందరిని గలిసికొనుట కిదియే తగినయదనని మరల నాతఁడాకాంత దిక్కుగదృష్టిఁ బఱపెను. మిత్రుని సహితముగ బొరిసఫ్ కూరుచున్న తావునుండి లేవ నుద్యమించుచుండెను. వారివంకఁ దిరిగి సుందరిమధుర మంజుల మందహాసము సల్పుచుండెను! దృశ్యమంతయు కను నబ్బురముగఁ గన్పట్టుచుండెను. బొరిసఫ్ మొరాటిన్‌లు తలలు వంచి ‘రారమ్మ’ పిలచుచుండిరి. ఆయాహ్వాన మెందులకో మేక్సి మునకు బోధపడలేదు. యోచించిన కొలఁది అతని కాశ్చర్యము హెచ్చు కాఁదొడగెను. చోరుల సహకారిణియు, అపహృతద్రవ్యమున కధికారియు ఇయల్టాదేవి, తరవారి శిక్షకుఁడును,—యీ మూవుర

కిట్టి విచిత్ర మైత్రి యెట్లు సాధ్యమాయె? వారి చర్యయంతయుఁ జూచుచు యువకుఁడు విముగ్ధుఁడై విభ్రాంతుఁడై పోవుచున్నాఁడు. దేవినిగురించికూడ వాని చిత్తమున పెక్కు సందియము లుదయింప నాతఁ డిట్లు వితర్కింపఁ దొడఁగెను. "ఇయల్టా దేవికి అనేక యద్భుత వార్తలు తెలియుచుండవచ్చును! కుట్రలు నల్పుటం దామె యాతి తేఱియుండును! ఆ రెండవయాతఁడు—దేవి యత్రశిక్షకుఁ డీ దొర ననుసరించి యరుదెంచనేల? దేవియెడ నాతఁడు విశ్వాసఘాతుకము చూపుచుండెనా?—ఒకవేళ ఇయల్టా తన్ను వంచించుచుండవచ్చును! —ఏమయినను గానిమ్ము, ఈకుట్రను చాలమట్టుకుఁ జూచియుంటిని. ఈమాఱు చోరుల జాలమును దుత్తునియలు గావించివేయుదును. నే నెవరికిని జడియువాఁడను గాను. ఆమె యొనర్చుదానిని గుఱించి సుందరిని గ్రుచ్చి గ్రుచ్చి యడుగుటకు నాకు సంపూర్ణాధికారము కలదు!"

యువకుఁ డెంతయో కావింప సంకల్పించుకొనెను. కాని సంకల్ప మొకటి—కార్యము వేఱొకటి. విద్యుద్దీపకాలములలో వెలిఁగిపోవు నాట్యశాలయందు పల్వురు దర్శకుల సమ్ముఖమున సామాన్యులు కాని యిర్వురు వ్యక్తులపార్శ్వమున నుపవిష్టయైయున్న లావణ్యమయి దాపుసేరుట సులభముకాదు. అందఱిలో నట్లు చేర యత్నించిన అల్లరి కాఁగలదు! అందుచే మేక్సిము ముందునకు సాగ సాహసింపక నిలిచిన తావునందే నిలిచి క్రోధముచే నొడలువడఁక మూావుర చేష్టలు పరీక్షింపసాగెను! హాసచంద్రికల నలువలకులఁ బఱపుచు సుందరి ప్రసంగించుచుండెను. ఇందీవరములఁబోలు నామె నయన యుగళమున గభీరభావమయదృష్టి యుజ్వలమయి యుండెను! కటాక్షము సుఖస్వప్నగర్భితమై, మోహాసృష్టిఁ గావించుచుండెను! కోమల కరపల్లవములచే దొర మిత్రుని చేదోయిఁ బట్టుకొని సుందరి

యిట్లనెను. "మిత్రమా! నేఁడు మీదర్శనము లభించినందులకు నేనెంత యానందించుచుంటినో మీ రెఱుఁగరు. వేఱు ప్రదేశమున కేగి నే నీనాఁడే మరలివచ్చితిని. ఇంతదనుక పరిచితమయిన మొగ మొకటి యయినఁ గానఁబడలేదు. తాము నన్ను చూచినంతనే గుర్తుపట్టగలిగి నందులకు అచ్చెరువు నొందుచున్నాను."

"మిమ్మొకపర్యాయము చూచిన మఱువఁజాలు రెట్లు?"

"ఆఱునెలలు చూడనివారిని పలువురు మఱతురు. దానికేమి— ఇపుడు మీ మిత్రునితో నాకుఁ బరిచయముఁ గూర్తురా?"

"బొరిసఫ్‌దొర మా స్వదేశీయుఁడు—మిత్రమా! ఈమె నామధేయము గార్చెను దొరసాని. నన్నీమె బాగుగ నెఱుఁగును."

అపుడు మువ్వురు తమ నవ్వులను పరిహాసములను కబురులను సాగనీయదొడఁగిరి! కాని బొరిసఫ్‌దొర మనసు మాఱిపోయెను. ఈ వేడుకయంతయు నాతనికి అబ్బురముగను అసహ్యముగను నుండెను. హఠాత్తుగ నొక క్రొత్తమానిసి సమాగమమును, పదంపడి మాటల ప్రోవును, హాసనప్రియయు, బింబోష్ఠియు, నగు నొక సుందరితోడి ప్రసంగమును అతనికి మిక్కిలి వింతగఁ గన్పట్టెను! ఏమనుటకు నేమి చేయుటకు వానికిఁ దోఁపలేదు. సుందరి మోహగర్భితహృదయాకర్షక దృక్కులు మాటి మాటి కాతనిఁ దారుకొనుచుండెను!

ఈమాటయు నామాటయుఁ జెప్పి సుందరి "నా యీజీవన మెట్లున్నది" అని ప్రశ్నించెను.

మొరాటిన్—మిగుల నానందమయముగ నున్నది. నిక్కముగ మీది యథేచ్ఛజీవనము!"

స్థిరదృష్టి బొరిసఫ్ దొరపైఁ బరపి కాంత "మీ మిత్రుని యభిప్రాయ మేమయియుండు?" నని నెయ్యు నుద్దేశించి పలికెను.

ఇఁక నూరకుండుట వలనుగాదని దొర యిట్లనెను. "మిత్రుని

యభిప్రాయమే నా యభిప్రాయము. కేవల సుఖానుభవమే జీవనోద్దేశము !

"నిక్కమేనా ? మీరారామోహము నభిలషింపరని నేను యోచించితిని. ఏదేని రహస్యకార్యము మీఁద రహస్యాధికారతనము వారివలన మీరు నియుక్తులయితిరని భావించుచున్నాను. దాఁపనేల—ఇట్లనియే సేనాపతి నాకుఁ దెలిపెను! ఏమేమో చెప్పి అతఁడు నాకు విసుగుఁ దెచ్చెను !"

"నా విషయమయి అతఁడు మీతో నేమేమి చెప్పినది మీకుజ్ఞాపకమున్నదను కొనెదను."

"జ్ఞాపక మెందుల కుండదు ?—మేముండు నెలవున కనతిదూరమునసే మీరున్నట్లాతఁడు తెలిపెను. దవ్వననున్న పేటయందే నాకాపురము !"

"ఏమి ! అట్లా ! నేనెచట వసించుచుంటినో మీరెఱుఁగుదురా?"

"ఎఱుఁగుదును. ఈవరలో మిమ్ము నేననేకమారులు చూచియుంటిని. కుతూహలముతో మిమ్ముగురించి సేనాధిపతి నడుగ నాతఁడు తాము ధనాఢ్యులయిన భద్రపురుషులని వచించెను."

"నాపై నాతనికి దయమెండు."

"కావచ్చును. తాము రక్షకభట శాఖయందుఁ బనిచేయుచుందురని ఆతఁడనెను."

ఈ నుడువు విని దొర యించుక చిన్నబోయి "పరిహాసముగ నాతఁడట్లని యుండును" అనెను.

మొరాటిన్—మంచి పరిహాసమే! నేనొక రహస్య పరిశోధకుఁడనని కూడ చెప్పియుండలేదు గదా !

"లేదు. దొరమాట మాత్రమే అతఁడు చెప్పెను. ఆతఁ డేయుద్దేశమున నిచటికి వచ్చెనో కూడఁ దెలిపెను."

వెడగు నగవునవ్వి దొరయిట్లనెను. ‹‹అట్లయిన నాయాగమనము నకొక యుద్దేశముండెనా ?—విని సంతసించుచున్నాను. ఈ ప్రశంస నాకు మిక్కిలి గౌరవాస్పదమైనదే!''

‹‹విలాసినులపై దృష్టి వేసి యుండుటకు మీరంపఁబడినట్లు వింటిని.''

‹‹అట్లయిన నా యవస్థ మిగుల శోచనీయమయినదే. ఏలనన విలాసినులిపుడు కేవలము విలాసామోదములందే తేలియాడక పెక్కు దురంతకృత్యములను నల్పుచున్నారు''

"రష్యాయందు వారు నానాకార్యములను సల్పుచుందురు. పేరిసునందెట్లు మసలుచుండిరో చెప్పఁజాలము. అయినను వారిపైనొక కన్ను వైచి మెలఁగుట మీకర్తవ్యము. సేనాధిపతి నాతోనిట్లే చెప్పియున్నాఁడు."

మొరార్టీ—ఇట్లని నా కతఁడు ముందే తెలిపిన బాగుండెడిది కదా! నేగూడ వీరికిఁ దోడుపడి యుందును.

"నానుడువులను మీరు విశ్వసించుట లేదు కాబోలు!"

"బొరిషఫ్ దొర పేరిసునందు చాలపని నలుపుచుండెను చేతినిండ వానికి వలయునంత విత్తమున్నది కదా! రూపరంగిణులం దాఁటి తేఁటిన జాణలను వెతకుటయెకదా ఆతని ప్రధానకార్యము!"

"ఈ ప్రధాన కార్యము ప్రశంసనీయమయినదే!—కాని దీని యందు వారికిగల యభిరుచి మాటలవలెనే తెల్లము కావలెను."

"నాయభిరుచిని గుఱించి నేను వేఱుగఁ జెప్పుకొనవలయునా?"

"మీ యభిప్రాయము గ్రహించి మిగుల నానందించితిని. కతిపయ దినములు నే నీనగరమందే యుందును. ఇందుండు నన్నినాళ్ళు మీతో ప్రమోదముగఁ గాలముఁ బుచ్చఁగలుగుదు ననుకొనెదను."

సుందరి పలుకులు వినినంతనే మిత్రులిద్దరు పొంగిపోయిరి. బొరిషఫ్ దొర సుఖస్వప్నమును విలోకింపఁ దొడఁగెను! మోహిని కీడగు

నాసుందరిని హస్తగత మొనరించుకొనిన యెడలఁదాను కృతకృత్యుఁడు కాఁజాలునని దొర యోజించెను.

సుందరి—మిత్రమా! నేనిపు డేమితలచు చున్నానో యెఱుఁగుదురా?

దొర—ఎఱుఁగను కాని నేను మీవిషయమున నేమి భావించు చున్నానో దాని నెఱుఁగుదును!

"నాటక చతుర్థాంక మందలి విచిత్ర దృశ్యములను గుఱించి నేను యోచించుచున్నాను. మానవజీవనము లందిట్టి సంఘటనములు ఘటించును!"

మొరాటిన్—నాటకములం దించుక మహత్త్వము చూపట్టుచుండును. మనుష్య ప్రకృతులు, ప్రవృత్తులు పూర్తిగ మాఱిన ఈనాఁడట్టి వానికంతగ తావులేదు.

"మానవుల చిత్తవృత్తి యందెట్టి పరివర్తనము కలిగినదని నేఁదలఁపను. ప్రేమతోఁబాటు రాజనీతి కించుక చోటున్నయెడల, నిట్టి వియోగాంత నాటక మొకటి అవలీలగ రచింపఁ బడవచ్చును. మీ దొరతనమువారికి విరోధినియైన విలాసిని యొకర్తుక రాజాధీన మందలి ఒక యుద్యోగిని ప్రేమించె ననుకొనుఁడు. రాజునకు విరోధినియగు నావధూటి రాజప్రాసాదమున కకస్మాత్తుగఁ జిచ్చుముట్టింప గుట్రపన్నెనని యోచింపుఁడు. షడ్యంత్ర విషయ మెఱుఁగని ఆయుద్యోగి ఉద్యోగ కర్తవ్య నిర్వహణార్థము రాజభవనమునకుఁ జనను ద్యమించుచుండ మనోహరుని గమనము నామెనిరోధింప యత్నింప, అందులకు హేతువాతఁ డఱయుదొఱకొనె ననుకొనుఁడు. అపుడామె ఏమొనర్చును?—వలపుగానిని మృత్యుముఖమునఁ బడవైచునా లేకఁ దాఁబన్నినకుట్ర నాతనికిఁ దెలిపివేయునా? ప్రణయము నిల్చునా? కఠోర రాజనీతి నిల్చునా?"

దొర—రష్యారాజ ద్రోహులగు విలాసినులను గూర్చి మీరు కావ్యమాధుర్యముతో వివరించుచున్నా రంతియే. వారి ప్రవృత్తులను నేను బాగుగ నెఱుఁగుదును. వారి ప్రతిజ్ఞ కఠోరము—సాహసము అద్భుతము—తమ వ్రతపాలనార్థ మేన్నేని దుష్క్రియలు సలుప వారు వెనుఁదీయరు. వారు చేయరానిపను లేమియు లేవు.

మొరాటిన్—ఈ ప్రసంగ మిఁక విరమింపుడు. మావంటి యిరువురు వీరపురుషులు మీయింటివరకువచ్చి మీ యావాసమున మిమ్ము విడువఁగోరుట మీ క్షేమయిన అభ్యంతరమా?

"దీనిభావము మీరు మానిలయమునకు రానపేక్షించు చుంటిరని కాదా?"

"మీరు నిజము గ్రహించితిరి. మేము సంతోషముతో కాలముఁ బుచ్చ నువ్విళు లూరుచున్నాము.—మీయుద్దేశ మేమి?"

"నే డిచటను నృత్యసభలు లేవు."

దొర—ముష్వురము కలిసి భుజించు టానందకరము—విందారగింప మాసదనమున కరుదెంతురా!

"నిజగృహమున తప్ప మఱొకరి యింట భోజన మొనరించు నలవాటు నాకు లేదు."

"మీకిందు నిజాలయమున్నదా?"

"ఉన్నది. అది మీనివసతికనతిదూరమందే యున్నదని చెప్పితిని గదా. నేనం దొక్కతెనె వసించుచున్నాను. మీనిలయమునఁ గాక మానిలయమునకే విందారగింప రండు."

మొరాటిన్—మీయాతిథ్యము మాకెంతయు నాహ్లాదకరమై యుండును.

సుందరి తన గృహమునకే యరుదెంచిన బాగుండునని యోచించుచు దొర యూరకుండెను.

సుందరి—నాయాతిథ్యము కర్నలుగారికి సమ్మతము కాదు కాబోలు?

"అట్లనఁ బోకుఁడు. మీయాతిథ్యము నాకత్యంత ప్రియము. మీతోఁ గలిసి మీయింట విందారగించుట కంటె నాకుఁ గావలయున దేమి?"

"మీకు లాతివారగు విలాసినులపై దృష్టి పఱచుచు అన్యథాసియుక్తులగుదురని నేఁ దలచితిని."

"ఇట్టి సుఖదినమున వారి యాలోచన మన కెందులకు"?

"అట్టి విలాసినులలో నే నొకతెను గానను నిశ్చయమేమి? వారి యందొకతెకును నాకును బరిచయమున్నట్లు మీకుఁ జెప్పఁదలచి యున్నాను. ఆమె సహకారుల మంగళామంగళవిషయమును యోచించుచుంటిని. ఒకయడుగుముందునకు వైచిన యెడల నేఁ గూడ వారిలో నొకతెను గాఁగలుగుదును!"

మొరాటిన్—ఈ సాయంసమయమున మీసౌధమున కరుదెంచిన యెడలఁ గుట్రదారులగు కొందఱు బందిపోటుల చేతులఁ జిక్కుకొందుమా! మీనుడువులం దిట్టి గూఢార్థమున్నట్లు తోఁచుచున్నది.

నవ్వుచు సుందరి "విద్రోహినులగు విలాసినులు చేయరాని పనులుండవని దొర తెలిపియుండలేదా?" యనెను.

దొర—విందారగింప నరుదెంచుచుండ మాకు విద్రోహినుల యడలేల? ప్రపంచమందలి షడ్యంత్రకారులందరితోఁ గూడి విందారగింపవలయునన్నను, మే మందులకు వెనుదీయము. విలాసినులందొకతెయయిన మీనెచ్చెలిని, ఆమెను చేపట్టిన హితునిఁగూడ నాహ్వానింపుడు—అందఱము కలిసి ఎట్లానందింతుమో చూతుముగాక!

"మీనుడువులు కడు హృద్యముగ నున్నవి—కాని నేటి విందు

నకై నాస్నేహితురాలు రాఁజాలదు. ఆమె రహస్యారక్షక భటుల చేతులఁబడి సెంటిపీటర్సు బర్గునకుఁ గొంపోఁబడి యుండును.''

మరల నవ్వులాటలు, పరిహాసప్రసంగములు ఆరంభమయినవి. గార్చస్ దొరసాని నిబిష్టచిత్తయై ప్రేక్షకుల దిక్కుగఁ దేఱిచూడ సాగెను. నాటక మించుమించుగ ముగిసిపోయెను. అకస్మాత్తుగ నామె తన దృక్కులను మఱొక్కదిక్కుగఁ బఱఁపెను. దాపుదాపున నున్న రెండాసనములపై నిరువురుస్త్రీలు కూర్చుండి యుండిరి. వారివెన్క చీఁకటియందొక పూరుషుని అస్పష్టాకారము చూపట్టుచుండెను.

మెల్లన గర్చసు దొరసాని యిట్లనుకొనెను. "ఏమి ఆశ్చర్యము! అతఁ డిచటి కేతెంచెను!'' అనెను.

మొరాటిన్—ఏమి! అతఁడు మీపరిచితుఁడా?

"అతఁడు నేఁడిచటికి వచ్చునని నేఁదలచియుండలేదు.''

"మీపలాసినీ సఖీమణియే అట్టివేషమున నిలిచియుండలేదుకదా!'' అని పరిహాసస్వరమున మొరాటిన్ పలికెను.

"ఎవరైన మీ కేమి!''

"ఆయిరువురి యాఁడువారివెన్క నట్లునిలిచినవాఁ డెవరో యెఱుఁగ నాతురపడుచుంటిమి: ఎంత తేఱి చూచినను అతని మీసములుతక్క యిచటి కేమియుఁ గనబడుటలేదు. ఆ యాఁడువారైన జవ్వనులు కారు. వారిమొగమున సౌందర్యరేఖ యేమియుఁ జూపట్టుటలేదు.''

సుందరి—ఆయంగనల నిర్వురనుగూడ నేనెఱుఁగుదును! వారు భోగాపేక్షతో సంచరించు వితంతువులు. గొప్పవారి నిర్వురను చేపట్టి పరిణయమాడ వారు తగు ప్రయత్నములు చేయుచున్నారు. వెనుక నిలిచినవాని పోలికఁజూడ, నేననుకొన్న యాతఁడేయని తోఁచుచున్నది—ఎంత విస్మయకరము!

"మీరు తన్నుఁజూడ నాతురపడుచున్నట్లాతఁ డెఱిఁగినచో ప్రము

దితచిత్తుఁడై మీా(మోల నిలచును.''

"అట్లని తలఁపను."

"అట్లయిన నాతఁడు చాటున దాగియుండుట కేదేని కారణముం డును—అతనిని గుర్తింపఁగలరేమో పరిశీలింపుడు.''

"నేను పేరిసునందు మిగుల నరుదుగ నుందును. నాటకాలయము నకు వచ్చువారి నంతగఁ గుఱుతుపట్టలేను. కర్నలుగారి నడిఁగి చూడుడు."

కర్న లాదిక్కుఁకుఁ జూడసాగెను.

సుందరి—దొరగారు గుర్తించియుందురు—అతఁడు రాబర్టు కాదా?

రాబర్టుపేరు వినినంతనే దొర యించుక చకితుఁడై "ఏమందురు? రాబర్టా?" అనెను.

"అట్లని యనుకొనుచున్నాను. మీారాతని నెపుడునుజూడ నేలేదా?"

"పలుమారు చూచితిని; అతనిని గుర్తుపట్టఁగలను."

సుందరి—ఆరమణు లిర్వురు రాబర్టును ప్రేమించియుందురు.

దొర—నిరుపేద యయినను నతఁడు వారినిఁ జేపట్ట నంగీక రింపఁ డనుకొనెదను.

మరల నాతట్టుగఁ జూడ్కులు నిగుడించి గార్చన దొరసాని యిట్ల నెను: "ఆశ్చర్యమాశ్చర్యము! నేను సరిగనే గుర్తించితిని,—కాని యిపు డందు నిలిచిన దాతఁడు కాను. అతఁడందుండి చీకటిలో వెళ్ళి పోయి యుండును. రాబర్టునకును ఇపుడు కాన్పించువానికిని ఎట్టిపోలిక యును లేదు."

"ఆయువకుఁడు మిక్కిలి భాగ్యశాలియని తోఁచుచున్నది. మీా రాతని చింతయందు మునిఁగియున్నట్లు తలఁచెదను. ఆయువకుఁడెట్లు మీాహృదయమును హరించెనో తెలిపెదరా?''అని మొరాటిన్ పరిహాస

పూర్వకముగఁ బల్కెను.

కోపదీప్తనయనయై సుందరి యిట్లనెను—“మీ ప్రశ్న కడుంగడు అనుచితమైనది. నాస్నేహితురాలొకతె రాబర్టును గుఱించినవార్తఁ దెలుప నన్ను వేఁడినది. అందుచే నాతని విషయము ఆతురతఁ దెలిపితిని. ఆమె నాకడ నొక పెట్టెనుంచి, ఆయువకుఁడు కాన్పించిన యెడల దాని నాతనికీయ వేఁడెను. నాకన్యోద్దేశములేదు.”

దొర చకితుఁడై యిట్లనెను: “పెట్టెను నాకిచ్చినచో దానిని నే నాతనికడ కంపుదును. నేను వాని విలాసము నెఱుఁగుదును.”

“మీ అనుగ్రహమున కానందించితిని. కాని పెట్టెను నేనే స్వయముగ వానిచేతి కిచ్చెదనని నాహితురాలికి మాటయిచ్చితిని. ఈకార్యము నాపైఁ బడవేసికొని చిక్కులోఁ బడిపోతిని. ఏలనన, నేనుస్వయముగ నాతని నివాసమునకు పోఁజాలను. వానిపేరున నొకలేఖ వ్రాయుదును. మాయింటికివచ్చుట కాతఁ డంగీకరింపకపోఁడని నాయభిప్రాయము.”

“ఎందుల కంగీకరింపఁడు? ఇఁక కాలహరణ మొనరింపఁ జెల్లదు. ఏలనన, అతఁ డేసుమూహూర్తమందైన పేరిసునగరమును వీడిపోవచ్చును. వాని నుడువులనుబట్టి చూడ, రేపు అపరాహ్ణకాలమునందే పేరిసును వీడి చనవలెనని అతఁడూహించుచున్నట్లు తోఁచుచున్నది.”

“అతఁ డీపట్టణమువీడిచన నుత్కంఠుఁడగుట అక్కఱము కాదు. ఇవు డుపాయమేమి?” అని సుందరి మెల్లగ ననుకొనెను.

దొర—ఆతనిఁజూడ నిక్కముగ మీరంత ఉద్విగ్నులైయుంటిరా? అంతగ జూడవలెనన్న నేడే మీకు వానిని జూపుదును.

“అట్లయిన వానితో పని వెంటనే ముగిసిపోవును. మన విందున కెట్టి విఘ్నము కలుగనేరదు.”

“మంచిది. నేనిపుడే వాని బసకరిగి మాట్లాడుదును. నేఁబోవు

నప్పటి కతఁడింట నున్నచో తప్పక మీపాలికిఁ దోడ్తెత్తును. ఒక వేళ కాన్పించనిచో నాపేరున రెండుపంక్తులు వ్రాసి వానిని రప్పించుదును."

"ఒకమా ఱెట్లయిన మీ రాతని నా సమ్ముఖమునకుఁ బంపఁ జాలుచో మీయెడ సదా కృతజ్ఞనై యుందును."

"మి మ్మింటికిఁ జేర్చి అతనిఁ గొనివచ్చుటకై మేము వెళ్లెదము. ఇంచుక తాళుఁడు. మే మిదే బండిని గొని వచ్చెదము!"

ఇర్వురు మిత్రులు ఆసనములనుండి చనిరి. వానిలో నెవరుగాని మేక్సిమును జూడలేదు.

నడచుచు నడచుచు మొగాటి నిట్లనెను. "మొదటనే మీకు నేను మంచి యోచనఁ దెల్పితిని గాదా? చోరులలో నొకతె యయినను గాకపోయినను వారితో నీ సుందరికి పరిచయమున్నట్లు స్పష్టమయినదికదా! ఇపుడు మీ రించుక కౌశలమును జూపఁజాలుచో, వారు పన్నిన జాలమందే తస్కరులను పడవేయఁజాలుదుము. ఇంక నెక్కడికి తప్పి పోఁజాలుదురో చూతుముగాక!"

"కాని కడు జాగరూకులము కాకపోయినచో, మన యత్నము లన్నియు వ్యర్థములగును."

ఇర్వురు నలయు వెరవుల నాలోచించుకొనుచు మేడమెట్లమీఁది నుండి దిగి యీవలకు వచ్చిరి. "వెంటనే మన మొకబండి కుదర్చవలయును. ఇఁక నొక నిముసమయిన నాలసింపరాదు" అని దొర యనెను—

౬

సార్జంటుదొరసాని ననుసరించిచన మేక్సిమః కృతసంకల్పుఁడై హితుని సహితముగ దొర నాటకాలయమునుండి నిష్క్రాంతుఁ డగుటఁ జూచియు మఱుఁగుతావునఁ గూరుచునియుండెను. ఆ వ్యక్తు లిర్వు రిఁక మగల రారని అతడు యోజించెను. అందుచే వా రించుకసేప టిలోఁ దిరిగి వచ్చుటను జూచి అతఁ డబ్బురపడి, ఏమి జరుగునో యని చూచుచుండెను. దొరసాని ఆసనముమునుండి లేచి మెల్లగ ద్వార మీవలి కరుదెంచి సోపానాభిముఖముగఁ జనెను—దొరయు, మిత్రుడును యిరుకట్టులనుండి ఆమె ననుసరించి నడువసాగిరి.

"వీ రిర్వురు సుందరివెంట నంటి ఆమె నిలయమున కరుగుచుండ వచ్చును. ఈ మూవుర గభీరసఖ్యతయందు నిశ్చయముగ నేదేని రహస్యముండి యుండును. రాత్రియంతయు వీరి వెన్నంటి వెళ్ల వలసివచ్చినను వెనుదీయకపోయి యీ రహస్య మేమో భేదించి తీర వలె"నని మేక్సిమసు నిశ్చయించుకొని వారి కన్నులఁ బడకుండ వెంట నడువసాగెను. ప్రాంగణద్వారముయొద్ద నిలిచి చేసన్నచే వా రెవ రినో పిలిచిరి.

తోడనే ఒకబండి వచ్చి గుమ్మముముందు నిలువఁబడెను. మూవు రును అందు గూరుచుండిరి. ఇఁక తడయరాదని గ్రహించి బిఱబిఱ అవ్వలికిఁ జని పథపార్శ్వమున నిలిచియున్న యొక బండిని సమీ పించి, బండివాని చెవిలో నేమో యూది మేక్సిము చివాలున దానిలో నెక్కి కూర్చుండెను. చతురుఁడైన యీ బండివాఁడు ప్రక్క నున్న చిన్ని మార్గమున గుండా ముందుఁ జను శకటము ననుసరించి తన బండిని పోనిచ్చెను. ముందలి శకటము కడు మెల్లఁగ నడచు

చుండెను. అందుచే దాని ననుసరించి చనుట రెండవదానికిఁ గష్టము కాలేదు. కతిపయవిశాలపథములఁ దాఁటి శకటము నడచుచుండెను. బండివాఁడు బండి తోలుటయందు బాగుగ నలవాటు పడిన గడసరి. చుట్టుఁ ద్రిప్పి యెక్కువ బాదుగ గొనుటయం దాతఁ డాతితేరిన వాఁడు. ముందలి శకటము సార్జంటు దొరనాసియొక్క సర్జన నిలయ సమ్ముఖమున నిలువఁబడుటఁ జూడగనే మేక్సిము విస్మయమునకు మేరలేకపొయెను. చతురుఁడైన ఆతని బండివాడు "బాబూ! బండిని ఆపుదునా! ముందుబండినుండి స్త్రీతోఁగూడ ఆ యిద్దఱు దిగిరి. బండి వాని అద్దెకూడ ఇచ్చివేసిరి. ఇఁక వారికి బండి అక్కఱలేదనుకొనెద" ననెను.

"త్రోవ కావలివైపునుండి మెల్లగ బండి తోలుము"

శకటమున గూర్చుండిన యువకుఁ డా ముగ్గురిదెస దృష్టి సారించుచునేయుండెను. ఇంచుక సేపటిలో సహచరసహితయై యా రమణిసౌధమునఁ బ్రవేశించెను. మేఁడదాటి బండి రోడ్డుమూలలను మరలినంతనే మేక్సిము బండివానిభుజముపై దట్టి—"గబగబ బండిని కుడిప్రక్కకు మరల్పుము. సందుమూలనే నిలిపియుంచుము. ఈ యిరు వది నాణెములను ముందు పుచ్చుకొనుము. బహుశా రాత్రి యంతయు బండి తోలవలసియుండును!" అనెను.

"బాబూ! మీ యుద్దేశము బోధపడినది. నే నంతకుముందే బండి గట్టితిని. నా గుఱ్ఱము రాత్రియంతయుఁ బాటు పడగలదు."

"మంచిది."

"ఈమారు బైడార్డును గలిసికొని వానివలన నిపుడీమేడను గుఱించిన యుదంతము నంతను దెలిసికొని అందేమి జరుగునో చూడవలయు"ననుకొని మేక్సిము జేబునందలి గడియారముఁ జూచి "పదిగంటలనరమాత్ర మయియున్నది. వానిని గలిసికొనుటకు వేళ

మించలేదు'' అని వితర్కించి, బయిడార్డు గృహసమ్ముఖమున కరిగెను. అందుండి సార్జంటుదొరసాని గృహము బాగుగ గన్పట్టుచుండును. నిశీథమగుటచే నెల్లయెడల నిస్తబ్ధత విరాజిల్లుచున్నది. తావంతయు నిబిడాంధకారబంధురమై యున్నది. ఎందునుగూడ దీపముకాంతియే చూపట్టుటలేదు. బయిడార్డు మేడ క్రింది గది కిటికీనుండిమాత్రము మిణుకుమిణుకుమని యించుక వెలుతు రీవలికిఁ గన్పట్టుచుండెను. కిటికీపొంత కరిగి మేక్సిము లోనికి తొంగిచూచెను. దీపముముందుఁ గూర్చుండిఁ బయిడార్డు నాఁటి సాయంకాలపు వార్తాపత్రికను జదువుచుండెను. వాని దాపున నొక పెద్ద జాగిలము పరుండియున్నది. పంజరమున నొక రాచిల్క నిదురించుచున్నది. కిటికీ తల్పుపై యువకుఁడు మెల్లఁగ దట్టెను. అవల నొక మనుష్యాకారము గాంచి తలుపుదెఱచుటకై బయిడార్డు లేచి నిలువఁబడెను.

‘‘భయములేదు. నీవు నన్నెఱుఁగుదువు. ఈవఱలో నొక్క మాఱిందే చూచియుంటివి. ఈ యెదుటి సుందరి మేడలో నుండు వికారాంగుని గుఱించిన యుదంతము నీవు చెప్పియుంటివికదా! అపుడు పోలీసుల సాయమున యీ సౌధమును పరిశోధించియుంటిమి. జ్ఞప్తికి వచ్చినదా?’’

‘‘చిత్తము జ్ఞప్తికివచ్చినది. ఇంతరాత్రివేళ దయచేసితిరేల?’’

‘‘నీతో కొంచెము పని యున్నది.—తలుపు తెఱువుము.’’

‘‘చిత్తము. ఇష్టమువచ్చినంతసేపు మీరిందు విశ్రమింపవచ్చును.’’

‘‘రెండు గంటలసేపు మాత్రమిందుండి పోవుదును.’’

ఇంటి యజమాని యించుక యబ్బురపడుటఁ జూచి మేక్సిము ‘‘ఆ యెదుటి మేడలో నిపు డేదేని వింత జరుగవచ్చును—ఇఁక నీవల తడయరాదు. త్వరగా తలుపుతీయుము. నేను ఆ మేడలోని వారెవ్వరి కన్నులఁబడరాదు!’’ అనెను.

"తీయుచున్నాను, బాబూ! తీయుచున్నాను." అని బయిడార్డు తోడనే తలుపు తెఱచెను. లోపలఁ బ్రవేశించి మేక్సిము "వెంటనే దీపమార్పివేయుము. లేకపోయిన నొకమూలనుంచుము. నా మూలముగా నీకుఁ గలుగు శ్రమకై ఈ యిరువది నాణెములు పుచ్చుకొనుము" అనెను.

పైకమును జేబు నందుంచుకొని, బయిడార్డు దీపము బల్లక్రింద నుంచెను.

మేక్సిము—ఇటువచ్చి మెల్లగ నీ కిటికీలో నొదిగి కూర్చుండి కాఁపుకాయుచుండుము.

యువకుని చెంతకరిగి యింటి యజమాని యతఁడు చెప్పిన చొప్పున నాచరించెను.

మేక్సిము—ఆ మేడలోని వారెప్పుడు మరలి వచ్చిరో ఎఱుఁగుదువా?

"మరలివచ్చిరా! వారి జాడగాని కబురుగాని లేనేలేదు. నెల పదిహేనుదినముల క్రింద ఏకారాంగుఁ డెచటికిపోవుట మీ రెఱుఁగుదురుకదా?"

"వారింతకుమున్నే మరలివచ్చిరి—నీవు చూచియుండవు"

"వచ్చు టెవరును జూడలేదు."

"ఇపుడు వారందున్నారు"

"బాబూ! పొరఁబడియుందురు. ఆమేడ చాలదినములనుండి పాడుపడినది. అందిపుడు దయ్యములు కాపురమున్నవని అందరు చెప్పుకొనుచున్నారు.—దయ్యముల మాటటుండ లెక్కలేని ఎలుకలకది నివాసమై యున్నది."

"ఇపుడే యిరువురు పురుషులు ఒక స్త్రీ ఆ మేడలోని కరిగిరి. వారందుఁ బ్రవేశించుట నేను స్పష్టముగాఁ జూచితిని!"

« వికారపురుషుడు కూడ వారితో నుండెనా ?"

« లేదు—ఆ యిరువురు పురుషులు విదేశీయులు. వారల నెఱుఁగుదును ! ఆఁడుది సుందరియగు సార్జంటు దొరసాని !"

« అట్లయిన నా గృహము నిశాచరులకు అనవరతము ఆలవాలమైయినది—ఈ సంగతి పోలీసులకుఁ దెలుపుదునా ?"

« వలదు. ఇపుడందుఁజొచ్చి వారేమిచేయుదురో చూడవలయును. అందుకొఱకే నేను మీయింటికి వచ్చితిని.

« మంచిది—ఈ తావునకంతయు బాగుగ కానఁబడును."

« ఆ మేడనుండి అవ్వలికరుగుటకు మఱేత్రోవయైననున్నదా ?"

« మేడకు వెనుక నొక తోఁటయున్నది ; ఈ వరలో పోలీసు లా చోటును సోదాచేసినపుడు నేనుగూడనుంటిని ; ఇంటి వెన్క నాకే గుమ్మము కానఁబడలేదు."

« చూడుము. అదిగో రెండవ యంతస్థు పైగదిలో దీపము వెలుగుచున్నది."

« అవునవును. పైనగల పెద్దచావడిలోఁగూడ దీపము వెలుగుచున్నది. నిశ్చయముగా గొంద ఱాయింటనున్నారు. నిముసములో నా యంతస్థంతయు విద్యుద్దీపకాంతులతోఁ బ్రకాశితమయినది. ఎంత విడ్డూరము ! భోజనాగారమందుఁగూడ నొక్కటొక్కటిగ నన్ని దీపములు వెలుగుచున్నవే ! సుందరి నేఁడు విందో లేక నృత్యసభయో కావించును. మరియింతలోనే యింతమంది పరిచారకులెట్లువచ్చిరి ? శంకాభయపీడితులగు నిరుగుపొరుగు వారిపుడాయింటిని జూచి రేని మేడయందు నేఁడు పెనుభూతముల మహాసభజరుగుచున్నదని తలఁపక మానరు !

« ఈ నడుమ నా మేడలో నెవడును ప్రవేశింపలేదా ?"

" మానవులమాటటుండ, అందొక మార్జాలమునైన ప్రవేశింప

లేదు. ఈ మేడలోనివా రింకను నిదురింపకున్న యెడల తమ కిటికీల గుండా ఎదుట జరుగుదానినంతయుఁ జూచుచునే యుందురు! అందుచే నిపు డేమయిన అల్లరి జరుగవచ్చును. మార్గమున పల్వురు గుంపులై చేరకమానరు!"

"చూడుము, చూడుము,—పై చావడి తెరపై మూడుఛాయలు కానఁబడుట లేదా?"

"అవును. రెండుఛాయలు పొడవుగా నున్నవి! మూడవ దించుక పొట్టిదియై యున్నది."

"ఇర్వురు పురుషులు మూఁడవది వారి హితురాలు. ఇంకను విందు సన్నాహములు శేషింపలేదు కాఁబోలు. వారెవ్వరికొఱకో తడయుచున్నట్లు తోఁచుచున్నది."

"చూడుఁడు, చూడుఁడు. ఒకరికొకరు వందనము లాచరించుకొనుచున్నారు. వారిలో నొకఁడు వెడలిపోయెను. అతఁ డెచటి కరిగి యుండును?"

అయిదు నిముసములవరకు ఏమియు జరుగలేదు;—రెండు ఛాయ లొకటితో నొకటి కలిసిపోయెను. దీపములు మునుపటట్లే వెలుఁగుచుండెను. హఠాత్తుగ తలవాకిలి తలుపులు తెఱువఁబడెను. మొదట నొకఁ డీవల కరుదెంచెను.—వాని వెనుక దీపము పట్టుకొని పరిచారకుఁ డొకఁ డీవలికి వచ్చెను. దీపపు వెలుతురులో మేక్సిము బొరిమఫ్‌ను గుర్తించెను. పరిచారకుని కేదియో చెప్పి దక్షిణాభిముఖముగ దారి చనెను. తోడ్తోడనే మేడ తలుపు మూయఁబడెను. సుందరి రెండవపురుషునితో పై అంతస్తుపైఁగల చావడిమూల కరుదెంచి, అందలి కిటికీగుండా మార్గమున దూరముగ దృక్కులు పఱపుచుండెను. కొండొకదూర మా చూడ్కులు దారి ననుసరించెను. మేడపై నిలిచిన మిథున మెవరికొఱకో వేచియున్నట్లు చూపట్టెను.

"వీధి చివరవరకు నేనాపోవువాని ననుగమింతును." అని మేక్సిము మెల్లఁగ బయిడార్డుతోఁ జెప్పెను.

"మంచి దట్లే యనుసరింపుము. మెల్లఁగఁ దట్టిన యెడల నేను మెల్లగఁ దలుపుతీయుదును."

ఇంటియజమాని మెల్లగఁ దలుపు తెఱచెను. యువకుఁ డల్లన నావలి కరిగెను. కొన్నియడుగులదవ్వున బోరిమఫ్ అతని ముందు నడచుచుండెను. అనతిదూరమున మఱొకఁడు మార్గమున మెల్లగఁ బచారు చేయుచుండెను. మేక్సిమాతని గుఱుతుపట్టెను. వాఁ డాతని బండివాఁడు. "ఇదియు నొక మేలే! దొర చనినంతనే అతఁ డే దిక్కుగఁ బోయెనో బండివాఁడు చెప్పఁగలఁడు" అని యువకుఁ డనుకొని చీఁకటిలో దాఁగుకొనెను.

దొర ద్రుతగామియై చనుచు, బండివానిఁ జూచి, వాని సమీపమున కరిగెను. ఇరువురు చాలసేపు ప్రసంగించుకొనిరి. మరల దొర వడి వడిగ నడువఁదొడఁగెను. అతఁ డంధకారమున నదృశ్యుఁ డాయెను. మేక్సిము మెల్లగ బండివానిఁ జేరెను. బండివాఁ డాతనిఁ జూచి నవ్వి యిట్లనెను,—ఆపెద్దమనిషి నాయొద్దనుండి గుట్టుతీయ సమకట్టెను. కాని పాపమాతని యెత్తు పడినది కాదు—బుట్టలోఁ బడవైచితిని. నా బండిని జూడగనే అతనికి సందేహము పుట్టెను. వైద్యుని తీసికొని వచ్చితిననియు, అతఁ డీపెద్దయింటిలోనికి రోగిని జూడఁబోయెననియు, బండిని వానికై నిలిపియుంచితిననియుఁ దడుముకొనకుండ చెప్పితిని. నామాట లాతఁడు నమ్మెను."

"తాతా! నీ తెలివితేటలు మెచ్చుకొనదగినవి. నీకు మంచి ఇనా మిచ్చెదను. ఎక్కడికైన నిన్నాతఁడు బండి కట్టమనెనా?"

"కటమనినాఁడు. తనయింటికిఁ దీసికొనిపొమ్మన్నాఁడు. ఇచటి నుండి అది చాలదూరము లేదఁట."

"ఆమూల పేటలోనికిఁ దీసికొని పొమ్మనెనా?"

"అవును.—సరిగ నూహించితిరి. నా కాతఁ డొక మొహరు ఇచ్చినను, నేను పోవువాఁడను గాను. నావలనఁ దన కేపనియుఁ, జరుగదని గ్రహించి అతఁడు వెళ్ళిపోయెను. అతఁ డీపాటికి ఇల్లు సమీపించును."

"చాల తెలివిగ మెలఁగితివి. నీకు మంచి బహుమానమిచ్చెదను. ఇవుడే అతఁడు తిరిగివచ్చును. వానిపై నొక కన్నువేసి అతనిజాడ కనుపెట్టవలయునుమీ! నేను తిరిగి రాగనే నీ వేమేమి చూచినదియుఁ జెప్పవలయును. అవసరమయిన యెడల నిన్ను బిలువ వచ్చునా"?

"తప్పక పిలువుఁడు. 'అసప్టి' అని పిలిచిన చాలును. ఏదేని కొట్లాట జరిగినచో, నన్ను ఉసిఁగొల్పుడు. నా భుజ బలమెట్టిదో—నా చేతి దెబ్బయెట్టిదో మీరు కన్నులారఁ జూడఁగలరు!"

"మంచిది. అవసరమయిన యెడల నిన్ను పిలిచెదను"

అని చెప్పి యువకుఁ డందుండి తఱలి బయిడార్డు గృహమున కరిగి మెల్లఁగఁ దలుపుతట్టెను. ఇంటి యాతఁడు తోడనే తలుపుతీసెను. మేక్సిములోపల ప్రవేశించి "అతఁడు దగ్గర పేటలోనికిఁ బోయెను. మరల తిరిగివచ్చును" అనెను.

"అతఁడు రానంతవఱకు, వారు విందునకై కూర్చుండరు."

"ఊరకొనుము—అరిగో! చూడుము! ముగ్వురు మనుష్యులీది కుఱ్ఱగ వచ్చుచున్నారు. చీఁకటిలో మెల్లగ నడగి మడగి, పొంచి పొంచి వచ్చి వారు మేడ గుమ్మమున కిరువైపుల నిర్ఘాతులవలె నిలువఁబడిరి."

బిఱబిఱ వచ్చు నొకబండి చప్పుడు హటాత్తుగ వినఁబడెను! చూచుచుఁ జూచుచుండ పెద్దబండి సుందరి మేడకెదురుగ నిలువఁబడెను. శకటమునుండి ఒకఁడు చివాలున క్రిందికి దిగి గుమ్మమునుండి వ్రేలాడు

గంటను మ్రోయించెను. తోడనే తలుపు తెఱచుకొని పరిచారకుఁ డొకఁడీవలికి వచ్చెను. ఆగంతువు వానితో నేమేమో చెప్పి బండి గుమ్మముకడ కరిగి బండివాని కేమో తెలిపి తలుపుతీసెను. తోడనే రాబర్టుబండినుండి దిగి మేడదిక్కుగ నడచెను; ఇరువురాతని వెన్నంటి చనిరి! ఇదంతయుఁజూచి మేక్సిము మిగుల విస్మితుఁడై పోయెను. వెన్నంటివచ్చువారితో రాబర్టేమో మాట్లాడుచుండెను. పరిశీలించి చూడ బలవంతముగ నాతఁడిచటికిఁ గొని రాఁబడలేదని తోఁచు చున్నది. మేడతలుపు తెఱచియే యుండెను. పరిచారకులు గుమ్మము కడ నిలిచియే యుండిరి. లోపలినుండి వచ్చిన భృత్యుఁడు రాబర్టు ఆగమనమును బ్రతీక్షించుచుండెను.

"ఈ విపరీతమంతయుఁ జూడ, మేడలోఁ జేరిన వారాయువకుని హత్యఁగావింపఁ దలఁచినట్లు తోఁచుచున్నది. కేకలిడి చుట్టుప్రక్కల వారిని పిలుచుకొని వచ్చిన బాగుండునని నా మనస్సు తొందరపెట్టు చున్నది!

"ఇపుడుకా దిపుడుకాదు. వారియుద్దేశమేమో ముందు కనుపెట్ట వలెను."

"మీఁది చావడి దిక్కుగ పరికించి చూడుఁడు. తెరపై మరల నిర్వురనీడలు చూపట్టు చున్నవి!"

"మిత్రునితో సుందరి అందునిలిచి యున్నది. బండివచ్చుటచూచి వారు మరల కిటికీచెంతకు వచ్చిరి."

"వారిఁక అచటి తలుపుఁ దెఱువ రనుకొనెదను"

"ఆ చప్పుడేమి?"

"మనమేడ మూడవయంతస్థుపై నద్దెకున్నవారు తమ తలుపుతెఱ చిరి. చూడుఁడు, మిండగులగు బందిపోటు లెట్లయిన నొరుల కన్నుల బడకుండ నుండయత్నించుదురు!—చూడుఁడు! తెరపైఁగల నీడలు

ప్రక్కకు తలిలిపోయినవి. ఇపుడు మనము వీథిపైఁ గన్నుంచియేమి జరుగునో పరీక్షింపవలెను.''

కాని వీథి యందెట్టి యద్భుతఘటనము సంఘటింపలేదు. నిలిచి యున్నబండి అట్టులే నిలువఁబడి యున్నది. ఈవలఁజేరిన ముగ్గురు పురుషులు గోడనంటి నిలిచి నీరవులై కాఁపు గాయుచుండిరి.

ఇద్దరు భృత్యుల ననుసరించి రాబర్టు గుమ్మము దాపున కరిగెను. మఱొకఁడు అతని వెన్నంటి నడచుచుండెను. మేక్సిము విస్మయము నకు మేరలేకపోయెను. కార్యదర్శి బోరిసఫ్ నిలయమున బంధితుఁడై యుండెగదా! నేటి నిశీథమున ఆ దొరవాని నిచటికిఁ గొనిరా నేల! యోచించినకొలఁది మేక్సిము డోలాందోలనమానసుఁడాయెను. కదల మెదలక వంగి అతఁడావలి చర్యను దేఱి చూడసాగెను.

పోలీసులను బిలువవలెనను నూహ నడుమ నడుమ నాతని మనసున తట్టెను. కాని అందులకింకను వేళ కాలేదనియు, నించుక తడయుటుచితమనియుఁ బదంపడి యోచించి అతఁడు మిన్నకుండెను. ఏదెట్లు పరిణమింపనున్నను, ఇంకలి రహస్యమును భేదించి తీరవలెనని తోడనే యతఁడు కృతనిశ్చయుఁ డయ్యెను.

రాబర్టు మేడగుమ్మమునఁ గాలిడగనే, నిశీథినీ నిస్తబ్దతను భేదించుచు,—

„కొక్కురోకో! కొక్కురోకో!! కొ—క్కు—రో—కో!!!'' అను కూఁత వినఁబడెను.

„మూఁడవయంతస్థుపై అద్దెకున్న ఒకఁడు మంచిహాస్యగాఁడు— ఇపుడు జరిగే తమాషా పరీక్షింపుఁడు!" అని మెల్లఁగ మేక్సిము నుద్దేశించి బయిడార్డు పలికెను.

మేక్సిమూరకొనియుండెను. వీథిలోని పరిచారకుల కేకలువిని అదేమి యని యతఁడు పైకిఁ దలయెత్తి చూచెను. ఎవ్వరు కాన్పించలేదు.

మరల హటాత్తుగ కుక్కుటధ్వని యయ్యెను. రాబర్టు వడివడిగ లోపలఁబ్రవేశించెను. పరిచారకులు త్రోవవిడచిరి. రాబర్టుతోనున్న ముగ్గురుభృత్యులలో నొకఁడాతని వెన్నంటిలోనికి చనెను. తక్కుంగల యిర్వురు వ్యక్తులు లోపలఁ బ్రవేశింప నుద్యమింప గుమ్మముకడ గల పరిచారకుఁడేమి వచించెనోగాని వారట్లే నిలువఁబడిపోయిరి. గుఱ్ఱపువాఁడపుడు కళ్లెమును బండి తలుపునకుఁ గట్టివైచి పైనుండి క్రిందికి గుభాలున దుమికి, గోడనంటి నిలిచియున్న పరిచారకులలో నొకని చేతియందలి కొరడాయుంచెను. వాఁడు దానిని గైకొని తురగసమ్ముఖమున కరిగి నిలువఁబడెను. ఈవలివైపునకుఁ దిరిగి, గుఱ్ఱపువాఁడు నలుదిక్కులు పరీక్షింపఁదొడఁగెను. మేక్సిము దృక్కులాతని మొగమున బడెను. తోడనే యువకుఁడు వానిని గుర్తించెను—అతఁడు గుఱ్ఱపువాని వేషము ధరించిన బొరిషప్ నొర!

వాని రూపమునుగాంచి మేక్సిము మిక్కిలి యక్కజపడెను. దాపుననున్న బయిడార్డు ముందునకుఁ దేటిచూచి యువకునుద్దేశించి యిట్లనెను. "చూడుడు! చూడుడు! పైగదులందలి దీపములన్నియు నకస్మాత్తుగ నారిపోయినవి. అతిథులు రాఁగనే లోనివారు దీపములనిట్టె యార్పివైచిరి—ఏమి యద్భుతము! చీఁకటి కోణమందుఁబడి వారందఱు కలిసి దాఁగిలిమూఁత లాడరు కదా! బండిమీఁదినుండి లఘించిన గుఱ్ఱపువేషధారుఁ డీవిపరీతముజూచి విస్మితుడగుచున్నాఁడు. చూడుడు! అతఁడు వెనుకకు మరలి పైకి చూడ్కుల నెట్లు నిగిడించుచుండెనో! ఏమిమాయ! నిముసములో నెట్టిమార్పు!— మేడ యంతయు గాఢతమసావృతమై పోయినది.

బొరిషఫ్ కొంచెం డొకవడి వీధినడుమ నిలిచి, ఏదియో యోచించి పదఁపడి వెన్కకుఁ దిరిగి నింగితట్టుగఁ జూడ్కులు నిగిడింపఁ దొడఁగెను. కోడి కూత కూఁసినవా డింకను ఎదుటి మేడపై నిలువఁబడి

యుండెనేమో పరీక్షింప నతఁడట్లు చూచుచున్నట్లు తోఁచెను. కూఁత కూసిన వ్యక్తి యూరకొనియుండెను. దొర యపుడు సుందరి మేడ వైపునకుఁ దిరిగి, సగము మూయఁబడియున్న ద్వారప్రాంత మున కరిగెను. గుమ్మమున కిరుతట్టుల నపుడు కూడ వాని యను చరులు కాఁపుఁ గాయుచుండిరి. ఇంచుక తెఱువఁబడిన తలుపుగుండా అతఁడు లోపలఁ బ్రవేశింప యత్నించినంతనే, చివాలున కవాటము బంధింపఁబడెను.

"బాగు! బాగు! మంచి పరాభవమయినది. యజమాని నాహ్వానించినట్లు తన్నుఁ గూడ విందునకై పిలిచినట్లు గుఱ్ఱపువాఁడు తలఁచెను గాఁబోలు!" అని బయిడార్డు పలికెను.

"అతఁడు గుఱ్ఱపువాఁడు కాడోయి" అని మెల్లగ మేక్సి మనెను.

"అట్లని ముందు నాకుఁ గూడ కొంచెము సంశయము కలిగెను. ఓ! చూడుఁడు, చూడుఁడు. అతఁడెట్లు నిప్పులు ద్రొక్కిన కోతివలె చిందులు త్రొక్కుచున్నాఁడో! ఒడలెఱుఁగక దూఱుచు కవాటము నెట్లు గుంజుచుఁ గుద్దుచు తన్నుచు రోజుచు బడితితో బాదుచుండెనో! ఈవల నున్నవాని పరిచారకులు కూడ ఆతనితోఁ గలిసి తలుపుపై పిడిగ్రుద్దులు కురిపించుచున్నారు. కాని వా రెంత తన్నుకొన్నను ఎంత కొట్టు కొన్నను, ఆతలుపుఁ బ్రద్దలగునది కాదు.—అది యుక్కుతలుపు. ఓ! ఎంత అల్లరిచేయుచున్నారో చూడుడు. చుట్టుప్రక్కవా రందరు లేచి యిటఁ బర్వెత్తికొని వత్తురు."

"వచ్చిన మేలే!"

"ఏమి యబ్బురము! మన మేడమీఁది వా రింకను గ్రిందికి దిగి పోలీసులను పిలుచుట లేదేల?"

"ఊరకుండుము! మేడపై చావడి కిటికీ యొకటి తెఱువబడు చున్నది. ఎవఁడో ఒకఁ డచట నిలువబడియున్నాఁడు."

"అతఁ డెవరో వెన్ను జూచి గుర్తింపఁగలిగితిని.—లోనికిఁ జనిన యువకు ననుసరించి పోయిన పరిచారకుఁడు. గుఱ్ఱపు వేషధారుఁడు. కిటికీ క్రిందికి చనుచుండెను.—వా రేదో మాట్లాడు కొందురు."

"వా రేమను కొందురో వినవలయును.—మెల్లగ మన కిటికీ కొంచెము తెఱువుము."

సుందరి మేడపై నిలిచినవాఁడును బొరిషఫ్‌ను గడుత త్తరపమున నేదియో ప్రసంగించుకొనుచుండిరి. కారి రష్యా భాషయందు వారు మాట్లాడు కొనుచున్నందున, ప్రసంగమేమో మేక్సీను బయిడార్డు లకు బోధపడలేదు.

"సార్జంటు దొరసాని, రాబర్టు, తరవారి శిక్షకుఁడు—ఈమూవు రెచటి కరిగియుందురు ?" అని మేక్సీ మనెను.

"చెప్పలేను.—చూడుఁడు. మేడమీఁద నిలిచియున్న వానికి సాయము సల్పుటకుఁ గాఁబోలు గుఱ్ఱపువాఁడు బండిని సరిగ కిటికీ క్రిందికి తోలుకొని పోయెను. పైనుండి బండిమీఁది కుఱుకుట కంత కష్టము కాదు. వారు మాట్లాడుకొనుట మానివైచిరి. ఇఁక మన కిటికీ మూసివేయుదును."

"నీవూహించినది సరికాదు—మేడమీఁదివాఁడు క్రిందికి దిగడు. బండిమీఁదివారే మేడపై కెక్కనుంకించుచున్నారు. చూడుము ! ఇర్వురు మెల్లగ బండి పైభాగమున కెక్కిగ బ్రాకుచున్నారో. బండి మీఁదినుండి వారు నేర్పున పైకిఁ జేరుదురు."

"ఆహా! ఏమి! వారి సాహసము! పై కెగబ్రాకి కిటికి పగులగొట్టి లోపలఁ బ్రవేశింప నుంకించుచున్నారు. ఏమి! ఆదుండగుల మొండి ధైర్యము! వారు తప్పక బందెపోటులే. ఎట్లయినను మనము దొంగల నా మేడఁ జొరనీయరాదు.—మీరడ్డుపెట్టని యెడల చుట్టు ప్రక్కల వారిని బిలిచికొని వత్తును. అందరికిని నేఁడు నిద్రాదేవత బాగుగ

నావేశించినట్లున్నది.''

"నే నేల అడ్డు కొనెదను ?

"ఇపుడే వారిని బట్ట గలిగిన మేలు.—దుండగులను పాఱిపోనీయ రాదు.—నేనే పోయి అందఱిని నిదురనుండి మేల్కొలుపుదును."

యువకుని పల్కులు ముగియకమున్న మఱొకమాఱు కోడికూఁత వినబడినది. తోడనే "కూనీ!'' "కూనీ!!" "బందిపోటులు!" "దొంగలు" "దొంగలు" అను కేకలు వినఁబడెను.

గుఱ్ఱపుబండిపై నిలచి మేడమీఁది కెక్క నుంకించువా రిర్వు రాకేకలు విని అట్టె నిలువఁబడిపోయిరి. బయిడార్దు మేడ కిటికీ లన్నియుఁ దెఱువఁబడెను. "అందఱును లేచిరి.—ఇపుడు మంచి తమాషా జరుగును!" అని ఆనంద ముట్టిపడ, మేడ యజమాని పలికెను.

నిముసములో నాతావున పెద్దయల్లరి పుట్టెను. ఒకఁడుచ్చై స్స్వన మున "ఏమిఘోరము! ఎదుటిమేడలో బందిపోట్లు కిటికీలు తెఱచి లోపలఁ బ్రవేశించుచున్నారు. పోలీసులను పిలువుఁడు—పోలీస్ పోలీస్!" అని కేకలు పెట్టెను. అపుడెందుండియో "కూనీచేయుము, కూనీచేయుము—తుపాకి పేల్చుము పేల్చుము" అని స్త్రీ స్వరము వినఁబడినది.

"దుర్మతీ! పోకుము! నిలువుము! ఇదె నీ పొగరణచెదను: తుపాకి-తుపాకీ ఎచట ? '' అను మరొకశబ్దము వినఁబడెను.

మేక్సిము బొరిసఫ్ దొరపై దృష్టినిలిపి యుండెను. తానుదలంపని యీ విపరీతమునకు దొర భయముజెందెను. మొగముఁజూచిన, వాని చిత్తము విచలితమైనట్లుతోఁచుచుండెను. క్రోధముచే నతఁడు కంపించి పోవుచుండెను. అల్లరిచేయుచు చుట్టును గుమిగూడిన వారికతఁడు పిడికిలిఁజూపుచు కనులెఱ్ఱఁజేయుచు లేనిగాంభీర్యముఁ జూపదొడఁ

గెను. ఇఁక పలాయనముతక్క వేఱువెఱవు లేదని త్రుటిలోనాతఁడు గ్రహించెను. అతని యాదేశమున బండి మీఁదినుండి ఒకఁడు నేల కుఱికెను. మేడ యంతస్తుమీఁద నున్నవాఁడు చివాలున బండిమీఁది కుఱికి మరొక దుముకున నేలపైఁబడెను. అత్తఱి హఠాత్తుగ బయిడార్డు మేడక్రింది గదినుండి పిస్తోలుచప్పుడు వినఁబడెను. బోరిమఫ్ కడుశత్తరమున తన బలగముతో బండిలోని కుఱికెను. వాని పరిచారకుఁడొకఁడు బండి ముందుభాగమున కెగిరి విద్యుద్వేగమున దక్షిణ దిశగ శకటమును దోలెను. నిముసములోనది అంధకారమున లీనమయ్యెను.

"పారిపోవుచున్నారు, దొంగలు పారిపోవుచున్నారు. దాఁటిపోనీయకూడదు. తరిమి తరిమి వారిని బట్టవలెను. అదే ముందు పోలీసు స్టేషను ఉన్నది. బండిని నిలుపునేయవలెను" అని బయిడార్డు అఱచుచు మేక్సిమును ముందునకుఁ బురికొల్పెను. బయడార్డు మేక్సిములు రాజపథమునఁబడిరి. బోరిమఫ్‌ను పట్టుకొనవలెనని యువకునకంత యాతురత లేదు. కాని రాబర్టు సుందరి, అస్త్రశిక్షకుఁడు—ఈ మువ్వు రేమయిరో ఎఱుఁగనాతఁ డుత్కంఠితుఁ డాయెను. వారా మేడయందు బంధింపఁబడిరనియు, బయిడార్డు మేడయం దద్దెకున్న వారి సాయముఁగాని వారిని విడిపింపవలయుననియు అతఁడు యోజించెను. ఇంతలో నాతఁడీవఱలోఁ గుదుర్చుకొనిన బండివచ్చి అతనిమ్రోల నిలిచెను. పిస్తలుశబ్దమువిని, వేగమున బండివాఁడు దానిని తోలుకొనివచ్చెను.

బయిడార్డు—ఇదిగో బండి. ఇఁక వారిని వెంటదరుముదు.

బండివాఁడు—బాబయ్యా! వా రెక్కినబండి సామాన్యమయినది కాదు. దానిగుఱ్ఱము ఎక్కువ వెలగలది. శ్రేష్ఠమయినది. మంచిదయినను నా గుఱ్ఱము పందెమున దానిని గెలువనేరదు.

మేక్సి మిఁక ముందునకుఁ జనలేదు.

ఇంతలో పిస్తోలుశబ్దము నాలకించి చుట్టుపక్కలవారియందుఁ గోలాహలము నయించెను. బయిడార్డు మేడలోనివారందఱొక్కరొక్కరుగ నీవలి కరుదెంచి గుమిగూడిరి. సుందరి సౌధమునఁ బరిశోధింప వారి సాయముఁ బడయనెంచి మేక్సిము "ఈ యద్భుత ఘటనమును నేను కన్నులారఁ జూచితిని. ఈ దుండగ మేమో మనము కనుగొని తీరవలయును!" అనెను.

వారిలో వృద్ధుఁ డొకఁడు గంభీరస్వరమున "అయ్యా! తమ రెవరు?" అని ప్రశ్నించెను.

వృద్ధుని వాగ్భంగికి యువకునికి కిన్క జనించినను దానిని ప్రకాశింపనీయక వారి నెట్టులయిన సంతృప్తి పఱుపఁదలంచి యతఁ డిట్లనెను. "ఇందేమియుఁ నాకుఁ బ్రసక్తిలేని వాఁడ నగుటచే మీరు సందేహించుచున్నారు. కాని నే నీమేడయజమానితో నించుక ప్రసంగింపవలెనని వచ్చితిని. మరలిపోవుచుండ నింతలో బందిపోటులు బండిమీఁదవచ్చిపడిరి. పాప మా మేడలోని వారికి సాయము సలుపనెంచి నేనిందు వేచియుంటిని. కోశీపతియగు వర్జ్సుగారికి నేను మేనల్లుడను.

వృద్ధుఁడు—ఓహో! వాణిజ్యమున వానికెంతో పేరున్నది.

బయిడార్డు మేడలోనుండు నొకఁడు "మీమాతుల కోశీయందు పనిచేయు విగసరీపి నేను బాగుగ నెఱుఁగుదును." అనెను.

మేక్సిము—అటులనా?

"మా యిరువురకు బాల్య మైత్రికలదు—గోలాఫార్డినా! అతని నీవుకూడ నెఱుఁగుదువు కాదా?"

రెండవ యాతఁడు—ఎఱుఁగుదును.

మేక్సిము—అతఁడు నాకు ప్రియమిత్రుఁడు. నేఁ డాతని మిత్రులిర్వురు దర్శనమయినందులకు మిగుల సంతసించుచున్నాను.

ఈవలికోలాహలమించుక యడగిన పిదప సుందరి మేడలోనికరిగి

పరిశోధనము గావింప వారు నిశ్చయించిరి. నూతన మిత్రులిర్వురును దోడ్కొని మేక్సిము మేడమీఁదికెక్కి భోజనాగారమున బ్రవేశించెను. మిత్రులలో నొకఁడు దీపము వెలిగించెను. అందెవరును లేరు. అచటి బల్లపై భోజన పాత్రములు మాత్రము పేర్చబడియుండెను. కాని అందేపదార్థము చూపట్టలేదు. పైగదుల తల్పులన్నియు బంధింపఁబడియుండెను. మేక్సిము నూతన మిత్రు లిర్వురు యింటివారి నుద్దేశించి కేకలిడుచుండ నింతలో పోలీసు లచటికి వచ్చిచేరుకొనిరి. క్రిందనున్నవారు దొంగల వృత్తాంతమంతయు వారికి బోధపఱచిరి. పోలీసుల సాయములేనిదే మేడను దాను సోదాచేయరాదని గ్రహించి మేక్సిము సహచరు లిర్వురతోఁ గ్రిందికి దిగెను.

రక్షకభటులు లోపలఁ బ్రవేశించిరి. సౌధాభ్యంతరము ఘోరాంధకారబంధురమై యుండెను. ఇంతలో బయిడార్డుకూడ నొక లాంతరును గొని వచ్చెను. కచేరి భోజన గృహము ప్రసాధనాగారము మున్నగు తావులను పోలీసులు బాగుగ వెతకి చూచిరి. ఎందును ఎవరును కానఁబడలేదు. పదఁపడి అందఱు మేడవెనుకతట్టుననున్న ఉద్యానముఁ బ్రవేశించి, దానిని కలయ వెదుకఁజొచ్చిరి. ఎవరును దృగ్గోచరులు-లేరు. మేక్సిము అనుచరులు లాంతరుపైకెత్తి చెట్టుకొమ్మలను, చుట్టు గోడను బరీక్షింపఁదొడఁగిరి.

« అదిగో గోడకొక నిచ్చెన యున్నది.» అని మేక్సిము కేకవేసెను.

« పాఱిపోయిరి! గోడ కావలివైపున పెద్ద మైదానమున్నది. ఈ పాటికి వారు చాలదూరము సాగిపోవుదురు» అని బయిడార్డు పలికెను.

పోలీ సొకడు ప్రాకారమెక్కి పరీక్షించెను. అవలితట్టు గూడ నట్లే నిచ్చెన యొకటి వేయబడియుండెను. ఇంటిలోనివారు పాఱిపోయిరని స్పష్టముగ నందఱికి బోధపడెను. పోలీసుల యత్నమం

తయు వ్యర్థమయిపోయెను. అందుగూడినవారి పేరులను వ్రాసికొని భటనాయకుఁ డనుచరులతో నందుండి నిష్క్రమించెను. మేక్సిము కూడ తనపేరును విలాసమును నొసగెను. కాని ఆ నాఁటి రాత్రి తానుచూచిన విపరీత సంఘటనములనతఁడు పోలీసులకడఁ బ్రకాశ మొనరింపలేదు. బయిడార్డునకు తగుబహుమాన మొసఁగి తనకై వేచి యున్న అద్దెబండినెక్కి అతఁడు వెడలిపోయెను. పోవుతఱి నూతన మిత్రుల నాతఁడు తన నిలయమునకు విందునకై యాహ్వానించెను.

## 2

ఆరాత్రి తాను గాంచిన విచిత్రసంఘటనము లాశ్చర్యసంభ్రమ సంశయములకు జోటొసంగుచుఁ జిత్తమును విచలితముజేయుచుండ మేక్సిము నిజావాసముఁ జేరి పరుండెను. కాని కన్నులుమూసినను, విని ద్రావస్థయందే యతఁడు శేషించిన రేయి గడుపవలసి వచ్చెను. ప్రభాతమున నతఁడు కనులు నులుముకొని లేచెను.

అపుడు కూడ నతఁ డెంతగాఁ జిత్తశాంతి చేకూర్చుకొన యత్నించినను గత రేయి యద్భుత విశేషములను గూర్చిన తలంపులే చిత్తమున బర్వులెత్తఁ దొడఁగెను,—"నాటకశాలలో దర్శన మొసఁగిన యాత్రిలోక సుందరి బొరిమపు దొర కహితయగుట నిజము. దొర బారినుండి యారమణి కౌశలముచ రాబర్టు నుద్ధరించినది. మనోమోహినియగు నాసీమంతిని కుట్రదారుల సహకారిణి యయిన విచ్ఛిన్న హస్తయగు కాంతకు సఖి. కాని కార్యదర్శియగు రాబర్టునకును నామెకును సంబంధమేమి? ఆయువకుని కొసరమై యేల నానెలఁత విపదబ్ధిని లంఘించినది? ఇద్వరి నడుమ నెట్టి బంధ

నను లేకున్న యెడల నిట్టిసంఘటనను ఘటింపఁజాలునా? యోచించి చూడ యువకుఁ డాతరుణీ ప్రేమాస్పదుఁడనిగాని, ఆమె దుష్కృతి యందు సహచరుఁడనిగాని తోఁచుచున్నది. ముగ్ధహృదయయైన ఎలిసు కుమారిని రాబర్టు వంచించివైచినాఁడు—అతఁ డాబాలపవిత్రపాణి పద్మమునందుట కర్హుఁడుకాఁడు. దొంగల నాయకియయిన నా యపూర్వ సుందరియొక్క ప్రేమాభిలాషి కానియెడల—ఆమెకుఁజిత్తవి క్రయ మొనరింప కున్న యెడల, విడుదలఁబడసిన పిదప నామెనుగూడి యతఁ డదృశ్యుఁడు కానేల? ఆరూపతరంగిణి కింకొక రహస్యభవన ముండియుండును. ఆమెయా నిగూఢ ప్రదేశమునఁ దన ప్రేమోపాసకుని దాచి అతనిఁ గూడి సుఖవనధి మునుఁగుచుఁ దేలుచు నుండవచ్చును. ఆహా! యోజించినకొలఁది నాహృదయము పరితాప పరిపూర్ణ మగుచున్నది. రాబర్టు అపరాధియనుటలో మాతులుఁడు అన్యథా తలంపలేఁడు. నేనే భ్రాంతిచేతస్కుఁడనయి యీదుష్టునిఁ గాఁపాడ యత్నించుచున్నాను. ఆహా! ఎలిస్! కుసుమకోమల హృదయవగు నీవు దేవునిగ భావించి యెవని చరణతలమున నీజీవన సర్వస్వమును సమర్పణ మొనరించితివో అతఁడునిన్నిట్లు గరళమహోదధి ముంచివైచెను! ఇంచుకైన వెనుక ముందు లాలోచింపక యీదుర్మార్గుని పక్షము సమర్థింప దొరకొని నేనెట్టి మూర్ఖుఁడనైతిని! వీని గుణము నిజముగ సంశయింపఁదగినది. ముందే సంశయించితిని. కాని ఇయల్టా దేవి వేఱుతలఁపును నామనసునఁజొనిపి, అమాయకురాలయిన నాబాల చిత్తమునుగూడ మునుపటి తలఁపునకు మరల్చివైచి, నిర్వాణోన్ముఖమయిన ఆమెప్రేమ ప్రదీపమున తైలముపోసినది. కడచినరేయి విపరీత ఘటనములు నిస్సంశయముగ రాబర్టునకుఁ బ్రతికూలములయి కన్పట్టుచున్నవి.

అనుతాప విదగ్ధ హృదయుఁడైన మేక్సిమిఁక తడయక ఇయల్టా

దేవి కామె యస్త్రశిక్షకుని విశ్వాసఘాతుకము నెఱింగించి, పిదప ఎలిసు పాలికరిగి ఆమె మోహాతురీచికను మటుమాయము గావించి నై రాశ్యపీడిత చిత్తుఁడయిన విగనరీ కాశ్వాస మొసఁగవలెనని నిశ్చయించుకొనెను. సంకల్పానుసార మాచరింప నతఁడవ్వలికి జనఁదగు వలువలు ధరించుచుండ పరిచారకుఁ డరుదెంచి ఎవరో పెద్దమనిషి ఆతనిదర్శన మపేక్షించుచు వెలుపల వేచి యుండెనని తెలిపి వానిచేతి యందొక చీటినుంచెను. దేవి చికిత్సకుఁడగు విలాగస్ పేరుజూచి అత నిరాక కేదేని ముఖ్యోద్దేశ ముండునని యూహించి వానిని గొని రమ్మని యువకుఁడు పరిచారకుని కాజ్ఞయొసఁగెను. వైద్యుడు మేక్సి మున్న యాగారమునఁ బ్రవేశించెను.

వైద్యుఁడు—హఠాత్తుగ నన్నిందుఁజూచి మీ రాశ్చర్యపడు చున్నారు కాఁబోలు.

మేక్సిము—ఆశ్చర్యమే కాదు —ఆనందము కూడ పొందుచు న్నాను.

"మీ కాప్తులగు నొకరివార్తఁదెలుప వాంఛింపనియెడల నేనీసమ యమున నిచటికి వచ్చువాఁడను గాను."

"ఇయ్యట్టి దేవిని గుఱించి చెప్పుదురను కొనెదను—ఆమె యెట్లు న్నది?"

"బాగుగనే యున్నదను కొనెదను.—నేటి యుదయమునుండి నేనా మెను చూడలేదు!!

"పాపమామె లేవలేని యవస్థయం దుండుటగాంచి మిగుల విచా రించితిని."

"అట్లయిన మీరామెను జూచియున్నారా?"

యువకుఁ డధరదంశన మొనరించుకొనెను. కాని యిఁక గుట్టునిలు పుకొను నుపాయములేదు. అతని సంకల్పము వ్యర్థమైపోయినది. అంత

రంగమందలి భావము నాననమునఁ దోఁపనీయక అతఁడిట్లనెను. "అవును, ఆమెను జూచితిని; కాని నేను మీమాట మఱువలేదు. ఆమెతో విశేషకాలము ప్రసంగింపలేను."

"నామాట పాటింప కున్నందుల కామెను నేనేమియు మందలింపను. దానివలనఁ బ్రయోజనము లేదు. ఆమె నామాట వినునది కాదు. మీపై నామెకుఁ బ్రీతిమెండు. చిత్తము నప్పుడప్పు డన్యథా మరల్చుచుండిన యెడల సత్వరమే స్వస్థత చేకూరునని ఆమె యభిప్రాయము!— నేనిప్పుడామె విషయమై ప్రసంగింప మీయొద్దకు రాలేదు."

"అట్లయిన నెవరినిగుఱించి ప్రసంగించుదురు?"

"రెండు నెలలకు మున్నొకనాటి సాయంకాలమున నాటకాలయములో మీకొక సౌందర్యతిలకను జూపించితిని.—జ్ఞాపకమున్నదా?"

"చిత్తము"

"మఱునాఁటి యుదయమున నాయువతి చతురతగుఱించి చెప్పుచు నామె యుదంతము నెఱుఁగ మీరు కుతూహల పడితిరిగదా! పిదప మీరామెను కలిసికొన్నారా?"

ప్రశ్నకు యువకుఁ డబ్బురపడి గుట్టుబయల్పెట్ట దొరకొనక "మఱొకమాఱామెను నాటకాలయమునఁ జూచితి" ననెను.

"మీరామెతో ప్రసంగించినారా?"

"లేదు. ఆమెతో నపుడొక విదేశీయుఁ డుండెను."

"ఈ విషయమున నిఁక సందియము లేదు" అని మెల్లఁగఁ దనలో ననుకొని చికిత్సకుఁడు ముహూర్తకాల మూరకొని యేదియో యోచింపఁ దొడఁగెను.

మేక్సిము—మీరా కాంత నెఱుఁగుదురా?

"నాకుఁ బరిచితుఁడయిన వ్యక్తియొక్కఁ డామె నెఱుఁగును. ఆమెను గుఱించి అతఁడొక యద్భుతమైన కథను జెప్పినాఁడు. దానిని మీకుఁ

దెలుప నరుదెంచితిని. స్వచ్ఛంద విహారిణియగు నాసీసుంతిని రహ్యా దొంతము వారియెడవిద్రోహమూహించిన విలాసినులలో నొకతె!"

మేక్సిము అబ్బురము నభినయించి—ఏమి! ఇది నమ్మఁదగినదే? ఆసుందరినిగురించి మీ మిత్రుడు తెలిపినది సత్యమైన యుదంతమేనా?" అనెను.

"అతఁడు తెలిపినది సత్యేతరముకాదు. ఇప్పుడేఅది ఋజువు చేయ గలను."

"సుందరిమరల తన నిలయమున కరుదెంచెనని అతఁడు తెలిపెనా?"

"తెలిపెను. దాని నెఱిగించుటకే నేనిపుడిచటికి వచ్చితిని. నిన్ననే యామె యరుదెంచెను. ఇపుడామె తనగేహమున నున్నది."

"మీ మిత్రుఁడు పొరబడినాఁడు. ఆమె యిప్పుడా సౌధమున లేదు."

"నిన్న సంధ్యాసమయమున ఆమె యందుండెను—రాత్రి సమయ మున నామె యవ్వలి కరిగియుండును. ఇపుడా స్త్రీ పేరిసునగరమున కేలయరుదెంచెనో ఎఱుఁగుదురా? సహచరుల నాసదనమునఁ గలిసి కొనుటకే ఆమె విచ్చేసినది.—నాకీయుదంతముఁ దెల్పిన వ్యక్తినా కంటె మీకధిక ప్రియుఁడు. అతఁడు మీ యంతరంగ మిత్రుఁడను కొనెదను."

"ఎవరతఁడు?"

"రాబర్టు."

"ఏమి! రాబర్టా?"

"అవును. ఆ యువకునికి శుభముఁగూర్ప యత్నించుచుండు ఇయ ల్టా దేవి నిజముగ భ్రమలోఁబడి నట్లిపుడు గ్రహింపఁ గలిగినారా?"

"దేవి యతని హితకాంక్షియను సంగతి నే నెఱుఁగనే యెఱుఁ గను"

స్మితముఖుఁడై చికిత్సకుఁ డిట్లనెను. "అవును—అవును—సంగతి గుట్టుగనుండ నామె మీతోఁ జెప్పియుండెను. తా నొనరించు పూనికను నే నంగీకరింపనందున నాయెడ నామె యవిశ్వాసమూని యున్నది. రాబర్టును వెతకి పట్టుకొందునని మీరు మాటయిచ్చినట్లు కూడ నే నెఱుఁగుదును. నా కేదియుఁ దెలియకుండను లేదు"

"ఆర్యా! మీ రేమనుచున్నారో నాకు బోధపడుటలేదు" అని మేక్సిము కంపితస్వరమున పల్కెను.

"మీరు కడుజాగరూకులని విదితమయినది. 'దేవి నా కంతయు సవిస్తరముగఁ దెలిపివేసినది. అందుచే మిమ్ము దానిని గుఱించి ఏమియు నడుగఁదలఁచు కొనలేదు. మీరు మిక్కిలి యాతురతతో నెవరిని వెదకుచున్నారో, వారిని గుఱించి ముఖ్యవార్తఁ దెలుపవచ్చితిని—రాబర్టిపుడెచట నున్నాఁడో నేను బాగుగ నెఱుఁగుదును"

"ఎచట నున్నాఁడు?"

"అతనిని గుఱించిన జోక్యము మీ కేమియు నక్కఱలేదని ఇంతకుమున్నే కదా మీరు తెల్పితిరి. వానియునికి నెఱుఁగుటకై మీరింత తొందరపడుచుంటి రేల?"

మేక్సిము మస్తకము నవనత మొనరించెను. చికిత్సకుఁడు రహస్యమును జాలవఱకు భేదించెననియు, దేవికాతఁడు విశ్వాసభాజనుఁడగుటచే నామె నిగూఢోదంతమంతయు దెలిపియుండునని యువకుఁడు గ్రహించెను.

చికిత్సకుఁడు—భయపడకుఁడు. మిమ్ము కార్యమున నియుక్తులను గావించి దేవి యనుచిత మొనరించినది. జరుగఁదలఁచినది జరిగిపోయెను. ఇపుడు మీకు నేను దోడ్పడ వాంఛించుచున్నాను. తలఁచుకొంటినేని, కార్యదర్శిని నేను సుందరి చేతులనుండి తప్పింపఁజాలుదును. పాప మాయువకుఁ డాలతాంగి జాలమునఁ జిక్కి యున్నాఁడు.

వాని నిపుడు బయటకుఁ గొనివచ్చి అమెరికా దేశమున కనుపఁజాలు దును. అతఁడు నిర్దోషియని ఋజువుసేయు యత్నమును, వానిని మీ మాతులేయకుఁ గట్టఁబెట్టు సంకల్పమును వదలుకొంటిరా ?"

"నిజముగ వదలుకొంటిని"

"మంచిది. ఇపుడు సుందరివిషయమై ఇంచుక యోచింపవలయును. ఇపుడామె తన రెండుమేడలలో నొక దానియందున్నదని తలఁచు చున్నాను"

"పథపార్శ్వమందలి నిర్జనసౌధమున నామె లేదని నొక్కిచెప్పఁ గలను"

"అట్లైన నామె కార్యదర్శినిఁ దనచెంగటఁ జిక్కఁ బట్టియున్న తావునకు మన మరుగవలయును"

"ఎప్పుడు ?"

"నేఁటి రాత్రి కొంచెము చీఁకటిపడిన పిదపఁ బోవుదము. మన మాస్త్రీయిలు సొచ్చుట లోకులు చూడరాదు. ఈవీధి కుత్తరమునఁ గల పల్లెయందామె యిపుడున్నది. ఆ పల్లెను మీ రెఱిఁగియుందురు"

"ఏమి అట్టిసుందరి యాపాడు పల్లెయందు వసించుచున్నదా ?"

"అవసరమైన నామె రత్నాలంకారవిభూషితయై, లోకుల చిత్తము నాకర్షించును. లేక భికారిణీ వేషముధరించి మార్గములవెంటఁ గ్రుమ్మరుచు బిచ్చమెత్తఁ దలఁపడును. స్వార్థసిద్ధికై విద్రోహపరతంత్రయైన విలాసిను లెట్టిపనికైన వెనుదీయరు"

"నిక్కముగ వారి చరిత్ర మద్భుతముగ నున్నది. సుందరినిగుఱించి మీరిన్ని విశదములను వాకబుచేయు టాశ్చర్యముగఁ దోఁచుచున్నది."

"మిత్రునియొద్ద ఆమెను గుఱించిన యుదంతమంతయు నాకుఁ దెలియవచ్చినది. ఒకప్పుడతఁడాసుందరి వలపులఁ బూర్తిగఁ జిక్కువడి,

ఉన్మత్తునివలె నుండువాఁడు కాని విద్రోహినుల తెగయందలి వనిత యని యెఱిఁగినవెంటనే హృదయమునుండి అతఁడావ్రిణయప్రతిమ నుదుడిచివేసినాఁడు. ప్రాన్సునందామె కెట్టి యాపదయు ఆపాదింపనే రదు. ప్రేమాస్పదుని ప్రోలపాలియికముగ నిజకళీయుల నృశంసక్రి యోదంతముఁ దెలుపుచు ఆమె సంతసపడుచుండెడిది''

"కొఠీయందు జరిగిన చౌర్యమును గుఱించి ఆమె ఏమియుఁ జెప్ప లేదా ?"

"లేదు. గతవత్సరము గ్రీష్మకాలమున నామెకు స్నేహితునితో నేర్పాటు కలిగినది. కలిగిన నాఁటి నిశీథమందే యీ దొంగతనము జరిగినది.—సరే, ఆ మాటకేమి—మీరచటికి రాఁదలఁచుచున్నారా లేదా ?''

"తప్పక రాదలఁచుచున్నాను—మనమిద్దఱ మెచటఁ గలిసికొన వలయును ?''

"సర్కసునందు రాత్రి రెండుయామము లప్పుడు నన్నుఁ గలిసి కొనఁగలుఁగుదురా ?''

"ఆఁ''

"మంచిది. అందుండియే మనము సుందరిగృహమున కరుగుదుము''

"ఏ విధమున సుందరినిఁ జేరఁజనవలెనో పదపడి వారు ప్రసం గించుకొనిరి.

మాటల సందర్భమున మేక్సిము "ఇయల్లాదేవి యధీనమునఁ బని చేయు వారందఱు విశ్వాసయోగ్యులేనా ?" అని యడిగెను.

"అందుకు సందేహమేమి ? ఆమె కొఱకై ప్రాణముల నర్పించు టకైన వారు వెనుదీయరు''

"ఆమె యస్త్రశిక్షకుఁడు కూడ విశ్వసనీయుఁడనియేనా మీయభి ప్రాయము ?"

"అతఁడును అందఱివంటి వాఁడే!"

"నే నాతని నొక్కనిని మాత్రమే చూచితిని—అతఁడు పోలండు సీమవాఁడా?"

"అవును. మిగుల నుత్సాహము కలవాఁడు.—అతఁడు విద్యార్థులదళములోని వాఁడుకాఁడు."

"సుందరికిని అతనికిని ఎట్టి సంబంధము లేదా?"

"వారిరువురకు నెట్టిసంబంధముగాని ఎందులకుండును? అతఁడెచటికిని అరుగువాఁడుకాఁడు—కాని, ఆర్యా! తామట్లు ప్రశ్నించితిరేల?"

"సుందరితో వానిని జూచినట్లు జ్ఞాపకము వచ్చినది. అపుడతని వేషము మిగుల నాడంబరముగా నున్నట్లుగా కూడ జ్ఞాపకము. ఒకవేళ పొరపడితినేమో తెలియదు."

"నిజముగఁ బొరపాటే. అతఁడు రాజపుత్రవేషధారియై వచ్చినను సుందరివానిఁ గూడి బహిరంగమునఁ జరింపదు."

వైద్యు—సుందరి నిలయము దనుక నాతఁడుకూడ చనెనని యూహించి రనుకొనెదను.

"ముందట్లే యూహించితిని—కాని, యిపుడు నే నట్లు తలఁపను"

హఠాత్తుగ భిషక్కునయనద్వయము ప్రదీప్తమై పోయెను. ఏదే నిగూఢ విషయమునకు వలయుప్రమాణముఁ బడయఁ జాల దినముల నుండి యత్నించుచు, ఇపుడుదాని నందఁజాలెనని చూచువారికిఁ దోఁచురీతి వానిమొగము కన్పట్టెను!

చికిత్సకుఁడు—ఇపుడు చడిచప్పుడు లేకుండ మన మీపని చేయవలయును. నడిరేయి యగుసరికి నర్కసులోఁ గలిసికొనవలెను. ఇదే నిశ్చయము. ఇఁక నే నరిగెదను—చాలరోగులను జూడవలసి యున్నది."

"తప్పక నర్కసునందుఁ గలిసికొనెదను."

"మంచిది. ఇయల్టాదేవి పల్లి చూచుటకై చనును. నేఁడువర్షము కురియుచున్నది. తోడ్తోడనే శీతవాతులము కూడ ప్రబలమైనదికాని, దేవి తనపయన మాపునదికాదు. ఇపుడు పదిన్నర గంటలాయెను. ఈ పాటికామె గమ్యస్థానముఁ జేరియుండును. ఆమెను మనము రేపు కలిసికొందము."

ఇయల్టాదేవి స్థానాంతరమునకుఁ జనిన కతన మేక్సిము పూర్వ సంకల్పము పరివర్తన మాయెను. చికిత్సకుఁడు నిష్క్రమింపఁగనే, అతఁడు మాతులాలయమున కరిగెను. వర్జర్సాతనిఁ జూచి, "తండ్రీ! విచ్చేసితివా? నిన్నుగుఱించి కొన్ని విచిత్రవార్తలను విన్నాను" అనెను.

"అవేమి?—నే నొనరించిన దేమి?"

"చాలగా నొనరించితివి! రాబర్టు నిర్దోషియనియు, నిర్హేతుకముగ నతఁడు నిర్వాసితుఁడాయెననియు నీవు నాపుత్రికిఁ జెప్పితివి. నీ నుడువులను విశ్వసించి, విగనరీని పరిణయమాడుట కామె యిపుడీయకొనుటలేదు. ఆమరణము కన్నెయై, యుండునని భయసంశయములు లేక ఆమె వాక్రుచ్చుచున్నది. ఆమె నిశ్చయమట్లే యుండుచో, మాయిర్వురి సుఖజీవనములపై గరళధార వోసినట్లుబ్బుచు, గర్వమున మెలఁగఁ జాలుదువు. మా యిరువురమా టటుండ, నీనేత్ర కాని యాశలన్నియు నడుగంటఁ జేసితివి. ఒక్క యాఘాతమున నా కూర్మితనయభావి సౌఖ్యమును నష్టమొనరింప నీ వేల పూనుకొని నావు? కన్నవానివలె ప్రేమతో నిన్నుఁ బెంచుచు వచ్చినందులకా తండ్రీ! నీ విపుడు నా కిట్టి ప్రతీకారము గావించితివి?

"నిజముగ నే ననుచిత మొనరించితినని యొప్పుకొను చున్నాను."

"నీవు తలపెట్టిన దంతయు, నిట్లు తప్పిదము నొప్పుకొని నంతనే తీఱిపోవునని యనుకొనుచున్నావా?"

"అట్లను కొనుచుండుటలేదు. నే నొనరించిన చెయిదమునకుఁదగు ప్రాయశ్చిత్తమొనరింప సమకట్టియే ఇచటికి వచ్చితిని. నా యుద్దేశము విఫలము కానేరదు. నేనీ విషయమునఁ జేయఁజేసికొనక మున్న న్నతీఱున నంగతులన్నియు మాఱిపోవును—నామాట నమ్ముఁడు"

"కార్యము మించినది. నీ వపుడు భ్రమను జిక్కినట్లు కుమారికిఁ దెలిపినను, ఇపుడామె నీ మాటలఁ జెవిఁబెట్టదు"

"ప్రత్యక్ష ప్రమాణమును బడసిన యెడల, నానుడువుల నాలించి నిశ్చయముగ నామె ప్రస్తుత సంకల్పమును మార్చుకొనును. మంద సమునుండి పత్రముల పేటిక నపహరించిన రమణికిఁ గార్యదర్శి సహ కారియనియు, ఆమె ప్రేమ భిక్షుకుఁడనియు రూఢిపఱచుటకు వలయు ప్రమాణములు నాకడనున్నవి. నే నిపుడు చెప్పఁబోవు గూఢవృత్తాం తమును విని మీరు మిక్కిలి యక్కజ పడకమానరు. ఇనుపపెట్టె నుండి పత్రముల బరణి, ఏఁబదివేల నాణెముల నోటులకట్ట అపహ రింపఁబడకమున్నొకమాఱు చౌర్యయత్నము జరిగియున్నది. విగనరీ, నేను, అందులకు ప్రత్యక్షప్రమాణమును బడసితిమి."

"ఆవిషయమును నాతో మీ రేల చెప్పితిరి కారు?"

"విగనరీ చెప్ప నుద్యమించెను గాని వలదని నేనే వానినివారిం చితిని."

పదంపడి యువకుఁడు ఛిన్నహస్త వృత్తాంతమంతయు మాతులు నకుఁ దెలిపెను. అత్తఱి సేవకుఁ డరుదెంచి "బారిషవు దొర మీ కొఱకై వచ్చి, వేచియున్నాఁడు.—మిక్కిలి యవసరమైన పనియున్న దఁట" అనెను.

మేక్సిను—రమ్మని అతని కనుమతి యొసఁగుఁడు. మీ రిర్వురు ప్రసంగించుకొను తఱి, నేను దాపున నుందును. అతఁడు మీ పూర్వ కార్యదర్శిని గుఱించి ఏదేని చెప్పవచ్చెనను కొనెదను.

"నీవిట్లను కొంటివేల? నాకడ అతని విత్తము చాల జమలో నున్నది.—అందుచే నతఁడు కోశీ పనిమీఁద వచ్చి యుండును."

"కోశీ పనిమీఁద రాలేదని నాయభిప్రాయము. మీ రిర్వురు ప్రసంగించుకొను తఱి నన్నుఁ గూడ నిందు గూరుచుండ నిచ్చితిరేని, క్రొత్తసంగతు లెన్నేని మీకుఁ దెల్లము కాఁగలవు."

"ఒకవేళ అతఁడు రహస్యముగా మాటాడఁ గోరిన యెడల నీవు పోయి నాగదిలోఁ గూర్చుండుము. పిదప నీవిషయమున మనము మాట్లాడుదము." అని కోశీవతి ద్వారను గొనిరమ్మని పరిచారకుని కాజ్ఞ యొసఁగెను.

ద్వార ప్రవేశించి, అభివాదన మొనరించి, "ఆర్యా! నేఁటి సాయంసమయమున నేను స్వదేశమున కరుగుచున్నాను. పోవక మున్ను మీదర్శన మభిలషించి వచ్చితిని." అనెను.

"దయచేయుఁడు—ఇతఁడు నామేనల్లుఁడు. మీ రిష్టపడినచో మనము మాటలాడుకొను నపుడితఁ డిందుఁ గూరుచుండును."

"ఇంతకు మున్నొకమాఱు నే నీ యువకునిఁ జూచితిని. నే నిపుడు చెప్పఁబోవు వృత్తాంతమున నీతనికిఁ గూడఁ గొంత సంబంధమున్నది. అందుచే నితని నిందుఁ గాంచి, మిగుల సంతసించుచున్నాను.—నేను పేరిసు వీడి ఏల వెడలిపోవుచున్నానో మీ రెఱుఁగుదు రనుకొనెదను."

"ఎఱుఁగను."

"మా ప్రభుని ప్రాణములఁ దీయ మఱొక కుట్ర గావింపఁబడినది. విద్రోహు లతఁడుండు ప్రాసాదమునకుఁ జిచ్చు ముట్టించిరి. అదృష్ట వశాత్తు సామ్రాట్టు జీవములతో నీవలఁబడెను. కతిపయ సైనికులు మాత్రము అగ్నియందు మరణించిరి."

"ఎంత ఘోరముఁ దలపెట్టిరి!—ఎట్టి విద్రోహముఁ బూనిరి!"

"ఇట్టి విద్రోహుల నణఁప నిశ్చయించి, మా సార్వభౌముఁడు,

ప్రభుభక్తిపరాయణుల నాహ్వానించి, వారి సాయముఁ గొననున్నాఁడు. అట్టి వారిలో నే నొక్కఁడను"

"మీకు మంగళమగుగాక! మనుజుల ధనప్రాణములఁ గొను నరాధములెట్టి నిష్ఠురదండనమునకైన నర్హులు—ఇపుడు మీవిత్తముఁ గైకొనవచ్చితి రనుకొనెదను. ఇపుడే మీకు దాని నొసఁగుదును."

"పైకమును తీసికొనుటకే గాక మఱొక విషయము గుఱించి మాట్లాడుటకై కూడ వచ్చితిని.—రెండేండ్లనుండి నేను పేరిసు నగరమం దేల వసించుచున్నానో యెఱుఁగుదురా?"

"ఇందు సుఖముగ, స్వచ్ఛందముగఁ గాలముఁ గడుపవచ్చితి రను కొనుచున్నాను."

"మీరు పొరపడినారు. దొరతనము వారి యాజ్ఞ నొదలఁబూని విద్రోహమునకుఁ దొడరిన విలాసినుల జాడలఁ గన్గొనవచ్చితిని."

"రాజనీతి విశారదులగు మీవంటి వారిపై నీకర్తవ్యమిడి మీ రాజన్యుఁడు కడుంగడు సమంజసకృత్య మాచరించెను."

"కేవలము రాజనీతిజ్ఞులవలన నీకష్టకార్యము కొనసాగనేరదు. నేను మాదేశ రాజదూత సహచరుఁడను గాను.—మాదేశ రక్షకోద్యోగుల ప్రతినిధిని.—పోలీసు శాఖయం దుండువాఁడను."

మొగము విఱిచికొని, "ఏమి మీరు పోలీసు శాఖవారా?" అని వర్జర్సు పల్కెను.

"మీకు నే నొసఁగిన నగలపెట్టియం దత్యవసరములైన పత్రములు కొన్ని కలవు; విదేశమందు దాఁగియున్న విద్రోహుల పేరుల పట్టిక, వారు కావించు కుట్రల వివరణము అందు విశదీకరింపఁబడి యుండెను."

"ఇట్లని నేను ముందే ఎఱిఁగియున్న యెడల,—"

"—నాపెట్టెను దాచకపోవువారు.—అట్లని నేను ముందే

గ్రహించితిని. పత్రముల పేటిక అపహరింపఁబడెను గదా. మీయధీనమునఁ బనిజేయు నుద్యోగులలో నొకఁడాపోంగతనమునకుండెను. మీరు కూడ నట్లే తలఁచి, మీకార్యదర్శియగు రాబర్టే ఆపనిఁ గావించెనని చెప్పియున్నారు.''

"ఇపుడు కూడ నే నట్లే తలఁచుచున్నాను. ఆదొంగతనమును రూఢిపఱచుటకు వలయు ఋజువులు నామేనల్లుని కడనున్నవి."

మేక్సీను ముఖమునఁ దీవ్రదృష్టిఁ బఱపి దొర "అటులా! అట్లైన నాయనుమానము మిథ్య కాదు.—ఇతఁడు కూడ నీకృత్యమున నున్నాఁడు."

"ఏమనుచున్నారు?" అని మేక్సీ మించుక క్రోధస్వరమునఁ బలికెను.

"ముందుగనేఁ జెప్పునది వినుఁడు.—మీకంతయు బోధపడును. రాబర్టు చౌర్య మొనరించిన విద్రోహుల సహకారి యనుటకుఁ దగు ఋజువులు నాయొద్దనున్నవి. నే నాతని వెతకిపట్టి, చాల దినములు నాయావాసమున బంధించియుంటిని.''

"ఇట్లని నాకుఁ దెలిపితిరి కారేల?"

"తెలుపవలసిన అక్కఱ లేక పోయినది. ఈవిషయమునఁ గావింపవలసిన పరిశోధనాభారమంతయుఁ దాము నాపైఁ బడవైచితిరి. నిజాపరాధమును వానిచే నొప్పింప నూహించి, అతని మీకప్పగింపకుండనుండుటకు సంకల్పించుకొంటిని. కాని నిజహితవర్గమువలని భయమువలన నతఁ డేమియుఁ బ్రకాశము కావింపలేదు?—అందుచే నాసంకల్పము సిద్ధింపలేదు.''

"ఇపు డాతని నేమి చేయఁదలఁచుచున్నారు.—ఈనగర పోలీసుల కాతని నొప్పగింపఁదలఁతురేని, నే నందుల కభ్యంతరము పెట్టను. కాని—"

"అతఁడు పలాయన మొనరించెను!"

"ఈవార్తఁ దెలిపి, నాకు మీరెనలేని యుపకారముఁ గావించితిరి. ఇప్పుడు నేను జాగరూకుఁడనై యుందును."

గత రేయి చిత్రఘటనమును, రాబర్టు పలాయనవృత్తాంతమును విపులముగఁ దెలిపి, దొర యిట్లనెను. "మాదేశస్థునివలె ప్రచ్ఛన్న వేషిత్తై వచ్చి, నన్ను మోసగించినవాఁడు విద్రోహులలో నొకఁడని నాకిపుడు తెల్లమయినది."

"నేను సరిగ గ్రహింపఁగలిఁగితిని." అని యువకుఁడు పల్కెను.

"అట్లైన, మీరతని నెఱుఁగుదురా?"

"ఎఱుఁగను గాని చూచితిని."

"అనుగ్రహించి అతని నెందుఁ జూచితిరో తెలుపుదురా?" అని దొర వ్యంగపూర్ణ సౌజన్యస్వరమునఁ బల్కెను.

"నిన్న మీతోఁ గలిసి అతఁడు హోటలున భోజన మొనరించుచుండఁ జూచితిని. నాటకశాలవఱకు నేను మీవెన్నంటి వచ్చితిని."

"అట్లైన, మీరు కూడ అపరాధపరిశోధనము సలుపుచున్నట్లు తోఁచుచున్నది."

"అట్లే తలఁపుడు. రహస్యమును భేదింపవలెనన్నఁ బరిశోధనము సలుపు టనివార్యము కాదా?"

వర్గస్సు—యువకా! ఎంత—

దొర—అతని కడ్డురాకుఁడు.—చెప్పఁదలఁచినఁ దానిని జెప్పనిండు. అతనిని గొన్ని ప్రశ్న లడుగవలయును.

"నే నెంత దూరము మిమ్మనుసరించియుంటినో యెఱుఁగఁ గోరుచుంటి రనుకొనెదను.—అయ్యా! నే నంతయు నెఱుఁగుదును. జరిగినదంతయుఁ గన్నులారఁ జూచితిని."

"మీరు కడు ధన్యులు. విద్రోహులు యోగ్యుఁడైన ఒకసహా

కారిని బడిసిరి."

"విద్రోహులకును నాకును ఎట్టి సంపర్కములేదని తాము బాగుగ నెఱుఁగుదురు."

"'లేదు.' అని మీరు నొక్కి చెప్పుచుండ, మీమాటను నమ్మ తీరవలెను. పాపము నాకుఁ దోడ్పడుటకే మీరు నడిరేయివఱకు మేల్కొని యుండిరి కాఁబోలు!"

"అట్లు ప్రసంగింపకుఁడు.—మీ రొక వ్యక్తిని బలవంతముగ బంధించితిరని వింటిని. అతఁడు నిరపరాధి యని భావించితిని. మీ రాతని బంధించి ఏమి చేయుదురో ఎఱుఁగఁ గౌతుకపడితిని."

"మంచిది—ఇపుడు రాబర్టు విషయమై మీయభిప్రాయమేమో ఒకమాఱు వినిపింతురా?"

"గతరాత్రి తన చాతుర్యము చూపి నిమ్ము వంచించిన రమణి కాతఁడు మిత్రుఁడు."

"బాగు! బాగు! చౌర్యము, గృహదహనము, నరహత్య మున్నగు ఘోరదుష్కృత్యములం దాఱితేఱిన విద్రోహులలో నామె యొక్కతె యని మీరు కూడ విశ్వసించుచున్నారా?"

"నిజముగ నట్లే విశ్వసించుచున్నాను — అందులకుఁ దగు ఋజువులుకూడ నున్నవి!"

"అ వేమో తెలుపుదురా!"

"తెలిపినందున ఫలమేమి? ఇఁక దేశమునకుఁ దిరిగిరాని నిశ్చయముతో మీ రిందుండి వెడలిపోవుచున్నారు. కతిపయసంఘటనముల వలన మీకుఁ దెలిపిన విధమున సిద్ధాంత మొనరించితిని. వాని నన్నియు నిపుడు విశదీకరింపనక్కఱలేదు —రాబర్టునకీ దొంగతనమున సంబంధ మున్నదని నా దృఢవిశ్వాసము. మాయలాడి మీ చేతులనుండి అపరాధిని దప్పించి వైచినది—ఇపు డతఁడానుందరి

చెంగట నున్నాఁడు.''

"తగు విషయములనే గ్రహించితిరే!"

"మీకంటె నధికముగ గ్రహింపలేదు.''

"రాబర్టు రష్యాదొరతనమువారియెడ విద్రోహము పూనెనో లేదో కాశీపతి కక్కఱలేదు. కాని వర్జర్సుగా రతఁడొనరించిన చౌర్యమునకుఁ దగు ప్రమాణముఁ గోరుచుండె ననుకొనెదను.''

వర్జర్స—నిక్కము వచించితిరి. కుట్రలు నెఱుఁగు కౌతుకము కంటె దొంగయని నిశ్చయించుటకు వలయు ఋజువును యోజించుచున్నాను.

దొర—అతఁడు నాచేతులలో బడినపుడు పోలీసువలె వాని యొడలంతయుఁ బరీక్షించితిని. అతని జేబునందే పదివేల నాణెముల నోట్లకట్ట యొకటున్నది.

"ఆ కట్టయే నా మందసమునుండి అపహరింపఁబడినది—ఇది తగిన ప్రమాణమే!"

మేక్సిము—అట్లని నే నవలీలగ విశ్వసింపఁజాలను.

దొర జేబునుండి నోట్లకట్ట నీవలికిఁ దీసి—"ఈ కట్టను జూఁడుడు. రాబర్టుకడనుండి నేఁ బుచ్చుకొనినపుడుకూడ నిది యిట్లే యున్నది."

మేక్సిము—ఇది యదే యనుకొను టెట్లు?

వర్జర్స—ఈవిత్తమెందుండి వచ్చెనో ఋజువుతో విశద మగునంతవఱకు దీనిని గ్రహింపను.

"ఈ విత్తము నాదికాదు—దీనిని గైకొనుట కిష్టపడ రేని బీద సాదల కిప్పుడే దానము గావించెదను. రాబర్టు కాపద నాపాదింప దీనిని నేను సంగ్రహింపలేదని ఋజువుపఱచఁగలను." అని దొర కార్యదర్శి జేబునందు దొరకిన పత్రమును వృద్ధునిచేతి కందించి "ఇపు డీయుత్తరమునుగుఱించి ఏమి యోచింతురో చెప్పు''డనెను.

జాబునుజూచి, కొాశీపతి "ఇం దెవరి స్వాక్షరములు లేవు; ఊరు పేరులేని ఇట్టి యుత్తరముద్వారా పెద్ద మొత్తము బదులు తీర్పఁబడు నని నమ్మఁజాలము—యువకా! నీ వేమందువు?" అనెను.

"కార్యసిద్ధికోసరమై, ఈ కమ్మ సృష్టింపఁబడినట్లు నాకుఁ దోచు చున్నది." అని మేక్సి మనెను.

కొాశీపతి—వర్తకులందుఁగాని, విశేషవిత్త మిచ్చి పుచ్చుకొను వడ్డీవ్యాపారస్తులందుఁగాని రాబర్టు జనకున కెట్టి మిత్రులు లేరు. సమ శ్రేణివారితోఁగాని, అన్యులతోఁగాని ధనవిషయమున నతఁ డెట్టి సంబంధము కలుగఁజేసికొనువాఁడు కాఁడు. ఏ వ్యాపారస్థుఁడును దొంగజాబు వ్రాసి ఏఁబదివేల నాణెముల ఋణము దీర్పఁడు."

దొర—ఈ యుత్తరముఁబట్టి చూడ న్యాయపథమున నీ విత్తము రాబర్టు పడసినది కాదని స్పష్టపడినది కదా?

కొాశీపతి—స్పష్టపడినది.

దొర—మీ యధీనోద్యోగులలో నొకఁడు పూనిన దుండగ మునకుఁ దగు శాస్తిగ వానిని బిల్చి పిప్పిఁజేయుటకు వలసిన అస్త్ర మును మీ కిడె యిచ్చి పోవుచున్నాను. ఈ యుత్తరమును, విత్త మును మీయొద్ద నుంచుకొనుఁడు.

"అర్థముఁ బుచ్చుకొని నే నేమి చేయను?"

"ఎప్పు డిష్టమో అపుడు దానముఁ జేయుఁడు. ఇఁక సెలవు. మరల నే నీ దేశమునకు రాను. మీకుమారికి నా యాశీస్సులు తెలుపుఁడు. మీ కున్నతి యగుఁగాక!" ఇట్లనిదొర మేక్సిమునుద్దేశించి, "అయ్యా! రాబర్టు నుద్ధరింప యత్నించు వారి ననుసరింపకుఁడు. వారు మీ ప్రాణములు దీసివేయుదురు. నా సలహా పెడచెవిఁ బెట్టకుఁడని, అందుండి నిర్గమించెను.

కొాశీపతి—ఈ పాపపు విత్తమును నాకడ నుంచుకొనఁజాలను.

తిరిగి దీనిని దొర కిచ్చివేయుటుచితము కాదా?

మేక్సిము—తొందర పడకుఁడు. విత్తమునుగుఱించి నాకుఁ గూడ మొదట నించుక సందియము కలిగినను, దొర విశ్వసనీయుఁ డనియు, అతఁడు వచించినది నిక్కమే యగుననియు నే నిపుడు యోచించుచున్నాను. రాబర్టునకుఁ గళంకము నాపాదించుట కాతఁడే యీ మొత్తము నిచ్చిపోయెనని మీ రూహించుచున్నారా?

"అతఁడు సత్యమే వచించెనందువా?"

"అవును. ఇపు డీయుత్తరము వ్రాసిన దెవరో యూహింపవలెను."

"రాబర్టునకును, విద్రోహులకును గాఢమైత్రి యున్నట్లు మీరు చెప్పిన యుదంతమువలనఁ దెల్లమగుచున్నది—కాని, ఈవలలో నీ వొనరించిన యుపకారము మాపగుటెట్లు! సత్యమంతయు నీమఱఁదలికి నొక్కి చెప్పవలెను. ఇపుడు నా యవస్థ యెట్లున్నదో నీ వెఱుఁగవు. నా బ్రదుకు దుర్భరమైపోయినది. కుమారిమాటలైన నాఁడదు. నిద్రాహారములఱ విడిచి, దురంతమైన మనస్తాపమున రేఁబవలులు విచారించుచున్నది. వికారి విగతజీవుని కైవడి యయ్యెను. హతాశుఁడై యతఁ డున్మాదుఁడై పోవునని భయ మందుచున్నాను.

"నా కొక దినము గడువిండు—ఇరువురకుఁగూడ నేను సంగతులన్నియుఁ జక్కగ బోధపఱతును."

"ఆలస్య మేల? రమ్ము! కుమారికడ కరుగుదము."

"తొందరపడకుఁడు. నేఁడు సంధ్యానంతరమున హితులతోఁగూడ రాబర్టును బట్టి తీరవలెను."

"నీ కీసాహస మెందులకు?—దొర యేమనెనో మఱచితివా?"

"భయము లేదు—నా ప్రాణముల నెవ్వరుఁ దీయరు."

"ఎట్టి విద్రోహులు; రహస్యాస్త్రమట్టు దివ్యభవనమును బుగ్గి

గావించిరఁట!"

"నేను సామ్రాట్టును గాను—రష్యాదేశస్థుడఁను గాను—నాకేమియు భయములేదు. ఒక్కఁడనే పోయెదను."

విచారస్వరూపమో యనునట్లున్న విగనరీ యపుడచటి కరుదెంచెను.

కౌశీపతి—ఓ! రమ్ము. నీతో మాట్లాడవలసియున్నది.

విగనరీ—"ఏమో సెలవిండు" అనెను.

"మందసమునుండి ధన మపహరింప ముం దొకమాఱు యత్నము జరిగినట్లు చెప్పితివి కాదేల?—విస్మయము నభినయింపకుము—నా కంతయుఁ దెలిసినది! ఛిన్నహస్తోదంతము నంతయు మేక్సిము నాకుఁ దెలిపెను!"

"ఆమాట నేను ముందే చెప్పవలసినది, కాని దానిని గూఢముగ నుంచుమని అతఁడే నన్ను బలవంతపెట్టె"నని విగనరీ తత్తఱముసఁ బలికెను.

మేక్సిము బొమలు ముడిచిపైచి అతని మొగము పరీక్షించెను. మిత్రునిపై దోషభారమంతయుఁ బడవేసి నిజాపరాధమును ప్రతిపన్న మొనరించుకొనవలెనను వాంఛ అతనికి మిక్కిలి కలదని యువకుఁడు గ్రహించెను.

కౌశీపతి—అట్లని యెఱుఁగుదును. అందుచే నీపై నంతగా గోపించుటలేదు. ఇవు డీనోట్లకట్ట నొకమాఱు పరీక్షింపుము!

"నోటులను లెక్కబెట్టి అతఁడు "వేయినాణెముల నోటు లేఁబది యున్నవి—ఇవి ఎచట లభించెను?" అనెను.

"ఇవి నామందసమం దున్నవి. మూల గుండుసూదితో మొకట నెట్లు గ్రుచ్చఁబడెనో, కట్టఁ జూచినంతనే స్పష్టముగ బోధపడినవి. దొంగతన మెట్లినరివలన జరిగెనో యిపుడు తెల్లమాయెను. ఈ పని

తా నొనరింపలేనని తెలుపుట కింక రాబర్టున కెన్ని వేల గుండె లుండును?"

"అతఁడే—"

"అతఁడే యీపని చేసియుండెను. ఇపు డాతనిఁ బట్టి పోలీసులచే సంకెలలు వేయించవలెను. అతఁ డిపుడు పేరిసునందే యుండెను. వాని దుష్కర్మమునకుఁ బ్రమాణము మా చేతులందే యున్నది. అతఁడు జనకుని మిత్రులలో నెవఁడైన బ్రాఁతఋణముఁ దీర్ప దీని నాతనికడ కంపియుండునని నీవు యోచింతువా!—ఇట్లన నతఁడు సాహసించునా? ఈ భావము వెలిబుచ్చుచు, అతఁ డొక దొంగజాబు వ్రాయించెను. ఇదిగో ఆ యుత్తరము—దీనిని జదివి నీ యభిప్రాయ మేమో చెప్పుము."

లేఖఁ జూడఁగనే విగనరీ మొగ మేలనో వెల్లనై పోయెను! కత్తి వ్రేటు వేసినను, నొక్క రక్తపుఁజుక్క పడన ట్లతని యానన మంతయుఁ దెల్లవారిపోయెను! కంపితకరమున నతఁడు కమ్మను గైకొని యిట్లనెను—"ఇది పట్టి మోసమని తెల్లమగుచున్నది! రాబర్టు మిత్రులలో నెవరో అతని యభిమతానుసారము దీనిని లిఖించియుందురని తోఁచుచున్నది. కాని యీ హస్తాక్షరము లెవ రివో నేను గుర్తుపట్టలేకపోవుచున్నాను."

"నీవు రాబర్టుమిత్రుల నెఱుఁగుదువుకదా—మీ ఇద్దరకుఁ జాల మైత్రి యుండెడిదికదా."

"అతని మిత్రుల సంఖ్య మిగుల నధికము! కళాశాల సహాధ్యాయులు పలువురున్నారు. అం దెవరి వ్రాతయో నే నెట్లు చెప్పఁ జాలుదును?"

మేక్సిము—పత్రలేఖకుని వెతకిపట్టఁజాలము—మనయత్నము వృధయగును.

విగనరీ—నేనుకూడ నట్లే మోదించుచున్నాను. కాని, ఉత్తరము నా శోకమూ బోనంగితిరేని—

"వలదు. వృథాకాలహరణ మేల? నా యభిప్రాయమును గుఱించి సంశయపడువారి కది సత్యేతరము కాదని రూఢి చేయగలను. ఈ యుత్తరమును నాయొద్దనే యుంచుకొందును."

ఆ సమయమున కుమారి ఆగారమునఁ బ్రవేశింప నుంకించి, అం దన్యు లున్నకతన మరలిపోవుచుండెను. "అమ్మా! లోనికి రమ్ము!" అని తండ్రి ఆమెను బిలిచి మేక్సిము సమ్ముఖమందే ఆమె దృఢాభిప్రాయమును సడలింప నెంచెను.

నిగనరీని మఱుఁగునకుఁ బిలిచి "యువకా! నిరాశఁ జెందకుము. త్వరలో పెండ్లికొడుకువు కాఁగలవు" అని వృద్ధుఁడనెను. గభీరచింతా శరధిని మునిఁగిన వానిలీల అవనతమస్తకుఁడై యందుండి నిష్క్రమించెను. కన్నియ నుద్దేశించి కోశీపతి "అమ్మా! శుభక్షణమున నీవు గదియందుఁ బ్రవేశించితివి. ఇంచుక మున్ను వచ్చియుంటి వేని దొరదర్శనముఁగూడ లభించెడిది" అనెను.

"ఇంతకుమున్ను రానందులకు సంతసించుచున్నాను—అతని సందర్శనము నే నపేక్షించుదానఁగాను."

"అవునది నేనెఱుఁగుదును. ఏలనన, నావలె నతఁడుకూడ రాబర్టు హర్తయని విశ్వసించియున్నాఁడు. ఇఁక దాపఱిక మేల? హృదయపూర్వకముగ నీవెవనిఁ బ్రేమించితివో వాఁడు నీవల్లభుఁడగుట కెంత మాత్రము తగఁడు!"

"ఇట్లని మీరు పలుమాఱు పలికియున్నారు. కాని, మీ మాటలు విశ్వసింపఁజాలను.—మేక్సిముకూడ మీ పల్కులను విశ్వసింపలేదు."

కోశీపతి—అట్లా! అయినను రాబర్టు విషయమై ఇవుడాతని యభిప్రాయమేమో యడిగిచూడుము. ఇదే మంచితరుణము.

ప్రశ్న జిజ్ఞాసునయనయై, కుమారి యువకుని దెసఁజూచెను. మేక్సిము ముఖమారక్తిమమై పోయెను. అతఁడేమియుఁ బలుకక అట్టెకూరు చుని యుండెను.

కాశీపతి—నాయనా! ఇపు డూరకొనకుము,—ఈ యమా యిక బాలికకు ఏమియుదాపక నిక్కము వచింపుము. కార్యదర్శి రాబర్టు విద్రోహులఁ గూడి చరించుటలేదా?—నాబిడ్డ ముంగల మాటఁ ద్రిప్పుకొనకుము.

"ఏలఁ ద్రిప్పుకొందును? నేనసత్యము వచింపను."

నిర్విణ్ణయై, మృదుస్వరమున కుమారి యిట్లనెను. "ఏమి! నీవుకూడ అతనిఁద్యజించి వైచితివా? నిన్న నే కదా శపథపూర్వకముగ నీవు—"

"ఆతనిపై నన్యాయముగ దోషమారోపింపఁ బడినదని నిన్న నమ్మి యుంటిని. కాని, పొరపడితినని నేనిపుడు గుర్తింపఁగలిగితిని. ఒక యాఁడుదాని వెన్నంటి అతఁడు పాఱిపోవుటఁ గనులారఁ జూచితిని. అతని హితురాలు చోరాంగన!—సందియ మేమియులేదు!!"

విచలిత హృదయయై కుమారి "ఏమి!—ఆఁడుదియా?—హితు రాలా" అనెను.

"అవును. ఆఁడుదియే! ఆమెయైన సామాన్యపు స్త్రీ గాదు. నరహం తకులై, విప్లవమం దాఱితేఱిన విద్రోహులకామె సహకారిణి!"

"అతఁ డాయాఁడుదానితోఁగూడి పాఱిపోయెనా? పాఱిపోవలసిన యవసరమేమి కలిగెను?"

"అభాగినీ! అప్రియములగు నీ విషయము లన్నియు నెఱుఁగ నాతు రపడకుము. నీవువలచిన యువకుని ప్రకృతి మంచిదికాదని మాత్ర మెఱుఁగుము. ఇఁకేమియు నడుగకుము."

"ఏమి! మంచి ప్రకృతి గాదా?"

"కాదు. దుండగములం దాఱితేఱిన అట్టి వ్యక్తి నీపాణిపంకజ

మంటుటకుఁ దగదు. నామాట నమ్ముము. అతని పక్షము నవలం
బింప సాధ్యమైనంత దనుక నేను వెనుదీయలేదు. వాని గుఱించి నింద
చాటవలెనను నుద్దేశము నాకు లేదు."

పొరలి పొరలి వచ్చు దుఃఖము నతికష్టమున నడఁచుకొని, కుమారి
డగ్గుత్తికతో "ఎట్టి మాటలాడుచుంటివి!—అతఁ డిపు డెచట?"
అనెను.

"ఏమిటా! అతనిఁ జూడఁ బర్వెత్తదవా యేమి?"

"నామనోకాంతుఁ డెందుండెనో నాకు దెలుపవలెను."

"ఎఱుఁగుటకై నీకంత యాతురమా!—అతఁ డారనుణి గృహ
మందే యున్నాఁడు!"

"నీపలుకులు నిక్కములని ఋజువు సేయుము."

"ఎట్లు ఋజువుచేయుదును? నిన్ను నే నాప్రదేశమునకుఁ గొని
పోఁజాలను.—అది యసాధ్యము. నేఁటి సాయం సమయమందే నే
నచటికిఁ బోదును. పోయి, దుర్వృత్తిఁ జరించు నామిథునము గలిసి
కొందును. పదంపడి వారిచెడు చెయువులను గుఱించి నీకుఁ దెలుప
నక్కఱయున్నచో, దేవు తెలుపుదును—వారిపుడు నాపిడికిట నడఁగి
యున్నారు."

"ఇపుడు చెప్పినది చాలును.—ఇఁకేమియుఁ జెప్పనక్కఱలేదు.
ఇపుడు మృత్యువుతక్క నాకిఁక వేఱు తెరువులేదు."

కౌశీపతి—ఏమి! మృత్యువా! ఇట్టికృతఘ్నతయా!!! పుట్టిన
దాది నీకుతల్లియుఁ దండ్రియు నేనయైనందులకా ఇట్టి దురూహ? ఇఁక
నీవునన్ను ప్రేమించుటలేదని స్పష్టమగుచున్నది. అందుచేతనే మరణ
ముమాట యెత్తుచున్నావు? నీకు నేనేమి కీడొనరించితినని నాహృద
యమున నిట్టి నిశితాఘాతము వేయుచున్నావు? ఇహలోకమునుండి
పరమేశుఁడునన్నుఁ గొనిపోనంత కాలము నిన్ను విడువను. తల్లీ! నీవు

దునలి బిడ్డపై నించుక జాలిఁజూపలేవా?"

జనకుని యాలింగనమున బంధింపబడి కుమారి వెక్కి వెక్కి యేడువ దొడఁగెను. ఆదృశ్యమును విలోకించినంతనే ముందున్న యువకుని కన్నులనుండి బాష్పశైవలినిపొంగి పొరలసాగెను. ఆవేగభరమున నాతఁడాననమును వంచుకొనెను.

"నాయనా! నాహృదయమునకుఁ గ్లేశమొనగూర్చుట తనకు ధర్మము కాదనినాకన్నతల్లికి నచ్చఁజెప్పుము. పరిణయమాడుటకీయ కొనక ఈ మునలితనమున నాకు మనస్తాపము కలిగించుట తనకుచిత ముకాదని యామెతోఁ జెప్పుము." అని కోశీపతి కన్నీరునించుచు మేనల్లు నుద్దేశించి పల్కెను.

జనకుని బాహుపాశమునుండి విడివడి గద్గదకంఠయై కుమారి ఇట్లనెను. "తండ్రీ! నీకు నేనెన్నఁడు మనఃక్లేశమును గూర్పను. మీచరణ తలమున నాత్మసమర్పణ మొనరించుకొనఁ గలను; కాని, నాహృదయపీఠమున నాసీనుగావించి, భక్తిప్రసూనముల నెవని నశ్రాంతము పూజించుచున్నానో వానిని నాకంఠమున నసువు లున్నంతదనుక విస్మృతింపఁజాలను. అయినను నతని పవిత్రనామమునికఁ గన్నతండ్రి వగు నీముందల నుచ్చరింపనని ప్రతిన జేయుచున్నాను. మీరిర్వురు కూడ నిఁక నీమాటను నాకడ నెత్తకుఁడు. మిమ్ము నేగోరు భిక్షయిదియే!"

"జననీ! మేమిఁక అప్రియములైన మాటలు నీముందల నెత్తము. నీ ఇష్టమెట్లో యట్లేమెలఁగుము. కొంతకాలమునకు నీమనసు మాఱకయుండదు—నేఁజూచుచు మిన్నకుందును. అమ్మా! ఇఁకఁబోయి విశ్రమింపుము."

కుమారి వెడలిపోయెను. తోడనే కోశీపతి మేనల్లునుద్దేశించి ఇట్లనెను. "తండ్రీ! మున్ను నీయెడల నాకెట్టిమక్కువ యున్నదో, ఇపుడు

కూడ నట్టిమక్కువ కలిగినది.—మరల నీవు పూర్వమట్లు నాప్రేమ భాజనుఁడవై తివి. నీవిట్లు తోడ్పడకనే పోయినయెడల, ఈ సంకటమున నింకేవెరవు నుండకపోయెడిది.''

"నాతోడ్పాటు వలన నేమైన మేలుకలిగెనని తలఁపను.''

"నాయనా! అట్లు తలఁపకుము. నీనుడువు లామె హృదయమున బాగుగ నాటినవి. కాని కొంతకాలము జరుగవలయును. అపుడామె హృదయావేదన ముపశమించును. అత్యాచారి యెడనామె యనురాగము చిరకాల ముండనేరదు.''

"అట్లే యగుఁగాక! కాని నామనసున నట్టియాశ పొడముటలేదు. ఆమె చాలపట్టుదలకలది. కాని ఇందులకొక యుపాయము—"

"నాయనా! అదేమో చెప్పుము.—నాసర్వస్వము వ్యయపఱచిన యెడల, నాకూర్మి తనయ హృదయ వ్యథయంతరించి, చిత్తపరివర్తన మగునేని అందులకు సంసిద్ధుఁడ నగుదును.''

"వ్యయమువలన నీపని సానుకూలపడదు.—నాప్రార్థన మొకటి కలదు. నాయిచ్చవచ్చిన వారిమోలకు నేఁగోరినపు డామెను బంప నంగీకరించుదురా?"

"నిశ్చయముగ నంగీకరింతును."

"ఇపుడు సెలవొసఁగుఁడు.— ఇఁకఁ గాలహరణ మొనరింపఁ జెల్లదు."

"మరల నెపుడు కాన్పింతువు?"

"నాపని ముగిసినంతనే వత్తును." అని మేక్సిమందుండి వెడలిపోవుచు, "ఇయట్లాదేవి తప్ప మరెవ్వరును నీమె మనసు ద్రిప్పఁజాల''రనుకొనెను.

వ్యాకుల చిత్తుఁడై, వ్యథిత హృదయుఁడై, మేక్సిము మాతులా లయమునుండి నిష్క్రమించినదాది మాధుర్య ప్రతిమయగు ఎలిసు యుదంతమే యతని మనోవీథిని సుడిదిరుగుచుండెను. తోడ్తోడనే భద్రాంగనయగు ఇయుల్టాదేవికూడ చిత్తచక్షువున నాతనికిద్యోతక మగుచుండెను! మధురహృదయ యగు దేవియొకతెయే కుమారి దగ్ధహృదయమున సాంత్వన సుధాధారవోయఁ జాలును. తాను ప్రేమించిన యువకునకుఁ బ్రతికూలముగ నీ యనదవిషమ విషయముల నెన్నేని వినినను, అతనియెడగల నిస్తులభక్తి నీమె కోలుపోలేదనియు, దుస్సహదురంతగాఢతమ దుఃఖతమసముచే నామె హృదయ కుహరము నిండియున్నను, అందాశాస్వర్ణ ప్రదీపము వెల్గుచునే యున్నదనియు బోధపడుచున్నది. కాని, యీయభాగినియొక్క అంత్యాశను—ప్రేమ మరీచికను దూరీకృత మొనరింపవలెను. దేవితప్ప నొరులెవ్వరు నట్లు కావింపనేరరు. ఈ దుష్కర కార్యమున నేనామెకుఁ జాలినంత సాయము సలుపుదును." అని వితర్కించుకొనుచు దేవిని వీక్షింప నాతురపడుచు యువకుఁడు జర్జటు గృహాభిముఖుఁడై చనుచుండెను. చింతామగ్నుఁడైయుండ హఠాత్తుగ గమన నిరోధమగుటచే నతఁడట్టె తలయెత్తి చూచెను. ఎదుట శకటము పూన్చబడినయుడాయింప నుంకించు గుఱ్ఱము నొకరమణీలలామ అతికౌశలమున వల్గమును లాగి పట్టి నిలుప యత్నించుచుండెను. అశ్వమించుక ముందడుగిడినచో నిష్కారణముగ యువకుఁడు దాని పదతలమునఁ బడి ప్రాణములఁ బాయువాఁడు. యువకుఁ డొక్కగంతుతోఁ బ్రక్కకుఁ దప్పుకొని తన యలక్ష్యమునకై యామెను మన్నింపవలసినదిగా వేఁడ నుంకించి,

ఆమెను తేఱిచూచెను.—ఆరమణి అపరిచితకాదు. ఇయల్టా దేవియే. అతికష్టమున గుఱ్ఱపు కళ్ళెము నొడిసిపట్టుచు, భీతపాండురవదనయై ఆమె "మీరా?" యనెను.

విస్మయమున యువకుఁడు—"ఇదేమి?—మీరా?" అనెను.

కంపితకంఠయై దేవి "త్వరగా బండిలోనికి రం" డనెను.

మేక్సిమొక్క యుఱుకున దేవి పార్శ్వమునఁ గూర్చుండెను. అంతట నామె కళ్లెమును విడిచెను. అశ్వమతివేగమునఁ బర్వెత్త సాగెను.

దేవి—చాల భయమైనది. మీరొక యడుగుముందు వైచియున్న యెడల గుఱ్ఱము కాళ్ళక్రిందఁ బడిపోయెడి వారు.

"మీరు నాప్రాణములఁ గాఁపాడినారు. మీకొఱకు వేచి యుండుటఁ జాల కష్టము. అదృష్టవశాత్తు వెంటనే తిరిగి వచ్చినారు."

"తిరిగి వచ్చుటేమి? ఒకగంటకుమున్నే కదా నేనిల్లు కదలితిని."

"పేరిసున కనతిదూరమందున్న యొక దుర్గముఁ జూచుటకై నేటి యుదయమున మీరు నగరము వీడిపోలేదా?"

"లేదు—లేదు!"

"మీచికిత్సకుఁడు విలాగస్ అట్లని నాతో నేల చెప్పియుండెను?"

"మీరాతనిఁ జూచితిరా యేమి?"

"అవును.—నేఁటి యుదయమున నతఁడు నాకడకు వచ్చెను."

"మీతో నతఁ డేమేమి చెప్పెనో దాపక విప్పిచెప్పుఁడు."

విస్మితుఁడై యువకుఁ డంతయుఁ దెలుపఁదొడఁగెను.

"బాగు! బాగు! ఇపుడు నాకేమి మూడనున్నదో బోధపడినది" అని దేవి తనలో మెల్లగ ననుకొనెను. ఆమాట యువకుని చెవిఁ జొచ్చెను. అబ్బురపాటున నతఁడు—

"మీ రేమనుకొనుచున్నారు?" అనెను.

"ఏమియు లేదు. చెప్పకొని పొందు; ఇంతకు మున్నే కదా, రాబర్టు దుర్మతియని మీరంటిరి? వైద్యుని యుద్దేశమదియే కాఁబోలు!"

"నే నతని మతావలంబిని. ఈవిషయమున నతఁడు నాసందియముల నన్నిఁటిని బాఱఁద్రోలెను. బంధితుఁడై, పదంపడి సౌధమునుండి పలాయన మొనరించిన యనంతరము రాబర్టేమేమి యొనరించెనో అతఁడు నాకుఁ జెప్పివేసెను.—ఆరేయి జరిగినదంతయు మీకుఁ దెలుపు టావశ్యకము."

"అది తెలుప నక్కఱలేదు,—తరువాత నేమి జరిగెనో చెప్పఁడు."

"మీరడుగుచున్నపు డూరకొనుట యనుచితము. రాబర్టు తన యుపపత్నితోఁ బలాయన మొనరించెనని వైద్యుఁడు చెప్పెను. ఆరమణి అతనిని నిజాలయమున నుంచుకొనెనఁట!"

"ఈవృత్తాంతము సత్యమని మీరు నమ్మినారా?"

"నమ్మకపోవుటేమి?—నేఁటి రాత్రి వైద్యుఁడు నన్నాసుందరి భవనమునకుఁ గొనిపోవుదునని చెప్పెను."

"మీరు పోకుఁడు. నామాట వినుఁడు."

"ఏల నిట్లు వారించుచున్నారు?"

"పోయితిరేని మృత్యుముఖమున నఱుకవలసివచ్చును!"

"ఏమి!"

"వైద్యుఁడు మిమ్ము వలలోఁబడ వేయ ప్రయత్నించుచున్నాఁడు. నేఁటిరాత్రి మీరాతని వెన్నంటి వెళ్ళితిరేని జీవములతోఁ దిరిగి రాలేరు."

"నా ప్రాణములను దీసినందున వానికొదవు లాభమేమి?" అని యువకుఁడు నవ్వుచుఁ బలికెను.

"మీ కాతఁడు తెలిపిన సంగతులన్నియు నాప్రమోల మీరేకరు

వుఁ బెట్టకుండుటయు, మరల మీరు నన్నుఁ గలిసికొనకుండుటయు నతనికిఁ గావలసియున్నది. మిమ్ము నాపాలికి రాకుండఁజేయుట కేమీ నడ కరుడెంచి అతఁడబద్ధములు చెప్పెను. అదృష్టవశమున నాకస్మి కముగ మనమిందుఁ గలిసికొనియుండక పోయిన యెడల మరలమి మ్ముఁ జూచుభాగ్యము నాకుఁ గలుగకుండెడిది. తెల్లవారకమున్న మి మ్మిహలోకమునుండి వెడల నంప నతఁడూహించెను."

"ఏమీ! మీకు మిగుల విశ్వాసభాజనుఁడై యుండువాఁడే ఇట్టి దుండగమునకుఁ బాల్పడఁజూచెనా? అతఁడు మీకుఁ బ్రతికూలముగఁ గుట్రపన్నెనా? నన్ను మీరు మీ పక్షములోనికిఁ దీసికొనినను అతఁడు మనకు విరుద్ధముగఁ గుట్రయేల పన్నుచుండెనో నాకు బోధపడు చుండుట లేదు."

"నా పలుకుల నాలింపుఁడు—భయంకరమైన విషమావస్థ తటస్థ మగుచున్నది. సంగతి యేమో బోధపఱచుచుంటిని—ముందుగ నా మాటల కుత్తరముల నొసఁగుఁడు. నిన్నరాత్రి అట్లుజరిగిన పిదప, నేఁడు మీరు మీమామ కుమార్తెను గలిసికొనినారా?"

"ఇంతకుమున్నే ఆమెనుగలిసి కొంటిని. మిమ్ము త్రోవలో జూచి నపు డచటనుండియే వచ్చుచున్నాను. మా మాతులుఁడు కూడ నపు డు కుమారికడనుండెను. రాబర్టును గుఱించిన నా యభిప్రాయము నామెకడ దాపలేదు. నా మాటల కామె యెట్టిప్రతివాదము నలుప లేదు. కాని, తానీ జీవితమున నింకెవనిఁగాని పెండ్లి చేసికొనన నని చెప్పినది."

"ఈ మాటల యర్థమామె మీవాక్కుల నేమియు విశ్వసింపలే దని కదా? ఆమె తనప్రియుని యాశాపథమును నిరీక్షించుచునే యున్నది. కుమారి ప్రేమమయి. దృఢచిత్త. పవిత్రమనస్క. ఎందఱెన్ని యశ్లీలములు వచించుచున్నను—ఎట్టియపవాదము వేయఁజూచుచు

న్నను, ఆమె తనవిశ్వాసమును గోలుపోలేదు."

"ప్రేమ ముగ్ధయైన నీ బాలిక సంకల్పమట్టైన నుత్తమమైనదనియే మీ యభిప్రాయమా? నచ్చఁజెప్పి ఆమెయుల్లమును మీరు చల్లవతి చెదరని నేఁదలఁచితిని. మీ మాటలం దామెకు గాఢవిశ్వాసమున్నది. ఏలనన఼ దన ప్రియుని విషయమై తక్కుఁగల వారివలెగాక మీ కేట్టి దురభిప్రాయములేదని ఆమె యెఱుఁగును."

"నా పల్కులను జెవిఁబెట్టినయెడల ఆమె తన ప్రియుని బడయఁ గలదు—ఆ విషయ మటుండనిండు; ముందుసంగతులను మాట్లాడి కొందము."

ఇంతలో దేవి యశ్వశకట ముద్యానద్వారమునఁ బ్రవేశించినది. అందుండి వారిరువురు దిగి యారామమునఁ బ్రవేశించిరి. యువకుఁ డామె వెన్నంటియే యుండెను. కొంతవరకుఁ బచారుచేసి కొండొక వృక్షవాటిక యందు వారిరువు రుపనీతులయిరి.

అంత దేవి "మన మీశాంతి నికేతనమున స్వచ్ఛందముగఁ బ్రసంగించు కొనవచ్చును. మనకెవరు నడ్డురారు" అనెను.

"మీ వైద్యుఁడు కూడ రాలేడా" అని యువకుఁడు నవ్వుచుఁ బలికెను.

"రాలేడు. అతఁడు నా కోసరమై వచ్చెను, నేనింట లేనని విని పోవును."

"మీరిఁక నతనిఁ గలిసికొనరా?"

"మఱొకమాఱు కలిసికొందును. అదే కడపటితూరి!"

"అట్లైన నతఁడు పగవారికిఁ దోడ్పడ స్థిరసంకల్పుఁడయ్యెనా?"

ప్రశ్నవిని దేవి ఇంచుక చకితయై "లేదు. నేనే అతనిని త్యజింపఁ దలఁచుచున్నాను" అనెను. విస్మయ విస్ఫారితలోచనుఁడై యువకుఁడు తనవంక దృక్పాత మొనరించుచుండుట విలోకించి దేవి "రండు! మీ

కన్నిసంగతులు తేటతెల్లముగఁ దెలుపుదు" ననియెను. అంత జవ్వనులగు నా యిద్దరు లేచి యా తరువాటికనుగల యొక కుంజకుటీర మందలి రమ్యాసనములపై నాసీనులయిరి. "అట్లైనఁ దాము నిన్నరాత్రి రాబర్టును జూచితిరా?" అని దేవి యువకునడిగెను.

గతరాత్రి తాను గాంచిన దంతయు సంక్షేపముగఁ దెలిపి మేక్సిమిట్లనెను. "ఆ మాయలాడి ఎట్టి కౌశలమున రాబర్టు నుద్ధరించెనో తెల్లముఁ గాకున్నది. ఈ సందర్భమున మీ శోకపూరితఁ దెలుపసంశయింపను—మీ యన్త్రశిక్షకుఁ డామాయలాడికిఁ దోడ్పడియెను సుడీ!"

ఈ వార్త వినినను దేవి మొగమున నబ్బురపాటేమియుఁ దోఁపకుండుటఁగాంచి యువకుఁడు విస్మితుఁడై పోయెను.

దేవి—అట్లైన మీరు మాయన్త్రశిక్షకుని గుర్తించినారా?

"ఆఱితేఱిన విలాసపురుషునివలె నతఁడు వేషము వేసినను, నేనాతనిని గుర్తుపట్టితిని. బొరిమఫ్ను దోడ్కొని హూటలున కాతఁడు చనినపుడు, దొరమనసున నావంతయేని సందియము కలుగలేదు"

"అతఁడు మిగుల చతురుఁడు!"

"అట్లనియే గ్రహించితిని, కాని అతఁడు మీ యెడ విశ్వాసఘాతకుఁడై మెలగఁలేదా?"

"మీరి ట్లూహించితి రేల?"

"విద్రోహినియగు విలాసినితో నతఁడు సఖ్యమొనరించెను—ఆమెనుగలిసి నిన్న నిశీథిని నతఁ డొనరించిన యద్భుతక్రియ ఇంకను నా కన్నులకుఁ గట్టినట్లున్నది."

"ఆమె విద్రోహినియో కాదో నేనెఱుఁగను; కాని ఆమెకుఁ దోడ్పడిన యాతఁడు నిర్వాసితుఁడైన పోలండువాసియని నే నెఱుఁగుదును. రష్యాగూఢచారుల కుట్రలను వ్యర్థము చేయు నధికార మాతనికిఁ

గలదు!"

"అట్లైన నతఁడా దొంగలకు సాయము సలిపినందులకు మీ కాతనియెడఁ గోపము గలుగుట లేదా? మందసముఁ దెఱచి పత్రముల పేటిక నపహరించినవారికి మీ యంత్రశిక్షకుఁడు, రాబర్టు నిశ్చయముగ సాయ మొనరించియుండును."

"ఇది కేవలము భ్రమ. రాబర్టునకును, అతనికిని బరిచయమే లేదు. మఱి యా సుందరిని మీ కార్యదర్శి నిన్నటి రాత్రియే మొదటిసారి చూచెను."

"కాని సుందరి చోరాంగనయని యొప్పుకొనవలెను."

"రాబర్టెట్లు చోరుఁడు కాఁడో సుందరికూడ నట్లే చోరాంగన కాదు!"

"అపహరింపఁబడిన యేఁబదివేల నాణెముల నోటు లాదురాత్ము నొద్ద లభించినసంగతి మీ రెఱుఁగరు. నేఁటి యుదయమున దొరయా నోట్లను మా మామకుఁ దిరిగి యిచ్చివేసెను. తనయకృత్యమును గప్పిపుచ్చ నాతఁడు సృష్టించిన దొంగజాబొకటి నోట్ల కట్టతో దొరికినది. తన తండ్రి మిత్రుఁ డెవడో తన కావిత్త మంపె నని యొక లనుకొనుట కతఁ డట్టి మూఁ గల్పించెను.

"ఎవఁడో పగతుఁ డతని మట్టుబెట్ట నమకట్టి నోటులకట్ట వాని కడ కంపెననికూడ మనము యోజింపవచ్చును; రెంటిలో నేదియో యొకటి సత్యమగుట నిస్సంశయము."

దేవి యీ విధమున రాబర్టుపక్షమును సమర్థించుట జూడఁగనే మేక్సిము విస్మయమునకు మేరలేకపోయెను. అబ్బురమున నించుకసే పాతఁ డూరకొని పిదప దేవి నేమో యడుగ నుంకింప నింతలో నేదియో చప్పుడు వాని చెవులఁ బడెను. తోఁటమాలి యొకఁడు నీటితో నిండిన కుండ యొకటి చేతుల నిడికొని వారివంకకు నరు

డెంచుచుండెను. అతని యున్నతకాయమును, వృషస్కంధమును జూచి యువకుఁడు వాని నిట్టె గుర్తుపట్టెను—అతని నీవరలో నతఁడు వేఱువేషముల రెండుమాఱులు జూచియున్నాఁడు. గతరాత్రి సుందరికిఁ దోడ్పడిన చతురపూరుషుఁ డాతఁడే! కొలఁది వాసరములకుఁ బూర్వము సార్జెంటుదొరసాని ఏకాంతభవనమునఁ గాఁ పై కన్పట్టిన వికారాకారుఁ డాతఁడే! ఈ యద్భుతదృశ్యమును విలోకించినంతనే యతని కంఠమునుండి విస్మయసూచకావ్యక్తధ్వని వెల్వడ యువకుఁ డట్టె నిలువఁబడెను.

దేవి—ఏమ ట్లులికిపడితిరి!

కంపితస్వరమున యువకుఁడు "అతఁడు—అతఁడు—ఎవరు ?" అనెను.

"అతఁడు నా యుద్యానమాలి — వృక్షవాటికలోనికి వచ్చుచున్నాఁడు. కాని నన్నుఁజూచిన తమ స్తకుఁడై మరలిపోవుచున్నాడు."

"అతఁడుకూడ దొంగ నెఱుఁగుదు. గతరాత్రి గానఁబడిన అస్త్రశిక్షకునకును సుందరికిని ఎంతస్నేహ మున్నదో, ఇతనికిని ఆమెకును గూడ నంతస్నేహమున్నది. చెప్పనేల? మొదట నతఁడు సుందరి నిర్జనభవనమున వసించుచుండువాఁడు. పదఁపడి రష్యావాసిగాఁ బ్రచ్ఛన్నవేషుఁడై బొరిషప్‌ను మాయఁజేసి సుందరీసహితుఁడై రాబర్టును విడిచిపుచ్చెను. మే మిరువురము కలహించుకొంటిమి—మఱునాఁడు ద్వంద్వయుద్ధమునకుఁ దొడర మేము యత్నించితిమి."

"అతనితో యుద్ధమునకుఁ దొడరియేయున్న యెడల, నొకసామాన్యభృత్యు నెదుట తాము కత్తి నెత్తియుండువారని ఇపుడు గ్రహించితిరా?"

"కార్యదర్శి హితురాలగు సుందరికి నీమాలి దొంగతనములో సహచరుఁడని వినినను మీరు విస్మయపడుట లేదేల?"

"విస్మయపడు టేల? ఇంతదనుక మీయొద్ద నేనడఁచియున్న విషయముల నన్నిఁటినిఁ బ్రకాశ మొనరింపవలయు దినము నేఁ డరుదెంచినది. ఎవరు, ఏయుద్దేశమున నీ చౌర్యము సలిపిరో నే నెఱుఁగుదును. మీ మాతుల మందసమునుండి, ఒక రష్యా గూఢచారుని పేటికమాత్ర మపహరింపఁబడినది. తోడ్తోడనే కొంత విత్తముకూడ పోయెనని మీ రందురు. పోవుట నిజమేకాని పెట్టెదొంగిలించినవాఁడు విత్తము గొంపోలేదు. ఆనాఁటి సంఘటనమును గుఱించిన వివరములు పైకిరాక మఱుఁగునందే యున్నవి!"

"అట్టిన చౌర్యమును విద్రోహులే సలిపియుందురు— నేఁ గూడ నట్లే భావించితిని."

"బోరిషఫ్ను తమ గూఢచారునిగనియుక్తు గావించిన దొరతనమువారిని రష్యావిద్రోహులేగాక అన్యశత్రువులుకూడ గలరు— ఒకప్పు డెవరు పోలండు దేశముకోసరమై హృదయ రుధిరమును జిమ్మి నేఁడు దేశాంతరగతులై యున్నారో వారీరష్యాదొరతనమువారియెడ ననిర్వచనీయమగు జుగుప్స చూపుచుందురు. కేవలము రష్యా విలాసినులపై గన్నువైచి గనిపెట్టుటకుమాత్రము దొర యిచటికిరాలేదు. పీడితులైన స్వదేశీయుల నత్యాచారుల చేతులనుండి రక్షింప నిపుడు కూడ యత్నించు పోలండు వాసుల జాడలనుకూడఁ గనిపెట్టుటాతని యుద్దేశము. రష్యాఏలిక దుష్పాలనమునకుఁ బ్రతికూలముగ దేశమంతటను బ్రబలిన కుట్రలను రూఢిపఱచు లిఖిత ప్రమాణములు మందసమందలి పెట్టెయం దుండెను. కృతఘ్నుఁడైన ఒక దేశద్రోహి ఈ పత్రములను రష్యాదొరతనమువారి కప్పగించెను. కాని ఆ పెనటి తన యపరాధమునకుఁ దగు ప్రాయశ్చిత్తమును బడయక తప్పించుకొనిపోలేదు. పత్రములు రష్యాపాలకుని కరములఁ బడినంతనే విపాదకూపమున బడనున్న దేశభక్తులు వాని నెట్లయిన హస్తగత

మొనరించుకొన యత్నించి తను సంకల్పసిద్ధికై ప్రాణములనుసయి తము బలి యొసంగ బ్రతిన బూనిరి! పెట్టియున్న ప్రదేశమును గురించిన వార్త వారు తెలిసికొనిరి. రాత్రి ఏడు మొదలు పన్నెండు గంటలవఱకుఁ గోశీ యాధ్యక్షుని సిందుకముపై గాఁ వుండదని యెఱింగి చోరులు తమ మనోరథము వితథము కానేరదని సంతసం పడిరి."

"అట్టిన కోశీయందు నావిదేశీయులలో నొకరుండె ననుకొనె దను."

"ఉండలేనని యొప్పుకొనకుండుటేల?——కాని, రాబర్టు చోరుల సహకారి కాఁడ(ని నేఁజెప్పుచుండ వారికిఁ దోడ్పొనరించిన దెవరో యెఱుఁగవలసిన యవసరమేమి?——దాఁచఁబడిన పత్రములను హరించఁ నా దేశభక్తులలో నిరువురు ముందంజ వేసిరి."

"ఆయిరువురలో నొకరు స్త్రీ కాదా!"

"అవును స్త్రీయే! స్వదేశహితార్థము ప్రాణముల నర్పింప సంశయింపని స్త్రీ. నారీజీవన సారధనమగు సతీత్వమును సహితము మాతృభూమి మంగళార్థము మహోత్కంఠతతో బలియొసంగ నకుంఠితయైన కలకంఠి!——ఈ సాహసకృత్యమున నా సీమంతినీ శమంతకమునకు సాయము సలుప నరుదెంచిన వ్యక్తి యొక పోలండునివాసి. స్వదేశము కొఱకై దీర్ఘకాలము సైబీరియా ఖనిగర్భమునఁ బ్రవాసితుఁడై పీడింపఁ బడిన యుదారహృదయుఁడు. నిరీహులను పల్వురఁ దమ యత్యాచారమునకు గుఱిజేయు రష్యాదౌరతనము వారి దుష్కృత్యమునకు దగు ప్రతీకారము సలుపఁ గృతసంకల్పుఁడైన శూర శిఖామణి."

"బాగుగ వచించితిరి. పగతురకుఁదగు ప్రతీకారముసలుపఁ గృత సంకల్పుఁడైన ఆశూరశిఖామణి హృదయము నిరీహుల నిష్ఠురయాతనలను జూచినంతనే ద్రవీభూత మయినను గాకపోయినను, ధనమున్న

మందసము గాచినంతనే యది యట్లయిన దనుటకు సంశయము లేదు."

దేవి యామాటలను జెవిఁబెట్టక, ఇట్లు పలుకదొడఁగెను. "తమ యుద్దేశసిద్ధికై యాయిర్వు రొకనాఁటి సంధ్యాసమయమున బయల్వెడలి మీ మామ కచేరియందుఁ బ్రవేశించిరి. అందొకఁడు వారికై వేచియుండి, వారు రాఁగనే మందసపు బీగమునొసఁగి దానిఁదెఱచు సంకేత పదమును వారికిఁ దెలిపివేసెను. అంతనా స్త్రీ యిను పపెట్టెను దెఱువ దొరఁకొనెను. ప్రమాదకరమైన మరయొకటి దానికి సంలగ్నమై యుండుటామె యెఱుఁగదు. తాళమునఁ జెవిఁజొనిపినంతనే యంత్ర మామెనినిచేయి బలముగఁ బట్టుకొనినది. ప్రక్కనొక్కము నొక్కి దానిని దెఱచుటవారెరుగరు ఎంత యత్నించుచునను చేయి రాలేదు.—కాలము గడచిపోవుచుండెను.— ఏనిముసమున నెవరువచ్చి పడుదురోయను భయము వారిని వేధింప దొడఁగెను: పట్టుఁబడిన నగుబాటేగాక వారి మహత్కార్యము చెడుటయు, వారునుశిక్షాపాత్రు లగుటయుఁగూడఁ దటస్థించును. ఆకాంత యిఁకఁ దడయక, తన కరపల్లవమును శీఘ్రమే ఛేదించివేయుమని తోడనున్న పురుషునిఁ బురికొల్పెను."

"అట్టి భయదకృత్య మొనరింప నాతఁడీయకొనెనా?"

"అతఁడామె యాజ్ఞానువర్తి—అనివార్యమగుటచే నాయంగన యాజ్ఞాపాలన మొనరించి తీరెను. వానికడ వాడియైన నొకఖడ్గము కలదు.—తోడనే యతఁడాకాంత కరముసు ఛేదించి వేసెను."

"అట్టి దారుణకృత్యము జరుగగా నావీరనారి మూర్ఛితయై నేలఁగూలలేదా?—ఆమె ప్రాణములు పోలేదా?"

"ఎట్టిబాధనైన సహింపఁగాలుశక్తి ఆవెలఁదికిఁ గలదు. సహాకారుఁడొకప్పుడు సైన్యమునఁ బనిచేసినవాఁడు. అస్త్ర సంచాలనమున నాతనికిఁదగు అభిజ్ఞత కలదు. మానిని మణిబంధమునకుఁ గట్టుకట్టి తోడనే

అతఁడు రక్తప్రవాహము నరికట్టెను. కాంతలేచి నిలుచుటకైన నశక్తయయ్యు, మెల్లగ నాపూరుషుని బుజముబట్టుకొని యెట్లో యవ్వలికి దాటెను."

"ఆరమణి యపుడు పురుషవేషము ధరించియుండెను గదా?"

"అవును"

"అట్టైన విగనరీని కలిసినేను నాతఁడును గోడీద్వారమును జేరి లోపలకుఁ బోయినంతనే యెదురైన వారిరువురే వారు కాఁబోలు!"

"కావచ్చును. పిదప దొంగతనము జరిగినగదిలో మీరు ప్రవేశించితిరా?"

"ప్రవేశించితిమి—వెలుతురునుజూచి అదేమోయని యొఱుఁగ విగనరీ యుత్కంఠితుఁ డయ్యెను."

"మీరందు ఛిన్నహస్తమును జూచి యుందురు. చేయి నీవలికిఁ దీయ మీమిత్రుఁడు పెట్టినంటిన ద్రొక్కుమును నొక్కెను గదా! అత్తటి మీరిద్దరు మాత్రము నుంటిరని మీరు తలఁచితిరి. కాని మఱుఁగున మఱొకఁడు పొంచియుండి మీనుడువులను వినుచుండెను. మీరేమనుకొనినది, చేసినది అతని ద్వారా చోరులకుఁ బిదప తెలిసినది. కంకణము మీరు గ్రహించుటయు, నాఛిన్నహస్త రమణికై వెతకుటయు మొదలుగాఁగల మీప్రయత్నము లన్నియు నెప్పటికప్పు డామెకుఁ దెలియుచుండెడివి."

"ఆవిశ్వాస ఘాతకుఁ డెవఁడో మామాటలను విని, ధనాశచే వాని నామె కెఱిఁగించుచుండువాఁడు."

"అతఁడు ధనాశచే నట్లొనరింపలేదు.—సంగతులన్నియుఁ దెలిసికొని కంకణమును మరల గరగత మొనరించుకొందునని ఆరమణి ప్రతిజ్ఞఁజేసి, తన కార్యనిర్వహణార్థము అతులసాహస సంపన్నయైన యొక మానినీమణిని నియమించినది.—నిర్జనసౌధమున మీరు

చూచి యున్న సుందరియే యామె. ఎన్ని చిక్కులం బడినను, దన సంకల్పమును వీడక తుదకు సుందరి కంకణమును సంగ్రహించియే తీరెను—తదుపరి జరిగిన సంగతులన్నియు మీరెఱుంగనే యెఱుంగుదురు.”

“అవును! నే నొక్కటియు మఱువలేదు. సుందరి చోరాంగన కాదనియు, అన్యుల యాదేశమున నట్లు ప్రవర్తించుచుండెననియు నేను ముందే యూహించితిని. ఏలనన నామె రెండు హస్తముల నుపయోగించి యేపనినైన నవలీలగ జేయజాలెడిది. రూపముం బట్టి చూడ నామె రష్యా స్త్రీ వలె నాకుఁ దోఁచలేదు.”

“ఆమె ఫ్రాన్సు దేశపు స్త్రీయే.—ఒక పోలండువానిని బెండ్లి చేసికొనినది.”

“ఎట్టి దౌర్భాగ్యము. నామనసున నొక సందియమున్నది. సుందరి కాపించిన దీర్ఘ ప్రహసనాభినయమున మొదటినుండి తుది వఱకు మీతోఁట కాఁపరి తోడామె నెందుకని?”

“అతఁ డామె జీవితేశ్వరుఁడు.”

“జీవితేశ్వరుఁడా! కళత్రముయొక్క ఇటువంటి చరిత్రముఁ జూచియు అతఁడు మిన్నకుండెనా? మిన్నకుండుటే గాక సాయము కూడఁ జేసెనే. అతఁడు వట్టి వెఱ్ఱివాఁ డనుకొనెదను.”

“ఆ కాంత విషయమై మీరనుచిత మూహించితిరి. ఆమె చరిత్ర మనింద్యమైనది. ప్రాణపతి యెడ నామె కర మనురక్తయై మెలఁగుచుండును; పతి యాదేశమును, దన యజమానురాలి యానను, ఆచానపాలించును—అంతియే!”

“గ్రహించితిని—కాని ఆమె రాబర్టును దాచియుంచనేల? దొర బారినుండి అతని రక్షించి మహోపకారమే యొనరించెను. కాని, పరపురుషు నొక్కనిఁ దన చెంత దాచియుంచుట అగాధపతిభక్తితో నెట్లు సరిపడెనో నాకు బోధపడుట లేదు!”

"మీరు వినినది సంపూర్ణమిథ్య. సుందరి రాబర్టు నొక భద్రప్రదేశమునకుఁ గొంపోయెను గాని, యతనితోఁ గలిసి కాపురము చేయుట లేదు. కలుష భూయిష్ఠమగు అమృతమును జికిత్సకుఁడు మీతోఁ జెప్పియున్నాఁడు. మిమ్ము విపాదకూపమునఁ బడద్రోయుటకే ఆకుమతి యీ క్రొత్త సంగతిని గల్పించెను. మీరాతని త్రోవ కడ్డుగుతిరి—మీ రెదుట నున్నచో, దన సంకల్పము సిద్ధింపదని గ్రహించి అతఁడు మిమ్ము దొలగించుటకే నిశ్చయించెను."

"ఇచ్ఛాపూర్వకముగ నే నాతని సంకల్పమున కడ్డు నిలువలేదు. వాని సంకల్పమేమి? అతఁడు కూడఁ గుట్రదారే యనుకొనెదను."

"నేఁ జెప్పిన కుట్ర కంతటికి అతఁడు ప్రధాననాయకుఁడు. రష్యా గవర్నమెంటునకుఁ బ్రతికూలముగ జరుగు కుట్ర లన్నిటి నాతఁడు నడుపుచుండును. కత్తికై కృషి సల్పుటందు వానికంటె నారితేరిన వా రెవరును లేరు. అతఁడు హంగేరియాసీమ వాసియని అందఱు తలఁచుదురు. కాని, యతఁడు రష్యాదేశస్థుఁడు. వాని పేరు విలాగస్ కాదు—గ్రిసేస్కో! అతఁడు దుష్టుఁడు!"

"సుందరీమణుల యాదరమును బడయుచుఁ బ్రీతిపాత్రుఁడగు చుండు నీయువపురుషుని హృదయమున నంత గరళమున్నదా? ఇట్లని కలనైన దలఁపలేదు. చౌర్యమున నతఁడు కూడ నుండెనుఁ గాఁబోలును."

"పత్రముల పేటిక నపహరించు కుట్ర నతఁడే పన్నెను. రాబర్టు అదృశ్యుఁడైనట్లును, అపరాధము లేకదే అతనిపై దోషారోపణము కావింపఁబడెననియు, ముందే యాతఁ డెఱిఁగెను. నిరపరాధులను నిగ్రహించుటలో నాతని కెంతేని యానందము. నిజముగ దోషి యగు వానిపై నెవరికిని సందియము కలుగలేదు. పత్రములను బడయ నిశ్చయించిన ప్రధాననాయకు నిర్దోషికి హితైషియై, అతనిపైఁ బడిన అపనిందను బాపఁ గృతనిశ్చయుఁడై వాని జాడ నన్వేషింపవాడఁగినది."

"ఉదార స్వభావురాలగు నామె నరపిశాచమగు చికిత్సకు నొద్ద తన యుద్దేశమును బ్రకాశ మొనరించెనా ?"

"లేదు;—కాని రాబర్టు పరిస్థితికి దుస్పిల్లు నామె మనోనిశ్చయము నాతఁడెఱుఁగుట కాలస్యము కాలేదు. కతిపయదినములలో కార్యదర్శియునికి నెఱిఁగి దొర చేతులనుండి యీతఁడు దప్పింప నాస్త్రీ తగు వెరవూహించుచున్నదని వైద్యుడెట్లో ఎఱిఁగెను. నేటి యుదయ మాతనిఁ గలిసికొని నప్పుడు మీ రేవిషయముఁ బ్రకాశ మొనరింప లేదు కదా ?"

"వలదని మీరు వారించినపుడెంతులకుఁ బ్రకాశ మొనరించుదును?"

"ఏమరుపాటున మీరేమైనఁ జెప్పియుందురని యనుకొనుచున్నాను. చికిత్సకుఁడు మాయలం దాఱితేఱినవాఁడు. ఏదేని యుపాయమున మీమనసునందలి మాటఁ దీసియుండును."

"నామనసునందలి మాటఁ దీయుటకు నే నంత మూర్ఖుఁడనా?"

"జీవనమంతయుఁ గుతంత్రములను గన్గొనుటయం దతివాహిత మొనరించిన వానికి మీరు చాలియుందురా? తమ చిత్తమందలి భావమును బ్రకాశ మొనరింపక, ఇతరుల మనసు నెవరు తెలిసికొన నేర్తురు? అతనితోఁ బ్రసంగించు తఱియేమఁటి యేమైనఁ జెప్పియుండ లేదా ? రాబర్టురు నిర్జనిలయమునకుఁ గొంపోయిన సంగతి మీ రాతనికిఁ దెలిపియుండ లేదా ?"

"ఈసంగతి అతఁడే తెలిపెను. 'పొరపడితి' రని మాత్రము నేనంటిని."

"రాబర్టిక నిర్జనసౌధమున లేనట్లు మీరు తెలిపి యుండలేదా ?"

"తెలిపినమాట నిజమే; కాని యతఁడీసంగతి ముందే యెఱుఁగును."

"నాయస్త్రశిక్షకుని గుఱించి మీ రేవిషయముఁ దెలుపలేదా ?"

"నేను—మఱి, నేను—"

"చెప్పినదేమో దాపక తెల్పుఁడు. మీ రిరువు రేమేమి యనుకొంటిరో నే నెఱుఁగ వలయును."

"నిర్జన భవనమున నిన్న రాత్రి జరిగిన సంగతులు నే నాతనికిఁ జెప్పలేదు. నాటకమందిరమున మీ యస్త్రశిక్షకుని సుందరిచెంత చూచితి ననిమాత్ర మంటిని."

దేవియనింద్యసుందరముఖము పాండువర్ణాంకితమైపోయెను. మెల్లని స్వరమున నామె యిట్లనెను. "మీకు వందనములు.—వైద్యునితో మీకు సల్పిన ప్రసంగఫల మేమిటో గ్రహించితిని!"

"అస్త్రశిక్షకుఁడు నిరుపేదయనియు, అతనికిని సుందరికిని ఎట్టి సంబంధము లేదనియు వైద్యుఁడనెను."

"నేను పల్లెకరిగినట్లు చెప్పినపిదప అతఁడట్లనెను గదా?"

"అవును."

"మీయొద్దనుండి గుట్టునంతయు వెలిబెట్టి, అట్లని మీకు నాయొద్దఁ జెప్పుదురనియు, నాకును రాబర్టు నుద్ధరింప నిశ్చయించిన మానినికిఁ గల చెలిమి మెయి తన యుద్దేశమును నేను నెచ్చెలికిఁ దెలిపివేసి తన యత్నమును శిథిల మొనరింతుననియు గ్రహించి, మన మిరువురము కలిసికొనకుండుటకై చికిత్సకుఁ డీయుపాయమును బన్నెను."

"ఏమియు నెఱుఁగనివాని యట్లున్న వాని పొట్టయం దెట్టి కుతంత్రములు నిండియున్నవి!—ఇట్లని యెఱుఁగను. ఇఁకనాకడ నీయాటలు సాగవని రెండు పిడిగ్రుద్దులతో వానికి బోధపఱతును."

"త్రాఁచుతో చెలగాట మెందులకు? ఇందు నేనొకతెనే కలుగఁజేసికొందును. మీరు మిన్నకుండుఁడు.—మీ పరిచితుఁడు రాబర్టు నిరపరాధియని యెఱుఁగుఁడు. రెండవసారియు కోటఁజొచ్చి, పత్రముల పెట్టెను దొంగిలించినది మొదటితూరి జతనమున విచ్ఛిన్నహస్తయగు

రమణితోఁ గూడ నున్నవాఁడే!"

"రాబర్టునకు నోట్లకట్ట యెట్లు దొఱకెను?—మందసమునుండి అపహరింపఁబడిన దదియేయని విగసరీ యనెను."

"అతఁడు పొరపడి యుండును.—లేక అసత్యము వచించియుండును?"

"అట్లని చెప్పిన కౌశీపతి విశ్వసింపఁడు. కాని, మీహితు లాతని మ్రోల కరిగి చెప్పిన నతఁడు విశ్వసించును. తన తప్పు నొప్పుకొన సాహసింపనిదే చోరాంగన అట్లొనరింపఁజాలదు గదా."

"ప్రజలకు శాత్రవులైన పాలకులకుఁ బ్రతికూలముగఁ గావింపఁబడిన కార్య నొప్పుకొన నామె యిచ్చగింపనిచోఁ గౌశీయధినాధుని మ్రోల కామె పోఁజాలదనికదా మీరనుచున్నారు? ఈవిషయమున నామె కావంతేని భయములేకుండుటటుండ,—ఇత్తఱి దన చెయువు నడఁచి యుంచుట కామె యిచ్చగింపకుండుటటుండ, గర్వమున నుత్తమాంగమెత్తి, తన మహదుద్దేశము నామహిళ నలువంకలఁ జాటి నిజోద్యమమును సాధించుకొనును!"

"రాబర్టు నిక్కముగ నిర్దోషియే యైనయెడల ప్రజల మ్రోలకు వచ్చుట కాతఁడేల వెఱచుచుండెను?"

"నాచెలికత్తె వారింపకున్న యెడల నతఁడింతకుమున్నే తాను నిరపరాధినని మెల్లఱ మ్రోల ఋజువుఁగావించియుండును!"

"అట్లైన రాబర్టు హితురాలియింట విడిసియుండెనా!—చోరాంగన మీహితురాలేనా?"

"అవును. గతరేయి నీవు గాంచిన యద్భుతసంఘటనముల యనంతరం మాతఁడెందుఁ డలదాచికొనునని తలఁచితిరి?"

"నిరపరాధి అపరాధినికడ దాగియుండి తన నిర్దోషత్వమును నిరూపించుకొనుటా?—బాగు!"

"నాసఖ యుద్దేశ మిట్లాదప్రాయమైనది.—చౌర్యమున పాలు గొనినవా రామెపెనిమిత్తము గోశీపతి ముందర దను దోసము నొప్పు కొని రాబర్టు నిరపరాధియని నిరూపింతురు."

"మీరాతనిం జూచియుంటిరా?"

"నానెచ్చెలియింటం జూచితిని."

"గోశీపతినిజూడ నాతండు సంసిద్ధుండయియుండెనా?"

"నేండే అతండు వర్జిన్సపాలి కరుగును.—నేం గూడ వెళ్లుదును. మీరుకూడ రండు."

"నేం గూడవచ్చిన కార్యమేమి! రాబర్టు అపరాధియని వర్జిన్స మెలిసులకు నొక్కి చెప్పితిని."

"అప్పటి మీవిశ్వాసము ననుసరించి మీరట్లు వచించితిరి.— ఇప్పుడు మీకు సత్యము తెలిసినపుడు మిన్నకుండుటేల? మీ రెన్నండేమాటయు మఱుగుపఱుపలేదు. కుమారి మీనుడువులను నమ్మ తీరును."

"నమ్మవచ్చును. కాని, కుమారినింజూడక, గోశీపతి మనకనుమతి యొసంగునా?"

"ఈవిషయము ముందే యూహించి, యామె ప్రాణపతిని రక్షించు వెరపుంజూపుదునని తెలుపుచు రమ్మని కుమారికి జాబు వ్రాసితిని. ఆమె తప్పకవచ్చును."

యువకుండు కుమారిని బాగుగ నెఱుంగుటచే; సరళస్వభావయైన యాబాల తుదివఱకుం దన యాశారజ్జువును వీడదని అతండు యోచించుచుండ నాకస్మికముగ నెవరియలికిడియో అతని చింతా స్రోతము నరికట్టెను. ముందలనున్న నికుంజాంతరాళమునుండి ఎవరో యరుదెంచుచున్న ట్లాతండు గ్రహించెను. దేవి చింతామగ్నయై యుండెను; అకస్మాత్తుగ నొక లతాంగి కరపద్మము లతాయవనికను

దప్పించెను. అపుడు పుష్పిత లతాజాలము మధ్యమున పుష్పాధిక సుందరానన మొంచు లోనికిఁ దొంగిచూచెను.

"ఓహో! సార్జెంటుదొరసాని!—సుందరి! సుందరి!!" అని యువకుఁడనెను.

దేవి చకితయయ్యెను. కాని, ఆ విహ్వలత క్షణికము మాత్రమే!—

"జస్టాయిన్!" అని యామె పిలిచెను.

ప్రతతీవాటికమును దప్పించుకొని, సుందరి వాని ప్రోల కరుదెంచెను. ప్రజాపతి పట్టుపట్టి వ్రాసినట్లు అపూర్వసౌందర్యసంశోభితయైన రమణి దాసీవేషమున దృగ్గోచరయయ్యెను. మేక్సిమునుఁ జూచి ఆమె యక్కజము చూపలేదు. అతఁడుమాత్రము విస్మయచేతస్కుఁడయి పోయెను!

దేవి—ఏమి వార్త?

"ఆ కాంత యరుదెంచి, మీకొఱకై వేచియున్నది."

"వైద్యుఁడు కూడ వచ్చెనా?"

"లేదు.—కాని, అతనికడనుండి ఒకచిన్న పేటిక వచ్చినది.—అది మీ శయనమందిరమున నున్నది."

సుందరి అవనతమస్తకయై అవ్వలి కరిగెను.

నీరవనిశ్చలమూర్తియై యువకుఁడు కూర్చుండియుండెను. దేవి నేమి యడుగుట కాతనికి సాహసము చిక్కలేదు. అనిమేషలోచనుఁడై, అతఁడా లోలాక్షిని విలోకింపఁదొడఁగెను.

"కుమారి ఎలిస్ అరుదెంచెనఁట. పోయి, మాట్లాడవలెను. మీరుకూడ వత్తురా?"

"నేనిపుడామెను జూచుటుచితమగునో కాదో యని సంశయించుచున్నాను."

"సంశయింపకుఁడు. మీరుకూడ నుండుట మంచిది."

"మీరు చెప్పినచొప్పున నాచరింప సంసిద్ధుఁడనే. చోరుల సహకారిణియైన యీసుందరి—నా పరిచారిక ! ఇఁక నాలసింపక రం''డని దేవి లేచి నిలువఁబడెను. ఇఁకేమియు మాటాడక యువకుఁ డామె వెన్నంటి చనుచు, "నాకడనుండి కంకణముఁ గైకొని చనిన యీ యామెయు, నీమె సహకారియగు వనమాలియు దేవి యధీనమున నుండిరి. చౌర్యమున వారొక వీరాంగన యీ దేశమున పనిచేసి యుండిరని దేవి చెప్పినది. దేవియే ఛిన్నహస్తయగు నావీరకాంత కాదుకదా !'' అని వితర్కింపఁదొడఁగెను.

రాజహంసికై వడి దేవి యున్నతగ్రీవయై, ప్రశాంతముఖియై, శుచిస్మితలోచనయై, ధీరపాదవిక్షేపమున నగ్రసరయయ్యెను. ఇరువురు ఉద్యానభూమి నతిక్రమించి, కొండొక కుటీరద్వారమును సమీపించిరి. పదఁపడి దేవి రెండవయంతస్తుపైఁగల ఒక యాగారములోనికి తనిని గొంపోయినది. యువకుఁ డాగదియందుఁ బూర్వదిశమున నొక యున్నతపర్యంకమును జూచెను. యవనికామండితద్వారము దిక్కుగ నంగుళి నిర్దేశించి, దేవి యిట్లనెను. "కుమారి ఇందే యున్నది. మీరు ముందుపోయి, నా యభిప్రాయము నామెకుఁ దెలిపిన బాగుండదా ?''

"వలదు. నేను తన చెలువుని విపక్షీయుఁడనని ఆమె యభిప్రాయము. అందుచే నామాట నామె చెవిఁబెట్టదు. మీయెడ నామె కధికవిశ్వాసము కాన మీపల్కుల నామె వేదాక్షరములుగఁ దలఁచును."

"అట్లైన నిరువురము బోదమురండు.''

ఇరువురిదృష్టు లాకస్మికముగ మేజాపైగల ఒక యపురూపపు పెట్టెపైఁ బడెను. పేటిక యెత్తైనది.

స్మితముఖుఁడై మేక్సిము "ఇది మీ చికిత్సకుఁడంపిన పెట్టెయై

యుండు'' ననెను.

మ్లానవదనయై, పెట్టెదెఱచి దేవి యొక పుష్పగుచ్ఛము నీవలికిఁ దీసెను.

యువకుఁడు—ఓహో! ఎట్టి హారము.

దేవి మాటాడలేదు. పూగుత్తి ఆమెచేతినుండి జారిపడినది. ప్రభాతప్రసన్నపద్మతుల్యమైన యీ మహిళముఖము పాండురమై పోయినది. ఇంతకుసేపట్లయుండి "ఇది ప్రాపించునని యనుకొనుచునేయున్నాను" అని యామె వచించెను.

"చికిత్సకుఁ డీహారము నేలపంపెను?"

"నాసుకరణశిక్షఁ దెలుపుటకు."

"ఏమి!—ఎందులకు? ఈకతోంద్యాజ్ఞ నొసఁగువాఁడా నరాధముఁడా?"

"ఆన యొసఁగినది విద్రోహులు,—శశాంకుఁడు వారి నాయకుఁడు. వారిమ్రోల నేను విశ్వాసహంత్రినైతిని!"

"మీరా?"

"వారితో నాకు సంబంధమున్నది—దానికిఁ దగిన ప్రతిఫలమిది"

యువకుఁడేమో పల్కుచుండ నింతలోఁ బరిచారిక ప్రవేశించి, ఆతనికిఁ దెలియని భాషలో నేమో చెప్పెను. దృఢస్వరమున దేవి యువకు నుద్దేశించి—"ఇంతకుఁ దడయుచు ఇప్పుడు శ్రుతమగు ప్రసంగమువలన మీకింతయు బోధపడును—రాబర్టు నిర్దోషియని మీరును, సుకుమారికని బాలఁ దెల్లముసుఁగు—తోడనే గదిలోఁ బ్రవేశించుడు"

"మీకేమియు నాపదరాదని శపథమొనరించి చెప్పుఁడు"

"ప్రస్తుతమేమియు భయము లేదు. యవనికాంతరమున నిలిచి, చెవియొగ్గి నాప్రసంగము వినుఁడు"

"మంచిది. అవసరమైన యెడల, మీకుఁ దోడ్పడుదును."

తోడనే వైద్యుఁడు విలాగన్‌గదిలోఁ బ్రవేశించెను. అతని యాకారము స్థిరమై గంభీరమై యున్నది. కన్నోయి యుజ్జ్వల జ్వాలాభాస్వరమై యుండెను! అతని భీకరాకారముఁ జూచి, దేవి యించుకైన భయపడక స్థిరస్వరమున "తాము నాకు మరణశిక్షవార్తఁ దెలిపితిరి. ఇప్పుడు మీ యిచ్ఛయేమి? ఏలవచ్చితిరి?" అనెను.

"మిమ్ము కొన్ని విషయములు ప్రశ్నింపవలసి యున్నది"

"మరణదండనము విధింపఁబడిన వెనుక, నీక ప్రశ్నల ఫలితమేమి?"

"మీకుఁ గొందఱు సహకారులున్నారు—వారెవరో నాకు జెప్పితీరవలెను. మాకు విశ్వాసఘాతుకము చేసి నందులకు మీరు తగిన దండనము పడయువలెను."

"నా యపరాధమేమో తెలిపినపిదప మీకేమి సమాధానమొసఁగవలయునో యోచింతును."

"ముందు వెనుక లాలోచింపక మా మార్గమును గింటకిత మొనరించి, మా నిశ్చితసంకల్పమున కడ్డు నిలుచుటయే మీ యుపరాధము. కాశీపతియింట దొంగతన మొనరించెనని, ఆబాలగోపాలము లోకులెవనిపై దోషారోపణ మొనరించిరో, వానిని వెతుకవలదని ఎన్నిసారులు వారించినను, మీరు నా నుడువులను బెడచెవిఁబెట్టితిరి. అంతియెగాక ఒక ప్రాన్సువాసిని సహచరునిగఁ గైకొని చిరకాలమునుండి మనసమితి కోసరమై తమరక్తమును జిమ్మి పనిచేయు వానినిగూడ మీ యనుచిత కృత్యమున నియోగించితిరి. ఒక్క విదేశీయునిఁ గాఁపాడుటకై మీ కుప్రశిక్షకుఁడును, సుందరియును, మీరును మొక్కవోని శౌర్యముతోఁ బనిచేసితిరి! తన సద్దోషత్వమును రూఢిపఱచుట కా విదేశీయుఁడు ప్రకృతిదోషుల పేరుయే తెలిపి వేయును. అతనికి విద్రో

హాలపేరు లన్నియుఁ దెలియుచున్నవి, వానిని రక్షింపఁ గంకణముఁ గట్టుకొనిన మీరు నిర్ద్రోహులు నాయకులు పేర్కొని మా కెంతేని యాపద నాపాదింతురు—అందుచే నిమ్మూర్ఖులతో నుండనీయు టుచితము కాదు”

“నాబర్తను రక్షించుట కొఱకు చౌర్యోద్యమంతయును గొట్టికిఁ జెప్పవలసియున్నను నా పేరు తక్క నే కొరుల పేరులను జెప్పను”

“ఇఁక మిమ్ము నమ్మజాలను—అత్యాచారియగు రష్యాయేలి కకుఁ బ్రతికూలముగఁ జాలకాలము హృదయపూర్వకముగ మాతోఁ బని సలిపి, మీరేల మాయూర జనగాటి మూకకుఁ విలిచిరి!”

గర్వవిస్ఫారితనయనయై వైద్యుని దేశిమాని, గంభీరస్వరమున దేవి యిట్లనెను. “రష్యాసామ్రాజ్య ప్రాసాదమున కగ్ని దరికొల్పి, మానవప్రకృతికి బ్రతికూలమైన దుర్దాంతకుమప్రవృత్తి మొనరింప వెనుదీయని వారితో నింకెట్టి సంబంధము నుంచుకొనుటకును ఇచ్చట్లా అంత తుచ్ఛురాలు కాను!”

బుజము నించుక సంకుచిత మొనరించి, చికిత్సకుఁ డిట్లనెను.

“మీనోటినుండియీపలుకులు వినవచ్చునని నే నెంచియుండలేదు. బహువిలంబనముగ మీ మనసున నీ ధర్మజ్ఞాన ముదయించినది. అత్యాచారమునకు విరుద్ధముగ నిలిచి, ఆహవ మొనరింప మీరు శపథ మొనరించినపుడు, అత్యాచారవిధ్వంసనార్థము అపియున్నల యాశ్రియముఁ గొనవలసి వచ్చునని మీ రెఱుంగక పోయియుండలేదు.”

“ప్రజలను బీడించు రష్యారుష్ణిని నుకముడంచి, మీ రెల్ల కడల శాంతిస్థాపన మొనరింతురని మీ సమితిఁ జేరితిని. కాని, ఉద్దేశసిద్ధిఁ గావించుకొన మీ రవలంబించిన యుపాయములు మిగుల హేయముల గుట నుపలక్షించి మిగుల విచారించితిని. ఘృణిత నరహత్యలఁ జేయఁ జేసికొని, రాజాంతఃపురమున కగ్ని గొల్పినట్టి సాహసవంతులైన సేనా

నుల పాశములఁదీసి భయదకృత్యములకు మీరలు పాల్పడుదురని నే నూహింపనైతిని. ఘోరసంకటములందుఁ బడి, అనన్యోపాయులై, మనసమితి వారీవరలో నిష్ఠురకృత్యము లొనరించిరి కాని సహనమే తమ కార్యనీతి యని వాదించి యుద్దేశపూర్వకముగ దానికి వారు చేయిఁజేసి కొనలేదు. సెంటిపీటర్సుబర్గునుండి నేఁడు వినవచ్చిన వార్త నా హృదయమును విదీర్ణ మొనరించినదైనది. మీ చరిత్రము లిప్పుడు నాకు బాగుగ బోధపడెను. విలువఁబెట్టి, నా ప్రాణములను గూడ మీ కూడ వెఱుకఁజాలుదురేమో కాని, నన్ను మరల మీసభలము లోనికిఁ జేరఁ దీసికొనఁజాలరు!"

"అట్లైన నొక యపరిచిత విదేశీయుని కొరకై మీ సుపుత్రుని బాయ కృతసంకల్పులైతిరా? దుర్నయమునకుఁ బ్రతీకార మూహించి, నిరీహాత్కులు మొనరింపఁబూనిన ట్లభినయించుచున్నారు గాని మీ ప్రకృతోద్దేశ మన్యమైయుండును.—చెప్పనేల? రష్యా సామ్రాజ్యమును గలసి నూతయుండఁజేసి మట్టువెట్ట మీరు సమకట్టుచున్నారు."

క్రోధకంపితస్వరమున దేవి యిట్లనెను. "మహారాజు! మనసునఁ బోటెచ్చి, యనుచితములు నుడువుదు, నాకిఁక సహనముఁ జరుపకుఁడు. అట్లొనరింప మీకధికారము లేదు.—నాయతీత జీవన మందములకు సాక్షి! పోలండు దేశస్వాతంత్ర్యము కొఱకై అసిహస్తుఁడై, బంధితుఁడై, దురంతసమ్పీడనముల కొక గుఱియై సహించి, సైబీరియాయందెవఁడు ప్రాణములను స్మితముఖుఁడై పరిత్యజించెనో, ఆతని తనూభవనై జన్మించి, స్వీయదేశమును పారతంత్ర్యశృంఖలములనుండి విముక్తి చేయుటకు మీ సమితియందుఁ జేరి నిర్భీకులగు యోధులకును, సాహసోపేతలైన వీరనారులకును స్వాతంత్ర్యమంత్ర ముపదేశించితిని. ఈ మహోద్దేశ సిద్ధి కొఱకై యే అనన్యాభిప్రాయులై, అహర్నిశలు దీక్షమెయి వారు కృషిసల్పుచున్నారు. కాని, యిప్పటున ఉచ్ఛ

ప్రవృత్తులను మాన్పి, నీచకృత్యములకుఁ దొడఁగు సమితినిగాంచి యంతనే బిడియముచేఁ దలవాల్చుకొనుచున్నాను. నాయుత్తరశిక్షకుఁడు నాకు క్రైస్తవయనుచరుఁడై మెలఁగుచుఁ దాను దేశహితార్థమై నిరంతరకృషి సల్పుచున్నట్లు నమ్ముచున్నాఁడు. జస్టాయిన్ పేరిస్ సుందరి—వివేకవంతుఁడును, జనకుఁడును పోలండు సీమస్థులు కావున స్వాతంత్ర్యమంత్రము నామెకూడ నిరతము జపించుచున్నది.—సాహసుఁడగు జర్జియు నన్నాగతించి తనస్వాధీనతను,—స్వాధీనతయే యేల నిజజీవనమును సహితము విపన్నమొనరించుకొనెను. అతఁడొకప్రాన్సీయ భద్రపురుషుని మనుమఁడు ఆ భద్రపురుషుఁడు పోలండుదేశమునకయి సమరమొనరించి, తనయసువులు స్వాతంత్ర్యమాత కర్పణమొనరించెను. ఫ్రాంసువంశప్రసూతయైన వెలిన్ సికాదేవి క్రీ.శ. 1831 వ సంవత్సరమున విప్లవసమయమున నా మహాత్ముని బరిణయమాడి, సుఖదుఃఖము లందాతని సహభాగినియై, దేశహితార్థమై నిజసుఖసౌభాగ్యాది సమస్తభోగములకు జలాంజలి యొసఁగి నలువదేండ్లనుండి సామాన్యమానవిమాదిరి బ్రతుకుచు, ఇప్పుడుకూడ దేశాభ్యుదయమునకయి పరిశ్రమ సల్పనిముఖ యగుటలేదు! కాపురుషులై, నరహత్యాకృత్యములఁ గలుషితులైన ప్రమత్తుల చెంతగల కామె తోడ్పడునని ఆశపడుచుంటిరా?"

"క్రాంతిచౌర్యమున సాయమొనరింపఁ బౌత్రేసు కామె అనుమతి యొసఁగెనుకదా?"

"శత్రుహస్తగతములైనందున నేపత్రముల మూలమునఁ బెక్కండ్రు స్వీయదేశస్థుల జీవనము లాపదపాలుగా నుండెనుగాన వానినెట్టులైనఁ బడయుటకై నేనొనరించిన యత్నమున నాతఁడు నాకుసాయమొసఁగి, వలయునప్పుడు నా యాజ్ఞ పాలించెను. ఈ కర్తవ్యనిర్వహణార్థమై నేను నా జీవనము నుత్సర్గమొనరించితిని. కాని, ఈ కార్యసాధ

నమున నే నెట్టి యాతనమును సహించి యుంటినో మీ రెఱుంగక పోలేదు."

"అవును—మీ రసాధారణ వీరత్వమును బ్రకాశమునరించితిరి! ఇంతకాల మనిర్వచనీయమైన నిపుణతచూపి,—మొక్కవోని ధైర్యమున గనపఱచి, సమితికి శుభదాయకులై వర్తించి, తుదకిప్పుడేల, నిట్టియున్మాదమున తోడివారంకఱచి త్యజించి నై చితిరో నాకు బోధపడలేదు. కోఠీయందట్టి భయానక కృత్యము జరిగినప్పాడి, మీరెన్నెని యద్భుత కార్యములను సల్పియున్నారు. శవాగారమునుండి మీరు నమాలి ఛిన్నహస్తము నపహరించెను. నీడవలె మిమ్మనుసరించు సుందరి మా రహస్యములను గ్రహించుకొని వచ్చెను. ఈ కార్యములన్నియు మీ ప్రతిభ యొక్క యద్భుతఫలరూపములే! ఒక్కమాఱుగ మనసమితియందు బల్వురప్రాణములూడనున్నతఱి కౌశలముతో మీరు వారిని గాపాడితిరి! కాని, ఆకస్మికముగ మీ యౌదార్యము నేటగలిపి, ఎన్నపర్యాయములు వారించినను వినక తోడివాండ్రతో గయ్యమునకు డాసరి, ఇంతకుమున్ను పడినకష్టము యొక్క ఫలమును నష్టమునరింప మీ రుద్యమించినారు. అకస్మాత్తుగ మీ మనసున నిట్టి భావాంతరమేల ఘటిల్లెనో తెలుపుదురా?"

"ఒక నిరపరాధిని రక్షించుటకంటె నిందులకు వేఱుకారణము లేదు. నిర్హేతుకముగ నాబర్టుపై దురంతాపవాద మారోపింపఁబడిన ముహూర్తమునుండే, అతని నెట్లయినఁ గళంకవిమోచనుఁ గావించి, వానికిని వాని ప్రణయభాగినికిని అజ్ఞాతనై కావించిన యనిష్టను మాపు చేయ నిశ్చయించితిని."

అట్లైన మీయాపదను ఆహ్వానించుకొనుటకే చూచుచున్నారా!—మీ యపరాధమునకు క్షమాపణ లేదు. అయినను, రెండుషరతుల కంగీకరించుచో, మిమ్ము మన్నింతుము."

“శ్రమపడి తా మేషరతులను దెలుపనక్కఱలేదు.—నే నేబంధనమునకు సమ్మతింపను.”

“ఇంక నెన్నఁడును దిరిగి రాని షరతుపై తోడనే మీరు ఫ్రాన్సు దేశమును వీడిపోవలెను! ఇది మొకటిషరతు. రెండవది అస్త్రశిక్షకుని తోడ్పాటున సుందరిసన్న నిశీథిని రాబర్టును గొనివచ్చి మీయింట నుంచినది. బ్రదుకవలెనను వాంఛ యున్న యెడల, వెంటనే అతని నా కప్పగించవలెను.”

జుగుప్సఁజూపుచుఁ జిరునగవునవ్వి దేవి—“ఏమి! రాబర్టును మీ కప్పగింపవలెనా?—అతనిగుండెలుతీసి గుటుక్కున దిగమ్రింగుదురా యేమి?” అనెను.

“అతనిపైఁగూడ మరణశిక్ష విధింపఁబడినది. మీ రెంత యత్నించినను, అతనికి నిష్కృతిలేదు!”

“ఘృణితమై, కాపురుషోచితమైన ఈ నుడువుల నా మ్రోల నుచ్చరింప విచ్చేసితిరా?—నన్ను మీరు బాగుగ గుర్తింపఁగలిగితిరని యనుకొంటిని.”

“ఈ సబంధనములకు సమ్మతించుటలేదా?—ఈమాటైన యోచించి యుత్తర మొసఁగుఁడు.”

దేవి ఉత్తర మేమియు నొసఁగక, ఘంటారజ్జువును లాగి, అంగులిచే అతనికి ద్వారముఁ జూపెను. దానిఁ గాంచి చిత్రసుఁ డిట్లనెను:

“మంచిది, ఇందుండి చనుమని యాదేశించుచున్నారా? నేనిఁక నీ ప్రదేశమునకు రాను.—మీరు నన్నుఁ జూడఁగలుగుట కిదియే తుదిమాఱు! నేటినుండి పదునేను దినములలో మీరిహలోకము నుండి సెలవుఁ గైకొనవలయును.—మీరేకాక మీకు తోడుపడి, మీ విశ్వాసభాజనులైన వారుకూడ మిమ్మనుసరించి పరలోకమునకుఁ జనవలయును!—దేవీ! మీ మృత్యువు నా హృదయమునకు

వ్యథయే కల్గించును!—ఇచ్ఛగించినచో మా సమితికిఁ దలమానికమై మా కెల్లరకు మీరు పూజనీయులై యుండువారు!—కాని, అట్టి యోగ్యత కలుగుటకుమారు—తాదృశ మహద్దశ యలవడుటకు బదులు, విశ్వాసహంత్రికి వలసిన మరణశిక్ష మీకు వాటిల్లుచున్నది! అదియే మీ వాంఛ యగుట అక్కజము!”

చికిత్సకుఁడు గృహమునుండి నిష్క్రమించెను. అవ్వల వేచియున్న వనమాలి ఆవలిగుమ్మమువద్దకుఁ జని అతనిని సాగనంపెను. తోడనే మేక్సిము యువనికాభ్యంతరమునుండి యీవలికి వచ్చెను. కుమారి అతనివెనుక నిలిచియుండెను—ఆమె కమనీయతనువల్లరి కంపించుచుండెను. ఆమె ముఖము వివర్ణమైపోయెను—మాటలాడుటకైన ఆమెకు శక్తిలేదు.

“దేవీ! మీ ప్రసంగము సంతయు వింటిని” అని వివర్ణముఖుఁడై మేక్సి మనెను.

అతికోమలకరుణార్ద్రహాసము దేవి యధరమును రంజిత మొనరించెను. మెల్లని స్వరమున నా మహిళ “ఇపుడు నా మృత్యు వాసన్నమైనది!” అనెను.

“మృత్యువా!—ఆ దురాత్ముని మృత్యువే యాసన్నమైనది! నాతరవారిచే శిరము వేయి ఖండము లొనరించి, నిముసములో వానిని యమసదనమున కంపుదును?”

“ఈ దురాత్మునిఁ జంపి, మీ యమూల్యజీవన మాపదలపాలొనరించుకొనకుఁడు—అయినను రాబర్టు నిర్దోషియని యిపుడు మీ రెఱుంగ గలిగితిరిగదా! ఇఁక నేను మరణించిన నేమి?”

“మీరు మరణించుటేల?—ఇట్టి దుర్మతి యిఁక మనియుండఁ గూడదు—రాబర్టునుగుఱించిన సందేహము నా మనసునుండి తొలఁగి పోయినది. తను ఋజువుఁ జూపఁజాలితిమేని, వృద్ధుఁడుకూడ రాబర్టు

నిర్దోషియని నమ్మెను. రాబర్టు విడిచివచ్చినగృహమునకే నే నాతనిఁ గొంపోవుదును—నేఁ డా దున్నతమస్తకుఁడై, గోష్ఠీ మధ్యమునఁ బ్రవేశించును—అతఁ డిపు డెం దున్నాఁడో? లేక మఱొక ప్రదేశమున నుండెనా?"

"ఇందే యున్నాఁడు—స్వయముగ నే నాతని గోష్ఠీపతిపాలికిఁ గొనిపోదును. వానికి నే నొనరించిన యుపకారమునకుఁ దగు ప్రతీకారము సలుపుదును."

"కాని, నా మాతులుఁడు—"

"నన్నుఁ జూచుట కియ్యకొనఁడేమోయనియా?—అందులకు మీ రాతని నంగీకరింపఁజేయవలయును. నిముసమునకు మున్ను మీరు వినిన యుదంతము నంతయు ఆతనికిఁ దెలుపుఁడు. ఇఁక దాఁచియుంచవలసిన దేమియు లేదు. దేశభక్తులను నమ్మి, నిష్ఠురులైన విద్రోహుల సమితినిఁ గలిసి యాత్మావమానము నలిపికొంటినని లోకు లెఱిఁగినను, విచారపడను. విద్రోహులు చూపు భయప్రదర్శనమునకు భయపడుదాననుగాను! చెప్పనేల? ఈ రహస్య వృత్తాంతము నెల్ల తావులఁ బ్రచార మొనరింపుమని గోష్ఠీపతిని వేఁడుదును."

"అట్లొనరింపఁ బూనుకొనకుఁడు. ఇచ్ఛాపూర్వకముగ మీ రేల విపన్మహార్ణవమున లంఘించెదరు? రాబర్టు కళంకముక్తుఁడైన జాలుఁగదా! నేఁ డని మీయాగమనవార్త మాతులునకుఁ దెలుపుదును. ఇఁక నన్యాలోచన మనావశ్యకము."

దేవి కుమారినిఁ దేఱిఁ జూచెను. కంపితస్వరమున "మీ హృదయమునకు నే నెంతేని క్లేశముఁ గలిగించితిని—నా యపరాధమును మన్నింతురా?" అని దేవి పలికెను. కుమారి ఏమియుఁ బలుకనేరక పోయెను. ఆమె కోమలకపోలములనుండి కడు వడిగ నశ్రుబిందువులు జాలువాఱుచుండెను!

దేవీ—నిక్కముగ నేను మీయెడ నిష్ఠురనైతిని. మీ ప్రేమాస్పదుని నామము కళంకిత మగుట వినినంతనే, మీ జనకుని ప్రోల నా యపరాధము నొప్పుకొనియున్నయెడల, అతని హృదయమును బీడించిన సందేహము మాయమయ్యెడిది. ఉదాసీననైయుండి కలుష మొనరించితిని—నా పాపమునకు వలయు ప్రాయశ్చిత్తము చేసి కొందును. నా ప్రాణములపై నాకిక నధికారము లేదు—పగతురాయధికారముం గొనిరి! అందుచే మీ ప్రోల నేను నా జీవనమును నుత్సర్గ మొనరింపజాలను. కాని మీ దేశాధికారుల సమక్షమున నాత్మసమర్పణ మొనరించుకొనినయెడల, నా పాపమునకుం దగు ప్రాయశ్చిత్త మగునని యోచించితినేని, అందులకు సంసిద్ధనై యుందును. జగతీసమ్ముఖమున నిలిచి యుచ్చైస్స్వరమున 'నే నానరపిశాచుల సహకారిణి' ననియు, 'వారి కార్యనిర్వహణమునకై గురుతరపాప మొనరించితి' ననియుం బల్కుదును."

"వారికి సాయపడినారా?" అని కంపితకంఠయై కుమారి యనెను.

"ఇంకను సంశయ మందుచున్నారా? ముహూర్తమునకు మున్నానరాధమునితో నే నొనరించిన ప్రసంగము మీకు బాగుగ శ్రవణగోచరము కాలేదు కాంబోలు. మీ జనకుని కొఠియందు చౌర్య మొనరింప యత్నించినది నేనే!—నందియు మేల? చూడుడు!"

అని [illegible]ట్టాదేవి నిజప్రసాధనాగారమందలి ఒక బీరువాలో ప్రేలాడు కృష్ణ యవనిక నొత్తిగించెను. కుమారి చకితయై పోయెను. ఆవేగ కంపితస్వరమున దేవి "చూడుడు! ఇదె ఛిన్నహస్తము" అనెను.

"అట్లైన మీ చేయి ఛిన్నహస్తమేనా?" అని మృదుస్వరమున మేక్సి యనెను.

వామబాహువును ప్రసారిత మొనరించి, "ఇట్లని యెఱుంగరా?"

యని దేవి బాహుమణిబంధమున సంగలగ్నమై యున్న కృత్రిమ హస్తమును యువకునికిఁ జూపెను. ఒకదానివెంబడి నొకటిగ నన్ని విషయములు వానికి జ్ఞప్తికి వచ్చెను. దేవి యెన్నఁడును గరపల్లవ యావరణపు దీసివేయలేదు! చౌర్యరహస్యమున నాతని కవిదితమైన దింకేమియు లేదు!

దేవి—హస్తచ్ఛేదనకాలమున నీరవనై, మరణాధికయాతనము సహించితిని. కాని శోణితపాతమునఁ గలిగిన బాధ కంటె చికిత్సకుని కుట్రను సన్మతించినపుడు నధికక్లేశము కలిగినది. దేశముకొరకు రక్తము నొసఁగుచుంటినని యెఱుఁగుదును! అపూర్వసుందరియగు జష్టాయిన్ రూపము దిక్కుగ మీ దృష్టి మరల్చి, మిమ్ము మోహాంధులను గావించి, మాయాపాశముల బంధింపఁ జికిత్సకుఁడు మొట్టమొదట యత్నించెను. ఆసంకల్పము వ్యర్థము కాఁగనే సుందరిచే విఫలమైన కార్యము నావలన నెఱవేరునని యోచించి, అతఁడు మిమ్ము నానిలయమునకుఁ గొని వచ్చెను. ఆయత్నమున నాయసుఖము లూహింపవలసినదే! అపుడు కూర్చుండుటకైన నాకు శక్తి లేదు. ఉద్దేశసఫలతకొఱకై నేనొనరించిన యత్నమువలన నాబాధ వృద్ధియయ్యెను. నే బ్రదికినను, జచ్చినను అతనికిఁ బోవునదేమి?—చౌర్యమునకు సంబంధించిన వగు మాచిహ్నములన్నియు విలుప్తములైన యెడలఁ దాను కృతార్థుఁడగుదునని యతఁ డూహించెను. నేను పట్టుఁబడిన యెడల, నీకుట్రకంతకుఁ దానే నాయకుఁడని ప్రజలు గ్రహింతురని అతఁడు భయమందెను. రాబర్టు విపదవస్థ మీకు నాకుఁ దెలుపుదురనియు, నిరపరాధికళంకక్షాళనమునకు నేఁ బూనుదుననియు అతఁడు కలనైనఁ దలఁపలేదు.—తలంచియున్న యెడల, మిమ్మతఁడు నానివాసమునకుఁ గొని రాకనే యుండును. రాబర్టును రక్షింప యత్నించుచుంటి

సని, ఎఱిఁగిన దాది అతఁడు నాకు శత్రువై, రహస్యముగ నాతో పోరొనర్ప సంసిద్ధుఁడై, నాపై దివారాత్రములు కన్ను వేసియుంచుచు మదీయానుగతవ్యక్తుల జాడలను, గుట్టుమట్టులను బరిశీలించుటకై ప్రచ్ఛన్న వేషులను నియమించెను. కాని, మన మాతని బరాజిత మొనరించినట్లును, ఖైదీ విడుదలఁ బడసినని యు, గుట్టయందలి రహస్యము బయలుపడుట కింక నాలస్యము లేదనియు, గ్రహించినంతనే హితచ్ఛద్మ వేషమును బరిత్యజించివైచి, యతఁడు నాపై మరణదండనము జారీ చేసెను!”

“మీహితకాంక్షులును, మిత్రులును రూపఱలేదని యాదుర్మతి మఱచెను. అతని దండాదేశము కేవలము హాస్యముగనున్నది. వ్యర్థమైయే తీరును.”

అతని మాటల కుత్తర మొసఁగక కుమారి వంకఁ దిరిగి దేవి యిట్లనెను: “యువతీతిలకమా! మీ ప్రాణపతి ఉదారస్వభావుఁడు. ఉన్నతహృదయుఁడు. పవిత్రచారిత్రుఁడు. మీ యిరువు రేకమై సుఖించు కొఱకుఁ బ్రఫుల్లహృదయనై నాప్రాణములను బాయుచున్నాను. పరస్పరానురాగబద్ధులై, పవిత్రచిత్తులైన మీ రిర్వురు సఫలీకృతమనోరథులగుచున్నారు గాన నాయపరాధమును సైరింపుఁడు.—ఇంచుక సేపటిలో మీనాథుని మీజనకుని పాలికిఁ గొని వచ్చెదను.—సమ్మతియేనా?”

ఏమనుటకు ఎలిసుకు మాటాడుశక్తి లేకపోయినది.—ఆమె హృదయమున తుముల ఝంఝూనిలము విజృంభించిపోయినది. అప్పుడు మఱఁదలి సమ్మతిని మెక్సిమే సంజ్ఞాపూర్వకముగఁ దెలిపెను.

దేవి—తాము కుమారిని జనకునియొద్దకుఁ గొంపోయి, యతనికి నాయాగమనవార్తఁ దెలుపుఁడు. కాలహరణమొనరింపకుఁడు.—నేఁ డొనరింపఁజాలిన కార్యము రేపు నాకసాధ్యము కావచ్చును.

నాజీవనపరిమితి నిముసనిముసమునకు సన్నమగుచున్నదని గ్రహింపుడు.

దేవి నుడువులు యువకుని వీనుల సంతగాఁ జొచ్చుటలేదు. అన్యాలోచన మాతని మనసును బీడించుచుండెను. ఇంతకు తడసి "నోట్లు కట్ట రాబర్టుచేతుల నెట్లుపడెనో తెలియకున్నయెడలఁ గోటీపతి రాబర్టు నిరపరాధియని విశ్వసింపడు" అని యాతఁడనెను.

దేవి—ఎవఁడో శత్రువు అతని కరిష్టముఁ దలపెట్టి ఆపైకము నాతని పాలికంపెను. అది చికిత్సకుని కృత్యమే యైయుండును— ఆ చెనటి కసాధ్యమైనపని యేమియులేదు.—అర్థాభావముకూడ నాతనికిలేదు. రాబర్టు పడసినపత్రము మీయొద్దనున్నదికదా!—నాకా కమ్మను జూపుఁడు. మనమీవిషయమునఁ దగు పరిశోధన సలుపవలయును. అకస్మాత్తుగ నాతని కింత యర్థము లభించుట ఘోరకుతంత్రఫలమని మనము ఋజువుసేయఁజాలకపోము. రెండుగంటలసేపటిలో నేను మీ మాతులాలయమునకు వచ్చెదను."

అని యామె దక్షిణహస్తమునఁ గుమారి కరపల్లవమును గైకొనెను. హృదయావేగము నడఁచుకొనఁజాలక ఆపవిత్రచిత్త వెక్కి వెక్కి యేడ్వదొడఁగెను.

యువకుఁ డింకేమియుఁ బలుకక, కుమారిని వెంటఁగొని ద్రుతగాముఁడై ఆయాగారమునుండి నిష్క్రమించెను.

సన్నిహిత కర్తవ్యము నూహించుచుఁ బవిత్రప్రణయపాశబద్ధులైన రాబర్టు ఎలిసుల తెరువునుండి గుణవంతుఁడగు తన యంతరంగ మిత్రుఁడు విగసరీ నెట్టులైన దప్పింపఁ దగు వెరవు రోయుచు, మేక్సి మాతని యింటిదిక్కుగఁ జనుచుండ, శుభ్రవసనధారియై, ఆనంద ప్రదీప్తలోచనుఁడై ప్రఫుల్లవదనుఁడై జేబులందుఁ జేతుల నిడికొని యకస్మాత్తుగ మార్గమధ్యమున జర్జటాతనిఁ గలిసికొనెను — బాల కుని రూపమంతయు సంపూర్ణముగ మాఱిపోయెను.

మేక్సియు—కుఱ్ఱా! ఇపుడు పూర్ణారోగ్యమును బడసితివి కాదా?

"అవును.—నే నీవఱలో వ్యాధిగ్రస్తుఁడనై యున్నట్లే నా కిపుడు తోఁచుటలేదు. జ్ఞాపకశక్తిని గూడ మరలఁ బొందఁగలిగితిని—అన్ని విషయములు జ్ఞప్తికి వచ్చినవి."

"అట్లైన నిన్నిపుడు పోనీయను. నీతోఁ జాల మాటాడవలసి యున్నది. ఇంత తొందరగ నెందరుగుచున్నావు?"

"పత్రముల పేటిక నపహరించినవారికి మందసము నెట్లు తెరువవలెనో నేను జెప్పితిని.—అట్లని కౌఁటీనాథునకుఁ జెప్పఁబోవు చున్నాను."

"నే నట్లే యనుకొంటిని. కుసీలై యిట్లు చెప్పఁ దలఁచు చున్నావా?"

... "లేదు.—అట్లు చెప్పుమని మా యవ్వ నన్నంపినది."

ఇది నిక్కముగ దేవి ప్రేరణమని యువకుఁడు వెంటనే గ్రహించెను. ఆమె యాన ననుసరించియే వృద్ధాంగన బాలు నంపెనని

యతఁ డూహింపఁజాలెను.

యువకుఁడు—ఇట్లని నీవు కౌశీపతికిఁ దెలిపితివేని, నిన్నాతఁడు పోలీసుల కప్పఁజెప్పును.—నీ కేమియు భయములేదు.

"భయమేల? కర్తవ్యముకావించి, ఖైదీకావలసివచ్చినను నట్లగుటకు వెనుఁదీయను.—కాని, కుమారి నామాటాడి, అట్టి దండనము విధింపక క్షమింపుమని జనకుని వేఁడును."

"వర్జర్సుగారి హృదయమున దయ జనింపఁజేయుటకే కాఁబోలు బాగుగ ముస్తాబై వచ్చితివి.—నీమాటలు విని యతఁడేమి యోచించునో చెప్పఁజాలను."

"నాకీదుస్తులను దేవి యొసగినది. నేఁడు సాయంకాలము మాయవ్వను, నన్ను, ఆమె వెంట నిడుకొని పోవును. ఇఁక మిమ్ముఁ జూడఁజాలను.—అందుచేఁ జింతగానున్నది."

"ఇపుడు కౌశీపతి యింటలేడు.—ఒకమాఱటునటు పోయి తిరిగి వత్తము."

ఇరువురు పరిసరప్రదేశముల భ్రమణమొనరించుచు, విగసరీ గృహద్వారమును సమీపించిరి. అందొక దీర్ఘకాయుఁడు ద్వారపాలునితోఁ బ్రసంగించుచు, మేక్సిమును జూచి జోహారొనరించి, యిట్లనెను. "స్వామీ! నన్ను గుర్తింపఁగలిగితిరా? ఆనాఁటి నిశీథిని నిర్జనసౌధసమ్ముఖమున మనకు పరిచయము కలిగెను దికదా! కోడి కూఁతఁ గూసినది నేనే.—జ్ఞాపకములేదా? నన్ను గుర్తింపలేక పోవుచున్నారా?"

"గుర్తింపలేకపోవుటేమి?—గుర్తించితిని!"

"నా పేరు గొలాపాట్రిన్. బాల్యమిత్రుఁడు విగసరీని జూడవచ్చితిని. రెండునెలలనుండి యతఁడు నాసంగతి నే కనుఁగొనుటలేదు. నేఁడిచటికి వత్తునని కబురుపంపినను, అతఁ డైవులేకపోయెను.—"

"నేఁగూడ అతని జూచుటకేవచ్చితిని.—నాకును చిక్కే కలిగినది."

"అట్లైన మీయొద్దఁగూడ నతఁడు చలాకీఁజూపుచుండెను. పైకము కొంతచేతికి చిక్కినయెడల, నెంతటివానికైనఁ గన్నులు మీఁదికివచ్చును. రెండు నెలలక్రితము అతనిగర్వమంతయు నెంతవఁగి పోయెనోకాని తనపనికొఱకై నాయింటిచుట్టును దిరిగి, నేననఁ దన కెంతో యభిమానమున్నట్లు నటించెను. చెప్పనేల?—నాచే నొక దొంగజాబుకూడ వ్రాయించుకొనెను."

"ఏమి!—ఏమంటిరి?"

"వర్జర్సుగారి కొఠీయందు పైకము జమఁజేయువారిలో నొక పెద్దమనిషి మఱొకనివద్ద ఏఁబదివేల నాణెము లప్పుఁదీసికొనెను. తన పేరుఁ దెలుపక బాకీదీర్చు నేర్పాటున దొంగజాబుతో నతఁడు ధన మంపెను. బాబయ్యా! మాలోమాటనుడీ! ఏమనుకొనకుఁడు. ఆ యేర్పాటంతయుఁజూడ నది దొంగసొమ్మని తోఁచినది."

"పైక మొసఁగి రండని వినగరీ మిమ్ము వేఁడెనా?"

"అవును.—స్వామీ! నేను నిరుపేదను. కాని, నాకు ధర్మ జ్ఞానము లేక పోలేదు. చెప్పినట్లు పైకమును పెద్దమనిషి చేతి కిచ్చి తిని. సొమ్ముతో నిచ్చిన జాబును వినగరీ యనురోధమున నేనే వ్రాసితిని. నోట్లే కొఠీనుండి వచ్చెనో పైకమందుకొనిన పెద్దమనిషికి దెలియకుండవలెనని యిచ్చినవాని యుద్దేశము. అందుకొనిన యాతఁడు తన చేవ్రాఁత గుర్తించునని వినగరీ నన్నుఁ బట్టెను. సొమ్మొసఁగు పెద్దమనిషి నాకించుక బహుమాన మిచ్చునని వినగరీ యానపెట్టెను—ఆ బహుమాన మేమో నేఁటివఱకు నాకన్నులఁ బడలేదు."

ఉదంతమంతయు వినినంతనే మేక్సీము ముఖము వెల్లనై పోయెను.

అంకలి రహస్యమును బాగుగ హృదయంగమ మొనరించుకొని "ఆయుత్తరమును మీ రిప్పుడు గుర్తింపఁగలరా?" అని యాతఁడనెను.

"నేను వ్రాసిన యుత్తరమును నేనే గుర్తింపలేనా?"

"నాతో రండు."

"స్వామీ! ఎచటికి?"

"వర్జన్సుగారి యింటికి—మీ రాకకు కౌంటీపతి సంతసించును."

"వచ్చుటకు నాకేమియు నభ్యంతరము లేదు. కాని, విగసరీక్షణము లేక—"

"అయ్యా! యేమి చేయుదము; తాము పెద్దమనుష్యులు—పెద్దమనిషి వలెనే ఆచరింపుఁడు. మీకు తప్పక గొప్ప బహుమానము ముట్టును. నా మాట నమ్ముఁడు"

గోలోపార్డిన్ మేస్త్రిము ననుసరించి చనెను—జర్జోలు వారివెంటనే యున్నాఁడు. అతని కంటెయు బోధపడిన ట్లాతని మొగము చెప్పక చెప్పుచున్నది. కౌంటీ చేసుకుటకుయున్న విగసరీ వారికి దృగ్గోచరుఁడయ్యెను. ఇంచుక వారి దెసకు చూచుదెంచి, ముప్పురిని గుర్తించి తోడనే వారి మార్గమునుండి మరలెను!

"అయ్యో! మాయుఁడు. వాని గర్వ మెంతవఱకుఁ దల కెక్కెనో! ముసలను జూచి గిఱ్ఱునఁ దిరిగెను! ఈ పేదవానితోఁ దనకుఁ బరిచయమున్నట్లు మీరెఱిఁగిన యెడలఁ దన గౌరవమునకు హాని కలుగునని సిగ్గుచేఁ దలవంచుకొని యెట్లు పర్విడుచున్నాఁడో!—మంచిది! ఈ బిట్టిపా టెంతకాలముండునో చూతునుగాక" అని మేస్త్రిము వెంటనున్న నూతనవ్యక్తి పలికెను.

"అవును. తప్పించుకొని చనఁదలఁచు యత్నించుచున్నాఁడు. మనము చేతులు కలుపుకొని వచ్చుటఁ జూచి, అతఁడు నా యుద్దేశము గ్రహింప

చెను. వేగ సన్నద్ధుఁడవు—కాలహరణ మొనరింపరాదు."

నూతనవ్యక్తి ఇఁకేమియుఁ బలుకక, యువకు ననుగమించి నడువఁ దొడఁగెను. ద్రుతగతివచ్చి మేక్సిము కోర్టీఁ బ్రవేశించెను.—మాతులుఁ డరుదెంచి, కచేరియందుఁ గూర్చుండెనను కబురు వెంటనే అతనికిఁ దెలియవచ్చెను. అతని వైఖరిజూచిన పరిచారకుల యచ్చెరువునకు మేరలేక పోయినది. నిమిషములో నొకసుందర శకటమువచ్చి ద్వార సమ్ముఖమున నిలిచెను.—చివాలున రాబర్టందుండి యీవలికివచ్చి యొకసుందరాంగిని గరముఁబట్టుకొని బండినుండి దింపెను. రాబర్టు యియల్లాల నిరువురను సాదరముగ నాహ్వానించి మేక్సి యిట్లనెను. "ఇప్పుడే మనకుఁ గోర్టీ యధిపతి దర్శనము లభించును.—సఫల మనోరథులమగుట కేమియు సందియములేదు. జడ్జియు మనకు సాహాయ్యము సలుపును.—అంతియెగాక, దైవకృపవలన మఱొకవ్యక్తి మనకు లభించెను—అతనియొద్ద మంచి ఋజువున్నది."

సహజ సౌందర్య సంశోభితమైన దేవి ముఖము వివర్ణమై పోయియున్నది. రాబర్టు ముఖమంతకంటె నెక్కుడు వెల్లనైపోయెను. దీర్ఘకాలము బంధితుఁడై దారుణ మానసికయాతనానుభవమున నాతఁడు పొగిలెనని వానిముఖముఁ జూడఁగనే స్పష్టముగ బోధపడుచున్నది! దేవి మెల్లగ ముందడుగిడినది. రాబర్టు ఆత్మగర్వము పూర్వమట్లు అక్షుణ్ణమైయున్నది. న్యాయవిచారార్థులై నేఁడు వారాభవనమును జొరలేదనియు, అపరాధిని క్షమించుటకే వచ్చితిమనియు వారినిఁజూడఁగనే బోధపడుచుండెను! వాహినీ సమ్ముఖమున నడచు అటుల సంకల్పశాలియగు సేనానికైవడి మేక్సి మందటికంటె ముందు నడువఁజొడఁగెను. సోపానమాలదాటి, కచేరిహాలంతఁగల గదివాఁకు వారుచేరిరి. జడ్జి గదితలుపుఁ దెఱచెను. అందెవరును లేరు. ప్రక్కనుండి కోర్టీపతి కంఠధ్వని వినఁబడుచుండెను. రంగస్థలమునఁ బ్రవేశింపనున్న నూతన

వ్యక్తి నుద్దేశించి మేక్సి యిట్లనెను! "అయ్యా! ఇత్తఱి మూతోద్భాటు మీఁదనే మాపని యంతయు నాధారపడియున్నది. నామిత్రుని కొరక నికి నిర్హేతుకముగ దుస్సహకళంక మాపాదించినది. ఇపుడా కళంక మును బాపవలెను——బాలుని తో తామీగదిలోఁ గూర్చుండి, నేఁబిలిచినంతనే లోనికి దయచేయుఁడు."

ఇఁక నేమియు ననక మేక్సియు కచేరగదిఁ దాఁటి ప్రక్కనున్న దేవి చేయిఁ బట్టుకొని రాబర్టు గృహమునఁ బ్రవేశించినంతనే, లోపలఁ జొచ్చెను. ఒక సోఫాపై గూర్చుండి ఎలిసు బాహువుమధ్యమున ముఖముమూసికొని, బేలయై వాపోవుచుండెను; ఆగంతువులఁ జూచి ఆపె చివాలున లేచి నిలువఁబడెను. గళము త్తి జనకుఁడామెను గద్దించుచుండెను. వచ్చినవారినిఁ జూడఁగనే అతని క్రోధ మధికమయ్యెను. రాబర్టువెంట మిగలినవారు లేనియెడల నతండు, కోపమునించుకైన నణఁచుకొనఁజాలక దుర్భాష లాడి యుండును. కుమార్తెయొక్క యవస్థగూడ నతని యాగ్రహ మును గొంతవఱకరికట్టెను. ఇంతకుమున్నె ప్రబల మనస్తాపమున నామె మూర్ఛితయయినది.

ఇఁకను నడఁకక వృద్ధుని క్రోధనిర్ఘాతము మేక్సిము పైఁబడెను. ఆరక్తనయనుఁడై యాయువకునిఁ దేఱిచూచి, క్రోధకంపితస్వరమున "ఇంటేమియుఁ బనిలేనివారిని నీవేల దోడ్కొనిరా సాహసించితివి?" అని యతఁ డనెను.

"వీరిని గొనివచ్చినందులకు మరికొంత సేపటిలో మీరు నన్నుఁ బ్రశంసింపక మానరు."

"ప్రశంసయా!——ఏమి పరిహాసము?"

దేవి——మహాశయా! మీతోఁ గొన్నిమాటలు చెప్పవలసి యున్నది; దయయుంచి మాపలుకుల నాలింపుఁడు.

"ఆలింపనక్కఱలేదు;——మీరేమి చెప్పెదరో ముందే యెఱుఁగు

దును.—వలయుదాసిని నాతనను చెప్పియేయున్నది. మీరు రచించిన యద్భుత నాటకమం దొక్క యక్కరమునైన నేను నమ్మఁజాలను; నాయింటినుండి తరిమివేయఁబడిన దుర్మతిని మరల నాగృహమున నడుగు బెట్టనీయుననినొక్కి చెప్పుచున్నాను!" అని చెప్పి యాతఁడు రాబర్టు దిక్కుగ నాల్గంజలు వేసెను.

రాబర్టు చకితుఁడైపోయెను. వృద్ధుని తీవ్రోక్తుల కాతఁడు తగు సమాధాన మీయ గమకించెను; కఠినోక్తులు వాని నోటినుండి కూడ వెలువడిన యెడల వారిసఖ్యత యిఁక గగనకుసుమమే యయ్యెడిది. ఆకస్మికముగ నాతనిదృష్టి ప్రియురాలగు కుమారిపై విక్షేపమగుటచే నేమియుఁ బలుకక మిన్నకుండెను.

రాబర్టు నిర్లక్ష్యముగ నున్నట్లు విలోకించినంతనే కౌశిపతి క్రోధతామ్రాక్షుఁడై జేవినుద్దేశించి యిట్లనెను "ఎంత లజ్జావిహీనత — ఎంత భయరాహిత్యము! — నీగర్వ మెంతవఱకు పెచ్చుపెరుగునో ఇపుడే చూతుముగాక! — కాంతా! నాకుమార్తెకు నేర్పుతో మీరు చెప్పినకథను సావధానుఁడనై వింటిని — నామందసముఁ దెఱచినట్లు తాము తెలిపితిరఁట! ఏకార్య మొనరించిన నువవరావి బిడియముతోఁ దల వాల్చుకొనవలెనో దానిని నల్పినందులకై మీరు గర్వముఁ జెందుచున్నను, నాకవసరము లేదు. కాని నాయధీనమునఁ గార్యదర్శియై మెలఁగిన యీదుర్మతి మీ దొంగతనమునకుఁ దోడ్పడ లేదని నాకుఁ జెప్పరాకుఁడు. నేనాతని గుఱించిన మాట లేమియు విననొల్లను. క్షమింపరాని దుష్కృత్యమును క్షమింప సంసిద్ధుఁడనై యున్నాను; కాని మీ వచనము లేమియు నేను వినఁదలఁచు కొనలేను. మీపల్కులు దోషి కళంకమును బాపఁజాలవు. జారిపద్వార పత్రములను హస్తగత మొనరించుకొనన మీరు యత్నించుట నిజమే యైయుండును. — పైక మపహరించినది రాబర్టగుటకూడ నిజమే! నోట్లుకట్ట నాతఁడు

దొంగిలించెనని వానికడనున్న కల్పితపు యుత్తరమే తెలుపక తెలుపుచున్నది.—ఆకస్మికమే వాపికలువమునకు ప్రత్యక్ష ప్రమాణము! నిజాపరాధము నాచియుంచుటకే అతఁడాపత్రమును సృష్టించెను. సాహసమున్న వాఁడయినచో బైకమొసఁగిన వాఁడెవడో—జాబు వ్రాసిన వాఁడెవడో యతనిని జూపమనుఁడు. ఇదిగో, ఆయుత్తరము బల్లపై నున్నది. ''

మేక్సిము వడిగ ద్వారము దిక్కుగాఁ జని "నిశ్చయముగ మీరు వ్రాసిన వానిని జూడఁ గోరుదురా?—అతఁడీ చెంత గదియందే యున్నాఁడు. మీ రనుమతి నొసఁగుఁడు—ఒసగకపోండు. నే నిపుడే అతనిఁ బిలిచెదను." అని గంభీరముగఁ బల్కి, అవ్వలికిఁ దొంగి చూచి, "మీ రొకసారి లోనికి దయచేయుఁ"డని నూతనవ్యక్తి నుద్దేశించి పల్కెను.

తోడనే యతఁడు గదిలోఁ బ్రవేశించెను.—నేల వఱకు వంగి యతఁ డండతికి నమస్కరించి వెఱగు చూపులు నలువంకలకుఁ బఱుపసాగెను.

కౌంటీపతి—అయ్యా! తమ రెవరు?

"గొలోపార్డిస్! నే నొక గొప్ప—"

"ఇచటి కెందుకు వచ్చితిరి?"

"అవునండి—నే—నేను—నే-ను—ఎ-ఱుఁ-గ—నండి!"

మేక్సిము—నే నెఱుఁగుదును. అయ్యా! ఇటువచ్చి బల్లపైఁ గల జాబు నొకమాఱు తేఱి చూడుఁడు.

చివాలున లేఖను గైకొని "ఇది నే వ్రాసిన యుత్తరమే" అని నూతనవ్యక్తి యనెను.

కౌంటీపతి—మీరు వ్రాసినదా? మంచిది—చూతును గాక! ఈకలముఁ దీసికొని దీని నకలు వ్రాయుఁడు.

తన కేదేని యుద్యోగమిచ్చుటకై కాశీ యధ్యక్షుఁ డట్లనుగు చుండెనని తలఁచి అతఁడు నకలు వ్రాయఁదొడఁగెను. కొన్ని పంక్తులు వ్రాసినంతనే వర్జగున్న "చాలును! మీ రీయుత్తరము నీపెద్ద మనిషి యాదేశానుసారము వ్రాసియుండలేదా?" అని రాబర్టు వంకఁ దర్జని నిర్దేశించి పల్కెను.

"అయ్యా! ఇతఁ డెవరో నే నెఱుఁగ" నని నూతనవ్యక్తి కంపితస్వరమునఁ బల్కెను.

ముఖవైఖరిఁ జూడగనే అతఁడు నిక్కమే వాక్రుచ్చెనని యందఱు గ్రహించిరి.

కాశీపతి—అట్లైన నెవరి మాట చొప్పున, మీరు దీనిని వ్రాసినారు?

"మీకోశాధ్యక్షుఁడు విగనరీ మాట చొప్పున"

"అసత్యము—"

"అసత్యము కాదని ప్రమాణపూర్వకముగఁ జెప్పుచున్నాను. విగనరీ నాబాల్యమిత్రుఁడు. ఒకనాఁటి సంధ్యాసమయమున నతఁడు నకలు వ్రాసి తెచ్చి, ఒకహోటలున నన్నుఁ గలిసికొని నాచే దీనిని వ్రాయించెను. మీ యాదేశానుసారమే తా నిట్లు—"

"ఏమి!—ఇంత సాహసమా?—ఇట్లెన్నఁటికి జరిగియుండదు. విగనరీ సచ్చరిత్రుఁడు. అతని ముందు మీ రిట్లు వచింపఁజాలరు."

"అనుమాన మున్నచోఁ దోడనే వానినిచటికి రావింపుఁడు—నాయెదుట నతఁడు సత్యముపలుకక మానఁడు. నామాట లబద్ధములు కావు."

ఈసరళోక్తులు ముదుసలి పూర్వవిశ్వాసము నించుక విచలితమొనరింప నేమియుఁ బలుకఁజాలక భ్రాంతుని చందమున నతఁడట్టె నిలువఁబడి పోయెను.

జర్జెబు లేఖను ముదుసలిచేతికిచ్చెను. కంపితహస్తుండై కౌశిపతి దానిని దెఱచెను. రహస్యమేమో యందు నిహితమైయున్నదని యెల్లరు గ్రహించి యుద్విగ్నులై చూడఁజొచ్చిరి. ముదుసలి మెల్లగ జాబుఁ జదువ దొడఁగెను. చదువుచుండ నతని ముఖమున భిన్నభావములు ప్రతిఫలించుచుండెను.—అతని చిత్తమందలి యావేగ మెల్ల అతని దృగ్గోచరమయ్యెను. నిముసములో వృద్ధుని మొగము వెల్లనై పోయినది.—లలాటము కుంచితమయినది. ముకుపుటము లెగర సాగినవి. కోడనే అతని కపోలములను డీ కొలఁది యశ్రుబిందువులు జొటజొట రాలెను. పదపడి యతఁడు తలయెత్తి కంపితబాష్పరుద్ధ గళమున "వినుఁడ"ని జాబు నిట్లు చదువఁదొడఁగెను.—

" మహాశయా!

ఈ పత్రమున నా యపరాధము నంగీకరించుచున్నాను. ఘోరదుష్కృత్యమున నేను జేయఁజేసికొంటినని యింతకుమున్నే తాము విని యుందురు. ఎట్టకేలకు నాకు సాయము సలిపిన వ్యక్తి జర్జెబు మేక్సిముల ననుగమించి మీ యాలయమునఁ బ్రవేశించుటఁ గాంచి నా దుష్కృత్యమొదంతము మీకుఁ దెలుప నాతఁడు చనుదెంచెనని గ్రహించితిని. మరల నీప్రియభూమిని గన్నులతోఁ జూడనివిధమున నిందుండి వెడలిపోవుట తక్క నాకు వేఱు తెరవులేదు. నేటి సాయం సమయమునకే దేశము వదలి బహుదూరము పోవఁగలను;—ఇదియే నాకుఁ దగు శాస్తి! అందులకు నేను దుఃఖించుటలేదు. ఉత్తరము వ్రాయుచున్నను నిజకళంకమును మఱుగుపఱచుకొనుట నాయుద్దేశము కాదు. జరిగినసంగతియెల్లఁ దెలిపివేసిన యెడల నన్ను మీరంతగ దూషింపరని యాసించియే మీకు దీనిని వ్రాయుచున్నాను. పత్రముల పేటికను గొనిపోవుటకై బొరిషదొర కౌశి కనుదెంచిన నాఁటి యుదయ మించుక పెందలకడ నేను కచ్చేరికి వచ్చితిని అప్పుడు చూచు నరికి

మందసము తెఱువఁబడియుండెను. మొదటి మాఱు జరిగిన చోర్య యత్నమును గుఱించిన వృత్తాంతమును మీరుఁ దెలుపనందులకు నన్ను నే జాలఁగ దూఱుకొంటిని. రెండవపర్యాయము చోరుల యత్నము విఫలమగుటఁ గాంచఁగనే నామనసు నాయందు లేక పోయెను. నోట్లు కట్ట అపహృతమయ్యెనని నేఁ జెప్పినది వట్టి మాట. కోశీయందు విత్తము జమ చేయు నొక పెద్దమనిషి కీయఁ దలఁచి గతదినము సాయంసమయమున నినుపపెట్టెనుండి నోట్లు కట్ట నీవలకిఁ దీసి నాడ్రాయరులోఁ నుంచిన సంగతి మఱచిపోతిని. మూఁడు నాళ్లైన పిదప నోట్లకట్టను జూచుకొంటిని దానిని జూడఁగనే నామనసున కానందము కలిగినది. పైకముఁ జూపి, నామిత్రుఁడు నిరపరాధియని ఋజువు సేయఁజాలుదు ననుకొంటిని. కాని, దుర దృష్టవశాత్తు ఆనాఁడు మీరుకచేరికి రాలేదు. ఎంత యత్నించినను, ఆనాఁటి సంధ్యాసమయమందైన మిమ్ముఁ గలిసికొన లేక పోతిని. అందుచే నోటులను మీరు మఱునాఁడు నూపదలఁచితిని. కాని కోశాధ్యక్షుఁ డనయినను, ఏఁబదివేల నాణెముల నొక డ్రాయరులోఁ బెట్టినందున నాతప్పు క్షమింపరాని దనియు, అంత దనుక నీయుదం తమును దాఁచి యుంచినందున నాయెడ మీరు కోపింతురనియు నే భయపడితిని. పిదప నామనసున నొక కుచ్ఛితబుద్ధి యుదయించి నది. నన్ను మీకు మీజామాతను గావించుకొని, మీవిపుల సంప త్తిని నాయధీనము సేయు మీరూహింపుట నే నెఱుఁగుదును.— ఈమనోరథము సిద్ధించుట గగన ప్రసూనమును బడయుట యని యవు డవుడు నేను యోజించినను, నాయెడ మీరు చూపు అవ్యాజ ప్రేమవలన నావాంఛ నెఱవేరవచ్చునేమోయని యాశపడితిని. కాని యిట్లని ఎవ్వరి కడఁ దెలుపక, నాయాశను నాహృదయమందే గుప్తముగ నుంచుకొంటిని. నేను మీతనయ యెడ గాఢానురాగము

గలిగియున్నాను.—అనురాగమే నాజీవన పరమావధియని యనుకొంటిని. స్వార్థవశవర్తినై గాని, ధనలోభమునకు లోబడి గాని నేనాసుందరిని ప్రేమింపలేదు.—నా ప్రణయము స్వార్థశూన్యమైనది. నావలె నామెకూడ నిరుపేదరాలై యున్నయెడల నే నందియము లేక, ఆమె సమక్షమున పరిణయప్రస్తావము నెత్తియుందును. నాహితుఁడగు రాబర్టును బరిణయమాడుదునని రహస్యముగ నామె వాగ్దాన మొనరించెనని వినినంతనే నాపరితాపమునకు మేర లేకపోయినది.

మీనిలయము వీడిపోవునప్పుడు తా నిఁక ప్రాన్సునకుఁ దిరిగి రానని రాబర్టు చెప్పియుండెను గదా! అతఁ డంతర్హితుఁడైనందున, మీకొమార్తెకును నాకును నడుమ గల వ్యవధానము కూడ నంతర్హితమైనదనియు, నందుచే నామె నిరాటంకముగ నన్నుఁ బెండ్లియాడ సమ్మతించుననియు జడమతినై నమ్మితిని. ఇట్లుండ నోట్లు కట్ట నాకుఁ గనుపించిన నాఁడే రాబర్టుయొద్ద నుండి నాకొక యుత్తరము వచ్చినది. 'కొలఁది దినములు బ్రిటనీయం దుండి, పేరిసునకు మరలివచ్చితి ననియు, దేశత్యాగ మొనరించుటకు మున్నొకసారి ఎలిసు కుమారిని జూతు'ననియు వ్రాసి, తన విలాసముఁ దెలుపుచుఁ దన్నొకసారి చూడ రమ్మని యతఁడు నన్నుఁ గోరెను. అతని లేఖ నందుకొని నంతనే తాను నిర్దోషియని యతఁడు ఋజువుచేసికొనునని నేఁ దలఁచితిని. చెప్పనేల! నాహృదయమంతయు నిరాశాప్రపూర్ణమైపోయినది. ఈర్ష్యవలన నాచిత్తమున నొక పైశాచిక సంకల్ప ముదయించినది.

నోట్లు కట్ట నిఁక నాకడ నుంచుకొనవలెనను వాంఛ నాకు లేదు. కాని మీకోపభయమున దానిని మీకొసఁగుటకు నాకు సాహసము చాలలేదు. నోట్లను మరలఁ బడయవలెనను నిచ్ఛయే మీకు లేదు.

ఆపాటి సాహసమును మీరంతగ లెక్క చేయరని నే నెఱుంగుదును. ఋణమును దీర్చు సాహస నోటులను రాబర్టున కొసంగవలెనని నేను సంకల్పించుకొంటిని. ఈవిత్త మతని చేతులంబడిన యెడల యథేచ్ఛగ నతఁడు విదేశ ప్రవాసముఁ జేయఁజాలుననియుఁ, దన్మూలమున ధనికుఁడు కాఁజాలుననియుఁ దలఁచితిని. ఎవ్వఁడు దేశత్యాగియై నందున నాజీవన కాంక్ష చరితార్థమగు పథము నిరంతరాయమగునో అతని నీవిధముగ దారిద్ర్యదేవి కబళమునుండి కాఁపాడ నేఁగావించిన యత్నమే నాపాపప్రాయశ్చిత్తమని యెంచుకొని, ఆత్మ ప్రవంచన మొనరించుకొంటిని. కడుంగడు హేయమైన దురభిమానమున కవశవర్తినై, ఈకార్యమునకుఁ గడఁగితినను తలఁపును నాచిత్తము నుండి తుడిచివేయ యత్నింపసాగితిని. అందుచే రాబర్టు మరల నరుదెంచిన యెడల, నతని కాపద నాపాదింపఁజేయుట నాదృఢేచ్ఛ యయ్యెను. బాఁరిషపు దొర యతని నన్వేషించుచుండెనని నే నెఱుఁగుదును. తన పరిశోధనమున నాతఁడు కృతకృత్యుఁడైన యెడల, రాబర్టువద్దనుండు నపహృతవిత్తముఁ బడసి, దొంగ యతఁడే యని నిశ్చయించుననియుఁ, దోడనే మీకును మీమహితమును నావిషయము విదితమగుననియు, కళంకితుఁడైన వ్యక్తి కర్థాంగియగుటకు మీపట్టి యియ్యకొనదనియు నే నూహించితిని.

నాయీపాప సంకల్పమతిహేయము నీచము. అతి కాపురుషోచితము. కాని దైవకృపవలన నాకలుష సంకల్పము వ్యర్థమైపోయినది. మీమేనల్లుని యత్నమున రహస్యమంతయు బయలు పడినది. ఇప్పుడది యందఱకుఁ దెల్లమయినది. రాబర్టేమయ్యెనో నే నెఱుఁగను; కాని నాయీజాబు తగు వేళ మీచేతులఁబడుననియు, నొక నిరపరాధి యెడ ఘోరదుర్న్యాయము జరుపకుందురనియు హృదయపూర్వకముగ నాశించుచు దీని నంపితిని. ధర్మమును బేర్కొని ప్రమాణ

మొనరించి నేమియు వచించుటకు నాకిఁక నధికారము లేదు. ప్రాణము లుండఁగాఁ దిరిగి రాకుండుటకై దేశత్యాగినై పోవుతఱి నీసత్యము వచించి మిమ్ము వంచింపఁ బూనుకొననని తాము గ్రహింతురు గాక!—రాబర్టు నిర్దోషియనియు, నిర్దోషియే గాక మహోత్కృష్ట గుణోపేతుఁడనియు సత్యము వాక్రుచ్చుచున్నాను. బోరిషవ్వు దొర పెట్టెను నాతని శత్రువులు దొంగిలించిరి. మీయధీనమున నున్న వారిలో జర్జెటు మాత్రము వారికి సాయము జేసెను. నేఁ జెప్పవలసిన దంతయు ముగిసినది. ఇపుడు మీయొద్ద నాప్రార్థన యొక్కటి మాత్రమున్నది.—మిమ్ము క్షమాభిక్ష వేఁడుచుండుటలేదు; ఏల యన క్షమాపణకు నేను పాత్రుఁడను గాను—ఈయుద్ధమునిఁ బూర్తిగ విస్మృతించుటయే నాకడగొట్టు కోరికయని వినీతుఁడనై తెలుపుచున్నాను. ఇఁక సెలవు—చిరకరుణామయా! హితకాంక్షీ! మహానుభావా!—సెలవు.—ఈజీవనమునఁ బ్రాణములకన్న నధికముగ నెవరిని ప్రేమించితినో వారందఱికిఁ గూడ సెలవు వేఁడుచున్నాను.—ఈదౌర్భాగ్యుని ముఖము నిఁక వీక్షింపఁజాలరు;—మీయందఱికిని శుభముగు గాక! సర్వైశ్వర్యసుఖములకు మీరధిపతులగుదురు గాక! సెలవు—తుది సెలవు. ఆశాశూన్యుఁడనై, ఆనందశూన్యుఁడనై, ఆశ్రయమాత్ర శూన్యుఁడనైన నీయభాగుని కిఁక భగవానుఁడే శరణ్యము!"

అవిరళోద్గత బాష్పపూరిత లోచనుఁడై, స్ఫీతహృదయుఁడై, ప్రసారిత బాహుయుగళుఁడై, వర్జన్సు రాబర్టును గౌగిలించుకొనెను. తదుపరి వాత్సల్యపురస్సరముగ నతఁడు తన ముద్దుపట్టి లలాటమును జుంబించి, యాపవిత్రాత్ముల పాణుల రెంటిని గలిపెను! ఆదృశ్యమును విలోకించినంతనే మేక్సిము శుష్కనేత్రములు కూడ ఆర్ద్రములై పోయెను. అశ్రుసిక్తనయనుఁడై యతఁడు ఇయస్టా జేవి

దిక్కుగాఁ గృతజ్ఞతాపూరిత దృక్కులను బఱపెను!—అమితాహ్లాదమున నున్మత్తుఁడై జార్జు గంతు లిడసాగెను.

అకస్మాత్తుగ దేవి ముఖము వివర్ణమైపోయినది.—స్ఖలితచరణయై ఆమె వెనుకకుఁ దూలెను. నేల్రాలు నామె తనువల్లరినిఁ బట్టుకొన మేక్సిము చివాలున ముందున కురుదెంచెను.—"అంతయు ముగిసెను! దురాత్ముఁడు నా కెట్లో విషము ప్రయోగించెను—" అనుచుండ దేవి దేహము సుడివడి పోయెను.

ఉపచారము లొనరింప నందఱామె దిక్కుగాఁ బరువిడిరి; కాని వారి ప్రయత్నములన్నియు వృథలైపోయెను!—ఆమె రమణీయ నయన యుగళము మూసికొని పోయినది!—దేహపంజరము నుండి ప్రాణశకుంత మెగసిపోయినది.

* * * *

ఒకమాసము గడచెను. రాబర్టు మెలిసుల కింకను వివాహము కాలేదు. తను ప్రేమ నుద్ధరించి భౌతికసుఖసాధకురాలైన దేవి పరలోకగత యాత్మ యెడ సమ్మానము చూపుచు నెలవఱకు వారు శోకసూచకవస్త్రములను దాల్చిరి. రాఁబోవు మాసమున వారి యుద్వాహమహోత్సవము జరుగును. దేవి ప్రాణములు గొని ఘోరాపరాధ మొనరించిన చికిత్సకుఁడు హత్య జరిగిన దినముండే యదృశ్యుఁడైపోయెను! ఎంత యత్నించినను, ఆపాపి జాడ తెలియరాలేదు. దేవి పానీయమున నాతఁడు విసముఁ గలిపినట్లు పరిశోధన వలనఁ దెలియవచ్చెను. ఆసన్నవిపత్తును గుర్తించిన దగుటచే దేవి ముందే వీలును వ్రాసియుండెను.

తన సంపత్తియం దధికాంశము నామె రాబర్టునకు దాన మొన

గినది. విశ్వసనీయులైన నిజభృత్యులను గూడ నామె సంతసపెట్టెను. అమూల్యమగు దన యూర్మికను, గంకణమును ఆసీమంతిని మేక్సిమునకు నొసంగినది. ఆరెండును దేవి కతిప్రీతిపాత్రములుగా నుండినవి. పావన గుణశోభితమైన నావధూటి పవిత్రస్మృతి నిజహృదయ ఫలకమున ననారతము స్మరించుకొనుచు వెలలేని యాయావస్తువులను దన ప్రాణములకన్న మిన్నగఁ జూచుచు మేక్సిము హృదయశాంతి నపేక్షించి ఇటలీ రమ్యాద్రికి నూతన వధూవరులతోఁ గూడి వెడల నిశ్చయించెను.

సంపూర్ణము

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA109B103 |
| పుస్తకం పేరు | చిన్న వాఙ్మయము |
| తారీఖు | 25-11-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 214,216 |
| లేని పేజీలు | 1TO206 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |